# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938–1972)



సెప్టెంబరు 1974

సంపుటము : 51 : సంచిక : 9 :

[illegible]

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1974


| | | |
|---|---|---|
| ఆనందధుని | డా. మాదిరాజు రంగారావు | 1 |
| విజయనగర చరిత్ర | డా. నేలటూరు వేంకటరమణయ్య | 3 |
| చర్య | శ్రీ కె. శివారెడ్డి | 11 |
| రక్తి | శ్రీ నూతలపాటి గంగాధరం | 12 |
| కథానికా శిల్ప పరామర్శ | శ్రీ దోనెపూడి వెంకయ్య | 13 |
| ప్రయాణం | శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం | 19 |
| పండితరాయల దక్షిణ నాయకత్వం | డా. మహీధర నళినీమోహన్ | 24 |
| మహానంది క్షేత్రము | శ్రీ పి. ఆర్. | 31 |
| జీవన్ముక్తుడు | మరాఠీ మూలం : శ్రీ అనిరుద్ధ పునర్వసు<br>అనువాదం : శ్రీ గాదంశెట్టి శ్రీరాములు | 33 |
| ప్రవరసేనుని సేతుబంధ కావ్యం | శ్రీ తిరుమల రామచంద్ర | 39 |
| **కలగూరగంప** | | **45** |
| **గ్రంథ విమర్శలు** | | **52** |


———

*

# ఆనంద ధుని

## డా. మాదిరాజు రంగారావు

[అరవిందుల—మహాకావ్యం సావిత్రి చదివిన తరువాత పొందిన మానసికమైన అనుభూతిని చిత్రించే కృతి.]

**1**

ఈ క్షణం మేల్కొంది
కాంతి బిందువై,
పొగింది రేఖలుగా
కరిగిస్తూ తమో రాశి.

కల్పన వాస్తవమైంది.
స్థావరం జంగమమైంది.
శూన్యం సంభృతమైంది.
కాలం తెలివి పొందింది.

ఇంతవరకూ అననుభూతంగా
అందని మనోజ్ఞ రూపం
హిరణ్య గర్భం నుండి
ఓంకారం వలె
ఆవిర్భూతమైంది ఈ క్షణం
ఆత్మకు ఇస్తూ ఆనందాకృతి.

లౌకిక వనమంతా ఇపుడు
చివురించింది క్రొత్త తెలివి
సూర్యకిరణ పంక్తుల్లో
ప్రకాశమాన కళ వలె.

అలలో కన్పించే కదలికతో
కలలో దాగిన వాస్తవంతో
కన్పిస్తోంది—చంద్రకళ
ఏ శిరో ఒలంకారమో ?

ఇది మాయ కాదు
మృగతృష్ణ కాదు,
విస్పష్టమైన అనుభవ దర్పణం
ఆత్మను బింబించే క్షణం.

చీకటి కలసిపోతూంది
వెలుగులో తహతహతో
రూపు మాపుకొనే ఆశతో
అగ్నిని గుర్తిస్తూ తెలివితో.

**2**

క్షణాలు గడుస్తున్నాయి
రెక్కలు సాగినింగిలో
కదలిపోయే మబ్బుల వలె.

జీవిత చక్రనేమి క్రమణ వేగానికి
ఎగపి క్రమ్మిన దుమ్ము అణగి
వెలుగుతూంది ఆత్మతేజం.

నిద్రా గుహనుండి
బయటికి వచ్చిన మనస్సు
బ్రతుకుకై అన్వేషణలో
పొందిన అశాంతి వలయం,
చెరగిపోతూంది
ఎక్కడిదక్కడ ఈ క్షణం.

నిప్పునుండి వెలుగు
వేరయి పోయే లోపల
దిక్కులు వెడల్పు చేయజూచే
ధూమ వదనం వివర్ణమౌతూ ంది.

అహంకారం దూకుతూంది సముద్రంలో.
మహాభయం కలుస్తూంది గాలిలో.

మొక్కకు కావాలి
వెలుగూ, నీరూ—
మెలకువకు కావాలి
అనుభవం, వివేకం,

జీవితంలో కన్పించే
సురాసుర శక్తుల సంఘర్షణ
కావాలి ప్రాణభయంనుండి
జీవిత సత్యానికి మార్గం
దైవాభిముఖంగా సాగే పథంలోని
మానసిక సుందర శిల్పాలే దేవతలు!

ఇక్కడ ఎక్కడ ఉంది
వివిధ వస్తు విభేదం!

ఉంది ఒక్కటే ఇక్కడ
ఆత్మ కళా వైవిధ్యం!

మౌనానికీ ధ్యానానికీ
వ్యాఖ్యానంగా ఉంది స్థితి.
లౌకికమూ వాస్తవమూ
దాటుతున్నాయి మనోదిశలు.

ఈ స్థితి ఎలా ఉందంటే
బరువు మోయక పోయేవాడు
మధ్యలో దించుకొని [illegible]
విశ్రాంతి పొందుతున్నట్లుంది.

ప్రతి ఉచ్ఛ్వాస నిశ్వాసంలో
సంధి అయిన స్పందనంతో,
ప్రతి క్రియా [illegible]లో
[illegible] వలయంతో,
ఈ శరీరం [illegible]కి
పరమ యథార్థ [illegible];
ఏ బరువు ఇక్కడ లేదు
దానికి [illegible].

అనాది
ఆనంద వలయం
చేరే విశ్రాంతి,
అనాది
[illegible] రూపం
పొందే ఆకాశం.

3

[illegible]
[illegible]
మధ్య
[illegible].

మృత్యు [illegible] నుండి
స్వాతంత్ర్యాన్ని పొందింది మనస్సు.
[illegible] ఆకాశం
ఆవహించి శబ్దధుని,
కొండలనుండి [illegible] వలె
అడవిలో వాయు ప్రవాహం వలె.

మనస్సు పొందుతూంది
సుందర ప్రవాహ రూపం,
మెరుపుతో వానవచ్చే
వర్షా మృదు భావనతో.

ఎదలో సాగిన లత
పూచింది కళ్లలో పూలు.
విప్పారాయి ఆశలు
పసిడి మొగలి పట్టులవలె.
తల ఎత్తిన ఆశ్చర్యంతో
నిలచింది స్వర్గం దిగి క్రిందికి.

వెలుగు పొరలు చుట్టుకున్న
గాలి అంచుల్లో కదలుతూ
మనస్సు పొందుతూంది
అవిచ్ఛిన్న సంస్కార గంధం.

భూమిని ఆకాశం వలె
ఆకాశాన్ని కాంతి వలె
ప్రకృతిని అనంతశక్తి
స్పృశిస్తూంది పరుసవేదిగా,
ఆదర్శానికీ వాస్తవికతకూ
ఆత్మకూ శరీరానికీ
ఇంతవరకూ ఎరుగని
సూక్ష్మబంధం చేకూరుస్తూ.

జీవిత గమన రీతిలో
హృదయ స్పందన లయతో
శబ్దాలు తొలిచి చేసిన
రమణీయ గవాక్షతి
దాటుతూంది మనోవలయం
మంత్రాక్షర ముఖంతో.

నిశ్శబ్ద వలయం వెనుకనుండి
వినిపిస్తూంది స్వర తరంగం.
స్వర తరంగ వలయాల్లో
బింబిస్తోంది సంగీత చిత్రం.

స్వర్లోకం కదలిపోతూంది
స్పృశిస్తూ శారీరక జగత్తును,
జనవాంతర సౌహృదంతో
వెలుగుతూంది హృదయాకాశం.

మహాశక్తి సౌందర్య కాంతి
ప్రవహిస్తోంది నాలోకి.
పరమానంద కుసుమ పరిమళం
ప్రసరిస్తోంది నానుండి.

# విజయనగర చరిత్ర

## [ రెండవ భాగము ]

### డా. నేలటూరు వేంకటరమణయ్య

### (గత సంచిక తరువాయి)

ఇక రాయల కరిగాపుత్తైన నావాడపతి శకంధర సింధురాధ్యక్షు లెవ్వరో విచారింతము. వీరిలో గడపటివాడైన సింధురాధ్యక్షుడు (గజపతి) మనకు పరిచితుడే. ఇతని రాజ్యము తూర్పు సముద్రతీరమున దక్షిణమున పినాకినీ తీరమునుండి యుత్తరమున గంగాతటమువఱకు వ్యాపించియుండినది. ఇతడు గౌడేశ్వరుడు, ఉత్కళాధినాథుడు. క్రీ. శ. 1513 నుండి 1519 వఱకు కృష్ణదేవరాయలు గజపతి రాజ్యముపై దండుచేసి, యతని దుర్గములను రాష్ట్రమును సర్వమును గైవసము జేసికొని, యతని రాజ్యమునకు రాజధానియైన కటకపురమును దగులబెట్టి, చివర కతని సంధి కొడబఱచి యతని పుత్రికను వివాహమాడుటను మన మెఱుగుదుము. దీనివలన పంచ గౌడములలో రెండైన గౌడోత్కళములను జయించినది వాస్తవమని తెలియుచున్నది కదా.

నావాడపతియు గంగాతీరప్రభువే. చిరకాల మీ నావాడ యెచ్చటిదో తెలియకుండినది. దీని యాచూకి యిటీవల తెలియవచ్చినది. ఇది బీహారు దేశాంతర్గతమైన గయమండలములో నొకభాగమునకు ముఖ్యపట్టణము. కావున కృష్ణరాయలచే నోటువడి యతని కరిగాపైన నావాడపతియు బంచగౌడధాత్రీ పదపాలక వర్గమునకు జెందినవాడే.

ఇక మిగిలియుండు శకంధరుడును నాప్రాంతము వాడే కావలయును. శకంధరుడనునది సికందరను మహమ్మదీయ నామమునకు సంస్కృతీకరణమనియు నతడు క్రీ. శ. 1526 సం॥న మూడునెలలకాలము గుజరాతు దేశమును పాలించిన సికిందరషాహయను సుల్తాననియు దాదాపేబదియేండ్లకు ముందు శ్రీ కొమర్రాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారు గుర్తించిరి. శకంధరుడనునది సికందరునామముయొక్క సంస్కృతీకరణమనుట సరి; కాని యతడు గుజరాతు పాలకుడైన సికందరుషాహయనుట యంగీకార్యముగాదు. ఏలనగా మనచరిత్రయందు పేర్కొనబడిన చరిత్రాంశము లన్నియు క్రీ. శ. 1521 వ సంవత్సరమునకు ముందు సంఘటిలినవే. మఱియు క్రీ. శ. 1526లో దిమ్మరుసు పతనానంతరము విజయనగర సామ్రాజ్యమున గొప్ప కలవరము సంభవించి మూడు సంవత్సరముల కాలము కొండవీటి రాజ్యము సంక్షుభితమై రాయల యధికారము సర్వత్రా చెల్లబడకుండెను. ఈ పరిస్థితులలో కృష్ణదేవరాయలు గుజరాతువంటి దూర దేశముపై దండయాత్ర వెడలుట యసంభవము. కావున కృష్ణదేవరాయల పంచగౌడ దండయాత్ర క్రీ. శ. 1516 నకు ముందే సంభవించియుండవలయును. అగుచేసి, రాయలచే పరాభవాలుడైన యతని కరిగాపైన శకంధరుడు గుజరాతుపాలకుడైన సికిందరు శాహ కాజాలడు. కాదేని మఱి యెవ్వడన్నది ప్రశ్న. జగన్నాథ విజయము అను సంస్కృత నాటకమున గజపతి ప్రతాపరుద్రుడొక సికిందరను మహమ్మదీయ ప్రభువుతో యుద్ధముజేసి జయించినట్లు చెప్పియున్నది. ఆతడు ఢిల్లీ రాజ్యాధిపతి, లోడీవంశజుడు; యమునాపురాధినాథుడైన హుసేన్‌షాహ షర్కీని నోడించి యతని రాజ్యమును హరింపగా నాతడు ప్రతాపరుద్ర గజపతి నాశ్రయించెను. ప్రతాపరుద్రు డాతని కాశ్రయమిచ్చి యాతని పక్షమున సికిందరులోడీతో యుద్ధముజేసి జయముగొనెను. కృష్ణరాయల కరిగాపైన శకంధరు డితడే కావలయును. ఇతడు క్రీ. శ. 1488 మొదలు 1517 వఱకు రాజ్యముజేసియుండుటవలన కృష్ణరాయలకు సమకాలికుడగుచున్నారు. క్రీ. శ. 1516–

18 అలో గజపతి రాజ్యముపై దండయాత్ర నడుపు చుండిన కృష్ణదేవరాయలు అతని నెచ్చటనో దారసిల్లి పరాభూతుని గావించి యుండవచ్చును. ఇది యసంభవముగాదు. నావాడయొక్కస్థానమును రాయల గయ విజయశాసనమును నాతని పంచగౌడధాత్రిమీది దండయాత్ర యిటువైపుననే నడచినదని సూచించుచున్నవి. పైజేసిన వ్యక్త్యైకీకరణమును సమంజసమగునేని కృష్ణరాయలకు సికిందరులోడీతో నేల పోరు సంఘటిలెనో కనుగొనవలసియున్నది. ఉత్తరాపథమున హిందూ మహమ్మదీయ మతములకు ఘర్షణ భీషణముగ జరుగుచుండిన కాలమది. మహమ్మదీయ ప్రభువులు హిందూ మతమును రూపుమాప దృఢసంకల్పులై తాము దలపెట్టిన కార్యమును నెరవేర్చుటకై నిరంతరము కృషి సల్పుచుండిరి. నిజమతమందలి దురభిమానము పెంపున నతడు హిందువులను అతిదారుణముగ బీడించుచుండెను. హిందూదేవస్థానములను బడగొట్టించి వాని స్థానమున మహమ్మదీయుల మసీదులను గట్టించుచుండెను. పూజావిగ్రహములచు అన్యశిల్పములను తునియలు గావించి యా తునియలను మాంస విక్రయమందు తూనికరాలుగ వాడవలసినదని కసాయి వారి నాజ్ఞాపించెను. హిందువుల పుణ్యతీర్థములలో గ్రుంక రాదని శాసించి దేశాంతరగతులయిన యాత్రికులను నతిఘోరముగ బాధించుచుండెను. స్వమతాభి నివిష్టులయిన హిందువులకు బెక్కండ్రను జంపించెను. హిందూరాజ్య రమాదురంధరుడును హిందూధర్మ సంరక్షకుడునైన కృష్ణదేవరాయలు సికందరు లోడీ యొక్క ఘోరకృత్యములను సహింపక యతనిపై దండు వెడలుట సహజమే. పెద్దనగారి శకంధరు డితడె యగునేని కృష్ణరాయల దండయాత్ర విజయవంతముగ సాగెనని తోచుచున్నది.

కృష్ణదేవరాయలు కలుబరిగ దండయాత్ర ముగించుకొని మరల యుత్తర దేశములపై దండు వెడలి నట్లున్నది. మునుపటి దానివలె నిదియు గంగా తీర భూములపై నడచెను. రాయలు మరల నేల యా దూరప్రదేశములపై దండు సేయవలసి వచ్చెనో తెలియదు; కాని మునుపటి దానివలె నిదియు జయవంతముగ కొనసాగెనని కృష్ణరాయలు గయయందు గదాధరస్వామి యాలయమున నిల్పిన విజయ శాసనము దెలుపుచున్నది.

1. స్వస్తి శ్రీ జయాభ్యుదయశా
2. లివాహన శకవర్షంబులు
3. 1444 అగునేటి వృషసం
4. వత్సర ఆషాఢ బ. 13 మ
5. శ్రీ మన్మహా రాజాధి రాజరాజ
6. పరమేశ్వర శీర్యప్రతాప వీర
7. కృష్ణదేవ మహారాయలు
8. వేశంచిన విజయ శాసన
9. మొ॥ తిరుమలదేవి వల్లభక
10. రుణామయ హృదయ రాజకం
11. ఠీరవ ఈశ్వర నరస భూపురందర
12. వరనందన
13. బాసద
14. ప్పవర
15. గండాం
16. కా॥
17. ం.రాశా
18. సనము
19. ముక్కు
20. తిమ్మయ
21. వ్రాసెను [॥*]

పై శాసనమువలన రాయలు గయయందు క్రీ. శ. 1521 లో నొక విజయ శాసనము నెత్తించెనని మాత్రము దెలియుచున్నది; కాని యా శాసనము జెక్కబడియుండు స్థలము కొన్ని యూహల కెడమిచ్చుచున్నది. గయ హిందువుల పుణ్యతీర్థములలో శ్రేష్ఠమైనది. అందు గదాధరస్వామి యాలయము గడు పవిత్రమైనది. వటవృక్షము క్రింద శ్రాద్ధ కర్మ మొనర్చి గదాధరుని సన్నిధిని పిండప్రదానము సేయుట కొఱకు వేలకొలది హిందువులు భరతఖండమునందన్ని ప్రాంతములనుండియు నచటికి మూగుదురు. ఈ స్థలమున రాయలు దానచటికి వచ్చిన యితర రాజులు గాని వారి ప్రతినిధులు గాని చెప్పకొనినటు దానధర్మములను జేసినట్లు చెప్పక, విజయ శాసనము వేయించితి నని యేల ప్రకటించెను? ఈ శాసనమునందు పితాళ ప్రసావనగాని వారి పుణ్యలోకవ్యాప్తికొఱకు చేసిన దానధర్మముల మాటకాని కాగడావేసి వెదకిచూచినను కానరాదు. పైపెచ్చు అది విజయ శాసనమని రాయలు ప్రకటించుచున్నాడు. అగునేని విజయ మెవ్వరిమీద

అనునది ప్రశ్న. ఈ సందర్భమున పెద్దనగారి నావాడ వతి ననుసంధించుకొనవలసియున్నది. నావాడ గయ మండలాంతర్గత పట్టణమని ముందు చెప్పియున్నాడను. కావున గయశాసనము నావాడపతిపై విజయమును ప్రకటించుటకొఱకే నెలకొల్పబడియుండును. అగునేని కృష్ణరాయ లతనితో నేల పోరాడవలసి వచ్చెననునది తరువాతి ప్రశ్న. హిందూధర్మ సంరక్షణకొఱకు యని జవాబు. రాయల గయ దండయాత్ర యప్పుడు తత్ప్రాంతదేశము ఇబ్రహీంలోడీయను ఢిల్లీ సుల్తాను యొక్క సామ్రాజ్యమునం దిమిడియుండినది. అప్పటి మహమ్మదీయ ప్రభువు లనుసరించు రాజ్యాంగ విధానమును బట్టి, నావాడపతియు మహమ్మదీయుడై యుండుట సహజము. అయినయెడల నతడును హిందూమత ద్వేషియై హిందువులను హింసించుచుండెనని మన మూహింపవచ్చును. అతని శిక్షించుటకొఱకే కృష్ణరాయలు దండెత్తివచ్చి యతని పరిభవించి తన విజయమును ప్రకటించుటకై పై శాసనము నెత్తించి యుండును.

ఇంకొక విషయము నిచట గమనించవలసి యున్నది. శాసనగ్రంథ రచయితయగు ముక్కుతిమ్మన స్వవిరచిత పారిజాతాపహరణమునుండి కృష్ణరాయ ప్రశంసాత్మకమైన కందముతో శాసనమును ముగించినాడు. ఇది యవితర్క్యముగ సమకూర్చినది కాదు. అర్థవంతమైనదే. ఒక ముఖ్యవిషయమును దెల్పుటకొఱకే పారిజాతాపహరణములోని కృష్ణరాయ ప్రశంసాత్మక పద్యము లన్నిటినుండి దీని నేర్చికూర్చినాడు. ఈశ్వర నరస కృష్ణరాయుడు బాస తప్పు వరగండాంకుడని తెలియవచ్చు విషయములు రెండే. (1) అది విజయశాసనమని (2) దానిని నెలకొల్పిన యీశ్వర నరస కృష్ణరాయుడు బాస తప్పు వరగండాంకుడని— బాస తప్పు వారనగా నాడి తప్పువారు, సారాంశ మేమనగా నేశత్రువుపై బడిసిన విజయమును ప్రకటించుటకొఱకే శాసనము నెలకొల్పబడెనో యాతడు బాసతప్పెననియు వానిని శిక్షించి యా విషయమునందలి కెఱుక పఱచుటకే గయయందీ విజయ శాసనము నెలకొల్పబడె ననియు నిది యుద్దేశింపబడెను. అనగా నావాడపతియో యతని కధిపతియైన లోడీ సుల్తానో పూర్వము చేసిన యొడంబడిక ననుసరించక విరుద్ధముగ ప్రవర్తించుటవలన రాయలెత్తి వచ్చి యాతని నోడించి యా విషయమును ప్రకటించుటకొఱకే విజయ శాసనమును వేయించెను.

## కృష్ణరాయల చరమదశ

నావాడ దండయాత్ర కృష్ణరాయ లన్యదేశములపై నడిపిన దండయాత్రలలో గడపటిది. అటు తరువాత నత డేదేశముమీదను దండుచేసినట్లగపడదు. కాని సామ్రాజ్యములో రేగిన యల్లరులవలన శాంతి చెడి సంక్షోభము గల్గినది. రాయ లీ యల్లరుల నణచి వేయుటకు దన యావచ్ఛక్తి వినియోగించవలసి వచ్చెను. ఈ యల్లరులకు గారణము న్యూనిజిట్లు వివరించి యున్నాడు.

అప్పటికి రాయలకు వయసు మీఱినది. వార్ధక్యమునం దతడు విశ్రాంతి నందగోరెను. మఱియు నతని కాఱేండ్ల ప్రాయముగల కొడు కొక డుండెను. తన మరణానంతర మా బాలునికి సామ్రాజ్యాధిపత్య మబ్బక పోవచ్చునని శంకించి తాను సజీవుడై యుండగనే యతని సామ్రాజ్య పదమున స్థిరపఱచుట యుక్తమని తలచెను; కావున కృష్ణరాయలు రాజరికమును విడి పుత్రునకు రాజ్యాధిపత్య మొసగి తాను ప్రధానియై సాళువతిమ్మయను దనకు సహాయునిగ జేసికొనెను; రాజ్యాభిషేక మహోత్సవము లెనిమిది నెలల కాలము నడచినవి. ఇంతలో నా యువకుడు జాడ్యగ్రస్తుడై మృతినందెను. తరువాత నా బాలునికి సాళువతిమ్మయ కుమారుడు (తిమ్మదండ నాయకుడు) విషప్రయోగము జేసినాడని తెలియవచ్చెను. అంత గృష్ణరాయలు క్రోధ పరవశుడై యది సత్యమని తలచి సాళువతిమ్మరుసును నతని యనుజుడైన గోవిందరాజును వారి బంధువులగు దండనాయకుల ననేకులను దన సముఖమునకు రప్పించి గర్హించి చెఱసాలయందు బంధించెను. వారిని చెఱయందు బంధించిన పిమ్మట కొండ మరసయ్య కుమారుడగు నయ్యపరుసును ప్రధాని పదమున నియమించెను. కృష్ణరాయల తండ్రి యాజ్ఞానుసారము* నరసింగరాయలను పెనుకొండ దుర్గమున హత్యచేసి చంపినవాడీ కొండమరుసే.

తిమ్మరుసు కుటుంబము మూడేండ్లకాలము కారాగారమున నవయుచుండెను. అంతట తిమ్మరుసు

---

* ఇది పొరపాటు. అన్న యాజ్ఞానుసారము అనుట యొప్పు.

పుత్రుడగు తిమ్మదండ నాయకుడు కారాగారమునుండి తప్పించుకొని పాఱిపోయి దొంగలకును దారిదోపిడి కాండ్రకును ఉనికిపట్టైన పర్వతమునుజేరి యచట తన బంధువగు నొకనాయకుని సాయముపొంది రాయలపై గత్తికట్టి భీకరముగ యుద్ధము సేయగడగెను. కృష్ణరాయలతని బట్టితెచ్చుటకు గొప్ప సైన్యముతో గూడ దన ప్రధాని యయ్యరుసును నియోగించెను. అయ్యరుసు తిమ్మదండ నాయకునికి నెలవైన పర్వతమును జుట్టుముట్టి యతని బట్టి బంధించి రాయల సముఖమునకు దెచ్చెను. అంతట రాయలాతనిని తండ్రి పినతండ్రులతోగూడ వధ్యస్థానమునకంపి బ్రాహ్మణులగుటచే వధింపక కండ్లను బొడిపించి మరల చెఱసాలనైవ నాజ్ఞాపించెను. తిమ్మదండ నాయకుడు చెఱసాలయందే మృతినందెను. అతని తండ్రియగు సాళువ తిమ్మయయు సోదరుడైన గుండరాజును చెఱయందే నవయుచుండిరి.

న్యూనిజు చెప్పిన కథ సత్యాత్మకముగాదని మన వారనేకులు దానిని త్రోసిపుచ్చుచున్నారు. దీనికి కారణము కృష్ణరాయలయందు మనకుగల యభిమానము. ఆయన యుదాత్త ప్రభువు. తిమ్మరుసును పితృతుల్యునిగ భావించి ప్రేమతో యప్పాజీయని పిలుచువాడు. అట్టి ప్రభువు తిమ్మరుసు చెఱసాలయందు నిర్బంధించుటయేకాక కన్నుల నూడబీకించునా? యని విశ్వసించి నిరసించుచున్నారు. కాని చరిత్రకారుని దృష్టియందు రాగద్వేషములకు తావుండరాదు. లభ్యమైన సాక్ష్యమును బరిశీలించి చూడగా న్యూనిజు వ్రాత యసత్యమని తోచదు. న్యూనిజు చెప్పినట్లు కృష్ణరాయలకొక కొడుకుండుట వాస్తవము. అతని పేరు తిరుమలదేవ మహారాయులు. అతడు పుట్టినది శ. 1439 బహుధాన్య (క్రీ. శ. 1518) వర్షమునందలి శాసనములు దెల్పుచున్నవి. మఱియు శ. 1446 తారణ వర్షమున (క్రీ. శ. 1524) మహారాజాధిరాజ పరమేశ్వర వీరప్రతాప తిరుమలయ్యదేవ మహారాయలు విజయనగర సామ్రాజ్యమును పాలించుచుండెనని యాంధ్రకర్ణాట ద్రావిడ దేశములలో బెక్కుతావుల నతని శాసనములు చాటించుచున్నవి. కావున న్యూనిజు చెప్పినట్లతడారేండ్ల ప్రాయమున రాజ్యాభిషిక్తుడగుట వాస్తవము. అప్పటికింకను కృష్ణరాయలు రాజ్యము సేయుచుండెనని సామ్రాజ్యమునం దెల్లయెడల గానవచ్చు నతని శాసనములవలన దెలియుచున్నది. కృష్ణ రాయ సమ్మతిలేక అతడు రాజ్యాభిషిక్తుడగుట యెట్లు? కావున న్యూనిజు చెప్పినట్లు తన కుమారుని కాఱవయేట రాజ్యాభిషేకము జేయుటయు నతని పక్షమున దాను రాజ్యకార్యములను నిర్వహించుటయు నత్యము. క్రీ. శ. 1524 తరువాత తిరుమల దేవమహారాయలు శాసనములు గానరావు. కావున నతడు మృతినందెనని మన మనుకొనవచ్చును. క్రీ. శ. 1524 తరువాత తిమ్మరుసయ్యయొక్క గాని యాతని బంధువులయొక్క ప్రస్తావము కృష్ణరాయల కాలపు శాసనములం దెచ్చటను గానరాదు. కావున రాజకీయరంగమునుండి నిష్క్రమించెనని దృఢముగ జెప్పవచ్చును. మఱియు న్యూనిజు వచించినట్లు కొండ మరసయ్య కొడుకయ్య వరదయ్య రాయల కడపటి రాజ్యవర్షములలో నతనికి ప్రధానియై రాజ్యకార్యములను నిర్వహించుచుండినట్లుదయగిరి కొండవీటి రాజ్యములలో గొన్ని శాసనముల వలన దెలియుచున్నవి. కావున న్యూనిజు చెప్పిన కథ సత్యాత్మకమైనదని యొప్పుకొనవలసి యున్నది.

తిమ్మదండ నాయకుని ప్రస్తావన శాసనముల యందెచ్చటను గానరాదు. ఇకనతని నాయకత్వము క్రింద రేగిన యల్లరుల వృత్తాంతము దెలియరాకపోవుట వింతకాదుకదా. కాని కొండవీటి రాజ్యమునందు శాంతి భద్రతలు చెడి కొంత యలజడి కలిగిన సూచనలు లేకపోలేదు. క్రీ. శ. 1528 లో దంగెడ దుర్గమును శత్రులెవ్వరో ముట్టడించినట్లును జుట్టుపట్లనుండు నలువది నాలుగు గ్రామముల ప్రజలాకోటను సంరక్షించిన శూరు లిద్దరికి కొంత భూమిని పారితోషకముగ నిచ్చినట్లును నచటనుండు శాసనము దెల్పుచున్నది; చాగల్లునందలి మఱియొక శాసనమున నాయూరిలో రెండు పాళ్ల భూమి దేశ సంరక్షకుల కిచ్చినట్లు చెప్పియున్నది. ఈ శాసనములవలన కృష్ణరాయల కడపటి వర్షములలో గొండవీటి రాజ్యమునం దల్లరులు రేగినవని విదితమగుచున్నది. వీనికి కారణభూతుడు తిమ్మదండనాయకుడే కావచ్చును. ఈ యల్లరుల నదను జేసికొని గోలకొండ ప్రభువైన కుతబనములక కొండవీటి రాజ్యముపై దండెత్తివచ్చెను. ఈ దండయాత్ర తారీఖ్-ఇ-మహమ్మదు కుల్లికుత్బ్‌శాహీయను గోలకొండ కుత్బ్

శాహీ సుల్తానుల వంశచరిత్రయందు వర్ణింపబడి యున్నది. ఆ దండయాత్రయందు నడచిన యుద్ధ విశేషములను సంగ్రహముగ నిట్లు చెప్పవచ్చును. కుత్బ్‌శాహీ వంశ స్థాపకుడైన సుల్తాన్‌కుల్లీ కుత్బ్ శాహు విజయనగర సామ్రాజ్యముపై నెత్తివచ్చి కొండవీడు బెల్లంకొండ మొదలగు దుర్గములను ముట్టడి వేసినట్లును నాతని దఱిమివేయుటకొఱకు కృష్ణదేవరాయలు దన యల్లుడైన శివరాయల యాధిపత్యము క్రింద నొక గొప్ప సైన్యమును బంపినట్లును, తురకలతో సరిపోరజాలక హిందువు లరిగాపులై సాలుకు మూడు లక్షల హొన్నులిచ్చి సంధి జేసికొని నట్లు జెప్పియున్నది. ఇదియంతయు వాస్తవమాయని విచారించవలసియున్నది. కొండవీటి రాజ్యమున గానవచ్చు నప్పటి శాసనములను బరిశీలించి చూడగా గుత్బ్‌శాహీ సుల్తానుగాని మఱి యే మహమ్మదీయ ప్రభువుగాని యీ ప్రాంతమును బాలించినట్లగపడదు. మఱియు గృష్ణరాయలకు శివరాయలను నల్లుడుండెననుట సత్యము గాదు. మన కెఱుక పడినంతవఱకు గృష్ణరాయల కల్లుండ్లిద్దఱుండిరి. అళియ రామరాజొక్కడు. మఱ్ఱి వరదరాజు మఱియొకడు. అళియ మహారాజు తమ్ముడైన తిరుమలరాజుగూడ కృష్ణరాయల కల్లుడను నైతిహ్య మొక్కటి కలదు. కాని యది విశ్వాసపాత్రముగాదు. శివరాయలను పేరుగల యల్లుడొక్కడు కృష్ణరాయల కుండెనని రుజువు సేయగల సాధనము లెవ్వియు లేవు. కైరొసను పోర్చుగీసు చరిత్రకారుడు కృష్ణదేవరాయలు తన కడపటి రాజ్య వర్షములలో రాజ్యపరిపాలన కార్యమంతటిని తన యల్లునికిని సైన్యాధిపత్యమును దన యల్లుని సోదరుని కిని యొప్పజెప్పెనని వ్రాసియున్నాడు. పెనుగొండ కైఫీయతులో గృష్ణరాయలు దన యనంతరము రాజ్యాధిపత్యమును వహించుటకు తనకు పుత్ర సంతానము లేకపోవుటవలన తనకూతురును రామరాజునకిచ్చి యుద్వాహముజేసి యతనికి వెంటనే యువరాజ పట్టమును గట్టెనని చెప్పియున్నది. కావున తారీఖ్—ఇ—మహమ్మద్ కుల్లీ కుత్బ్‌శాహీ రచయిత పొరపాటుచే రామరాజనుటకు బదులు శివరాయలని వ్రాసి యుండవచ్చును. అట్లయినను అతని సైన్యములు సుల్తాన్‌కుల్లీ నెదుర్కొని పోరి కొండవీటి కోటను సంరక్షింపజాలక పోవుటవలన సాలుకు మూడు లక్షల హొన్నులు కప్పమిచ్చుట కొడబడి యుతడు సంధి గావించుకొనెననుట నమ్మదగిన విషయము గాదు. చేత జిక్కుటకు సిద్ధముగనున్న కోటను, అందును గొండవీడువంటి యాయపట్టు స్థానమును గప్పము గట్టెదమని యన్నంత మాత్రమున హిందువులకే వదలి పెట్టిపోవుట మహమ్మదీయ ప్రభువుల పద్ధతి గాదు. అట్లు చేసిరని మహమ్మదీయ చరిత్రకారులు స్వమత ప్రభువులకైన పరాజయమును గప్పిపుచ్చుటకు వ్రాయుట సహజమే. రామరాజుకే జయము గల్గినదని తలంచుట యాధార రహితము గాదు. కళాపూర్ణోదయ పీఠికయందు నరసింహనార నృపాలుడు సుల్తాన్‌కుల్లీ నాహవమున నిర్జించి జయము గొన్నట్లు చెప్పియున్నది.

> 'వదలక యుత్కలేంద్రుడు నవాయి
> బరీదు నదంపు దుర్జయున్
> గుదపనవుల్క దల్లడిల గొట్టె
> మహోద్భుత సంగరంబులో
> నెదిరిచి కొండవీటికడ నెవ్వరు సాటి
> విచిత్ర శౌర్య సం
> పద వస నారసింహ విభుపట్టికి
> నార నృపాల మౌళికిన్.'

ఈ నందెల నారపరాజు ఆరవీటి బుక్కరాజునకు మున్మనుమడు, మఱియొక మున్మనుమడయిన అళియ రామరాజు కృష్ణదేవరాయల యల్లుడు. కొండవీటి సంగరమునకు కృష్ణదేవరాయలంపిన దండులో నారవీటి బుక్కరాజు సంతతివారు ప్రాధాన్యత వహించినట్లున్నది. వీరి శౌర్యపరాక్రమములయందు కృష్ణరాయలకు గల నమ్మిక వ్యర్థము గాలేదు. నారపరాజు విజయమే దీనికి సాక్షి. కావున లక్ష్మణరావుగారు వచించినట్లు కొండవీటికడ నోడిపోయినది కుత్బ్‌షాహియేకాని హిందువులుగారని స్పష్టముగ జెప్పవచ్చును.

## రాయచూరు :

కుతపుషాహ కొండవీటిపై నెత్తివచ్చిన సమయముననే యాతని వలెనే ఇస్మాయిలు ఆదల్ఖానుడు రాయచూరు దుర్గము నాక్రమించుకొనదలచి గజాశ్వదళములను గూర్చికొని కృష్ణానదిని దాటి యంతర్వేదిని ప్రవేశించెను. ఆ విషయము దెలియవచ్చినంతటనె కృష్ణరాయలు మండిపడి వెంటనే యశ్వారూఢుడై యెవ్వరికిని చెప్పక రాయచూరువంక సత్వరము స్వారి

చేసి పోయెను. రాయలు వచ్చుచున్నాడను వార్త తెలియ వచ్చినంతటనే యాదిల్ఖానుడు దానటనాగుట శ్రేయస్కరముగాదనియెంచి పరారియాయెను. అంతట కృష్ణరాయలీ క్రింది సందేశము నంపెనట.

'ఇప్పటివఱకు రెండు పర్యాయములు బాస తప్పితివి. అది తప్పినందులకు నీతో యుద్ధము జేసితిని. ఇంకను చేయుదును. నాకరిగాపగునంతవఱకు మానను, బెల్గామును వశపఱచుకొను నంతవఱకు నిన్ను విడువజాలను.'

వర్షాకాలము ప్రారంభమగుటవలన వెంటనే దండయాత్ర నడపుటకు వీలుపడకపోయెను. రాయలు విజయనగరముకు మరలి వచ్చినను దండయాత్ర తగు సన్నాహముల జేయించుచుండెను. కాని యా దండయాత్ర కొనసాగలేదు. దైవ దుర్విలాసమువలన కృష్ణరాయల కారోగ్యము చెడి వ్యాధిగ్రస్తుడై స్వల్పకాలముననే యవతారమును జాలింపవలసి వచ్చెను. కృష్ణరాయలెప్పుడు దేహమును చాలించెనో కచ్చితముగ చెప్పుటకు తగిన సాధనము లింకను లభ్యపడలేదు. క్రీ. శ. 1448 తారణ చైత్ర శు 12 సోమవారమునాడు (క్రీ. శ. 1526) కృష్ణరాయలస్తంగతుడయ్యెనను నైతిహ్యమొకటి లోకమున వాడుక యందున్నది. అళియరామ రాజుదని చెప్పబడు తామ్రశాసనము నందుకూడ నిట్లే కలదు. కాని యిది విశ్వసనీయము గాదు. ఏలనగా కృష్ణరాయల శాసనములు శ. 1451 విరోధి నఱకును వేయించినవి విజయనగరమునం దల్లయెడలను గాన్పించుచున్నవి. శ. 1151 విరోధి వర్ష కార్తిక శు 15 భానువారమునాడు క్రీ. శ. 1529 అక్టోబరు 27 వ తేదిన వ్రాయించిన శ్రీశైల శాసనమునం దప్పుడింకను కృష్ణ దేవరాయలే రాజ్యము పాలించుచుండినట్లు చెప్పియున్నది. శ. 1451 విరోధి, మకర, బ. 13 మంగళవారము (క్రీ. శ. 1530 ఆగస్టు 15 ది) నాటి కడలడి తామ్రశాసనమునం దప్పటికే కృష్ణరాయలు దివంగతుడు కాగా నచ్యుత దేవరాయలు సామ్రాజ్యాభిషిక్తుడై పృథివీ పరిపాలనము సేయు చున్నట్లున్నది. కావున కృష్ణరాయలు క్రీ. శ. 1529 అక్టోబరు 27 వ తేదికిని 1530 ఆగస్టు 30 తేదికిని మధ్య నెన్నడో యొకనాడు స్వర్గస్థుడాయెనని తోచుచున్నది.

## రాజ్యాధిపత్య నిర్ణయము

కుమారుడు తిరుమలయ్యదేవ మహారాయలు గతించిన పిమ్మట కృష్ణదేవరాయలు తన తరువాత సింహాసనము నధిష్ఠింపదగిన వాడెవ్వడో నిశ్చయించుకొనవలసివచ్చెను. సింహాసనమునకు వారసు లనుకొన దగినవారు నలువురుండిరి. (1) మొదట జెప్పదగినవాడు కృష్ణరాయల పుత్రుడు. ఇతని పేరెద్దియో తెలియదు. తండ్రి మరణమప్పు డితడు పదునెనిమిది మాసముల నిసుగని న్యూనిజు తెలుపుచున్నాడు. (2) కృష్ణరాయల యన్న వీరనరసింహరాయల పుత్రుడు. ఇతని పేరు గూడ తెలియదు. వీరనరసింహరాయలు నిజమరణ సమయమున నితనిని సింహాసన మెక్కింప ప్రయత్నము జేసెననియు దత్కారణమున కృష్ణరాయ లాతని చంద్రగిరి దుర్గ కారాగారమున దన రాజ్యాంతకాలము వఱకును బందికృతునిజేసి యుండెననియు న్యూనిజు చెప్పుచున్నాడు. కావున నితడు కృష్ణరాయల మరణకాల మప్పటికి నితని వయస్సిరువదియేండ్లకు పైబడి యుండునని మన మూహించుకొనవచ్చును. (3) కృష్ణరాయల కనిష్ఠ వైమాతురుడైన యచ్యుతదేవరాయలు, వీరనరసింహరాయల పుత్రునివలె నితడును చంద్రగిరి దుర్గమున బంధనమున నుండెను. (4) కృష్ణరాయల జ్యేష్ఠ వైమాతురుడు రంగరాయల పుత్రుడైన సదాశివ దేవరాయలు. ఈ నలువురుగాక కృష్ణరాయల యల్లుడు ఆర్వీటి శ్రీరంగరాజు రామరాజును గూడ నిచట బేర్కొనుట యుక్తము. సర్వసామాన్యముగ సమకాలికు లతనిని అళియ (అల్లుడు) రామరాజని బిలిచెడివారు. వీరి గుణగణములను శక్తిసామర్థ్యములును గృష్ణరాయ లెఱుగనివి కావు. దీర్ఘముగ జింతించి తను గతించిన పిమ్మట రత్నసింహాసనము నధిష్ఠింప నర్హుడు తన సవతి తమ్ముడచ్యుతరాయలె యని నిశ్చయించి యతని గారనుండి విడిపించి యతడె తన యనంతరము విజయనగర సామ్రాజ్యమున కధిపతి యని ప్రకటించెను.

కృష్ణరాయలకు దన నియామకము సర్వసమ్మతము గాదని తెలియును. కావున నది నిర్విఘ్నముగ నెఱవేరుటకొఱకు గొన్ని యేర్పాటులను గావించెను. అందు ముఖ్యమైనది యచ్యుత దేవరాయల కనుకూలు

డైన సాళువ నరసింగరాయ దండ నాయకుని దనకు ముఖ్యమంత్రిగ నియమించుట. సాళువ నరసింగదండ నాయకుడు కాంచీపుర వాస్తవ్యుడైన బ్రాహ్మణుడు. తాళువ కుట్టైన్దర్ భట్టుని పుత్రుడు. ఇతని వాస్తవ నామము చెల్లప్ప. కార్యదక్షములు రెంటియందును నిపుణుడు. తొండీర చోళ మండలముల కధిపతి. స్వామి కార్యనిర్వాహకుడు ఇతనియందు కృష్ణదేవ రాయలకు గల నమ్మకము వమ్ముగాలేదు. రాయుల కడపటి యవస్థ ప్రమాదము నతడచ్యుతరాయలు చంద్రగిరినుండి విజయనగరమునకు వచ్చిచేరునందాక సింహాసనమును విపక్షుల హస్తగతము గాకుండ కాపాడి యతడు వచ్చి చేరినంతటనే యతని కప్పగించెను.

హిందూదేశమును పరిపాలించిన భూపాలురలో కృష్ణదేవరాయలగ్రశ్రేణికి జెందినవాడు. విద్యానగర రాయలలోనేగాక మధ్యయుగమున భారతదేశము నేలిన రాజులయందెల్ల శ్రేష్ఠతముడు. అతడు సర్వశస్త్ర సంపన్నుడైన యోధాగ్రేసరుడనియు, నసాధారణ ప్రజ్ఞానముపేతుడైన దండనాయకుడనియు, నోటమి నెఱుగని విజేతయనియు, బార్బోసకరుణమునందు వచించియున్నాడు. మఱియు నతడు ప్రజలమేలే ప్రభువు మేలని యెఱింగి ప్రజాక్షేమమును దేశక్షేమ మును నభివృద్ధి జేసెను. తఱచు దండయాత్రలను నడపుచు యుద్ధకార్యములందు నిమగ్నుడైయున్నను, సమయమనుకూలమైనపుడెల్ల దనపాలన క్రింది దేశ మందు పర్యటనము సల్పుచు ప్రజల కష్టములను నరయువాడు. సాధ్యమైనంతవఱకు కష్టములను దొలగించి మేలుగూర్చుటకు ప్రయత్నము సేయు వాడు. విజయనగర సామ్రాజ్యమున కరభారమధికము. నిరంతరము సాగుచువచ్చిన తురక పోరాటములవలనగు ధన వ్యయమును భరించుటకు విజయనగరు భూపా లురు ప్రజలపై నానావిధములైన పన్నులను విధించి విత్తమును సమకూర్చువారు. దుర్భరమైనను స్వధర్మ సంరక్షణకొఱకు ప్రజలీకర భారమును సహన ముతో భరించువారు. కృష్ణరాయలీ భారమును సాధ్యమైనంతవఱకు దగ్గించుటకొఱకు ప్రయత్నము జేసెను. ఈ సందర్భమున పెండ్లి పన్ను స్మరింప దగినది. పెండ్లి సమయమందు రాయ సామ్రాజ్య మందలి యష్టాదశ వర్ణ ప్రజలను రాయలకు నిర్ణీత మైన పన్నును జెల్లింపవలసియుండెను. కృష్ణరాయలు

రాజ్యమునకు వచ్చిన క్రొత్తలో సర్వశిరః ప్రధాని యప్పాజీ తిమ్మరుసయ్యయు నాదెప్పనాయకుడును ప్రజలు పెండ్లి పన్నును భరింపజాలక నవయుచున్నా రని విన్నవించగా నాలకించి యా పన్నును రద్దుచేసి యా విషయమును నందఱకు నెఱుకపఱచుటకు ప్రతి రాజ్యమునను దిక్కులనన్నిటిలో శాసనముల నిల్పించెను. కృష్ణరాయలకు తీర్థయాత్రలు సేయుటయం దభిలాష మెండు. స్వయము పరమ వైష్ణవుడైనను శైవ వైష్ణవ క్షేత్రములను భేదమును పాటింపక యన్ని పుణ్యక్షేత్రములకును భక్తితో యాత్ర సేయువాడు. తిరుమల తిరుపతియందు నెలకొనియుండు శ్రీ వేంక టేశ్వరు డాతని కిష్టదైవము. తఱచుగ వేంకటేశ్వ రుని సేవించుటకొఱకు తిరుమలకు పోవువాడు. పోయినపుడెల్ల నా దేవునికి సమర్హమైన భూషణము లును వస్తువాహనములును సమర్పించువాడు. దేవుని సమ్ముఖమున దానును దన దేవేరులును నిలిచి సేవ జేయుచుండునట్లు తమ విగ్రహములను బంగరులోహ ముల బోయించి వేంకటేశ్వరుని యాలయ ప్రాంగణ మున నిల్పుకొనెను. కళింగ దండయాత్రా సందర్భ మున కృష్ణరాయ లమరావతి శ్రీశైలాహోబిల సింహాచలాది పుణ్యస్థానములను సందర్శించి యాయా క్షేత్రాది దేవతలను సేవించి వారికి మణిభూషణ కనకాంబర వస్తువాహనాదుల నర్పించి వారికి నిత్య నైవేద్య పూజాపురస్కారములు సగురీతిని నడచుటకు భూదానములను జేసెను. మఱియు గళింగ దండ యాత్ర ముగిసిన పిమ్మట కృష్ణదేవరాయలు కాళహస్తి చిదంబరాది శైవక్షేత్రములకును శ్రీరంగ కాంచీపురాది వైష్ణవక్షేత్రములకును యాత్రజేసి కావేరీ తామ్రపర్ణీ ప్రముఖ పుణ్యనదులలో తీర్థమాడి చోళపాండ్య కేరళ దేశములందలి బ్రాహ్మణాగ్రహారములను జూచి మరల విజయనగరమునకు విచ్చేసినట్లు రాయవాచక కృష్ణ రాయ విజయములందు చెప్పియున్నది. దీని వాస్తవి కత యాయా స్థలములందు కానవచ్చు కృష్ణరాయల శాసనములవలన రుజువగుచున్నది. మఱియు గృష్ణ రాయలు సింహాద్రియందు జయస్తంభమును నాటిన తరువాత చోళమండలమునకు వచ్చి యచ్చటి శైవ వైష్ణవ దేవస్థానములు డెబ్బదియేడింటిని సందర్శించి యందు నిత్యనైవేద్య పూజాదులు నడుపుటకు చోళ మండలమునుండి రాయల నగరికి చెల్లుచు వచ్చిన పన్ను

లనేకములను సర్వమాన్యముగ దానము జేసినట్లు పుంజై సేండ మంగలము మొదలైన స్థలములందు కానవచ్చు శాసనముల వలన తెలియుచున్నవి.

కృష్ణదేవరాయల కాలమున వాస్తునిర్మాణము బహుళముగ సాగినది. పెక్కు రాజప్రాసాదములును సభా భవనములును నిర్మింపబడెను. విజయనగరమందలి భువనవిజయమును పెనుగొండయందలి గగన మహలును ముఖ్యముగ బేర్కొనదగినవి. ప్రాసాదాదులకంటె దేవతాయతన నిర్మాణములందు కృష్ణరాయ లధికముగ శ్రద్ధ వహించెను. విజయనగరమున విరూపాక్షస్వామి యాలయమునకు గోపురమును విఠ్ఠలేశ్వరునికి రంగ మంటపమును కృష్ణాలయమున అనంతశాయి గుడి యును గట్టించెను. మఱియు గాళహస్తి, చిదంబర తిరువణ్ణామల మున్నగు పుణ్యస్థానములందలి దేవాలయ ములకు గోపుర మంటపాదులను నిర్మించెను. ఇంతేకాదు ద్రావిడదేశమం దనేక స్థలములందు గానవచ్చు రాయ గోపురములన్నియు కృష్ణరాయ నిర్మాణములే. రాయల ననుసరించి యతని దేవేరులు చిన్నాదేవియు తిరుమల దేవియు విజయనగరమున విఠ్ఠలేశుని యాలయమునకు చెఱియొక గోపురమును గట్టించిరి. దేవాలయము తోపాటు శిల్పమును జక్కగ నభివృద్ధి చెందినది. విద్యా నగరమున మహానవమిదిబ్బ హజార రామాలయమున గానవచ్చు చెక్కడపు బొమ్మ లీ సంబంధమున బేర్కొనదగినవి. అవి రాజమందిరమునను పట్టణ మందును జరుగు దైనందిన జీవన విధానమును విశదీకరించుచున్నవి.

కృష్ణరాయలు యుగకర్త. సమకాలికు లతనిని సాహితీ సమరాంగణ సార్వభౌముడని కీర్తించిరి. అనగా నతడు సమరాంగణమునం దెట్లో సాహితీరంగమునం దట్లే సార్వభౌముడని యర్థము. కృష్ణరాయలు విద్యాప్రభు వని ముందు చెప్పితిని. అతడు కవి కల్పతరువు. పండి తులకు పట్టుగొమ్మ. అతని సభా భవనము విద్వత్సదస్సు. అందు జరుగు తర్కవేదాంతాది శాస్త్ర విషయములను గూర్చియు, సారస్వత విషయములను గూర్చియు చర్చలు జరుగుచుండెడివి. అందు రాయల యాస్థాన మున చిరముగానుండు కవులు విద్వాంసులు మాత్రమే కాక యన్యప్రదేశమునుండి రాయల యాహ్వానముచే నాకర్షితులై వచ్చు విద్వద్వరేణ్యులెల్ల పాల్గొనువారు. కృష్ణరాయలే యీ సారస్వత సదస్సున కధ్యక్షుడు. పండితుల వాద ప్రతివాదములను విని యందు విజయులైనవారిని యథోచితముగ సత్కరించువాడు. వ్యాసతీర్థులు, వల్లభాచార్యులు, చైతన్యస్వామి మున్నగు మహామహనీయులు రాయల భువన విజయ సభాంగ ణము నలంకరించి ప్రతిపక్షులను శాస్త్రవాదమున నోడించి యా ప్రభువు సత్కారమును బడసినవారే. ప్రతివర్షమును కృష్ణదేవరాయలు వసంతోత్సవమును మహావైభవముతో నడుపువాడు. ఇందు ఆటలు, పాటలు, నాటక ప్రదర్శనములు, కావ్య పఠనములు మొదలైన విద్యా వినోదము లెన్నియో నడచెడివి. నానా దేశములనుండియు వసంతోత్సవమున దమ విద్యలను బ్రదర్శించుటకై వచ్చిన కవిపండిత గాయక నర్తకీ జనములను రాయలు యెవ్వరెవ్వరి విద్వత్తునకు దగి నట్లు వారిని సత్కరించి యంపువాడు.

కృష్ణదేవరాయలకు తెలుగుభాషయం దభిమా నము మెండు. దేశభాషలందు తెలుగు లెస్సయని ప్రకటించిన ప్రభు వాతడు. సంస్కృత ద్రావిడ కర్ణాట భాషల నాదరించి యా భాషలయందు నూతన గ్రంథములను వ్రాయించి తత్ప్రదయితలను దన యాహ్వానిచే దనియించినను దెనుగున కాతని హృదయమునం దొక ప్రత్యేకస్థానము గలదు. స్వయము తెనుగు కవి కదా! భాషాభిమానముతోపాటు కవిత్వ మహత్త్వము గల్గుట పెరికిదాని యబ్బినట్లాయెను. కృష్ణరాయ లాంధ్ర కవిజన కల్పభూజము. ఆంధ్రదేశమునం దన్ని ప్రాంత ములనుండియు గవులు రాయల సభయందు తమ కవితాశక్తిని బ్రదర్శించి యాయనను మెప్పించి సన్మా నములు బొందుటకు విజయనగరమునకు వచ్చెడివారు. రాయల సభ • యాంధ్రకవుల మేలిమిని దెలుపు యొరపురాయైనది. చింతలపూడి యెల్లనార్యునంతటి మహాకవి స్వవిరచిత రాధా మాధవ కావ్యమును కృష్ణ రాయల సభయందు చదివి విన్పించి తన్మాధుర్యంబున నా ప్రభువును మెప్పించి యాయన యొసగిన రాధా మాధవుడను బిరుదుచే జగత్ప్రఖ్యాతుడనైతినని సగర్వముగ బ్రకటించుకొన్నాడు. ఇట్లు సన్మానముల కొఱకును, బిరుదులకొఱకును నాగంతకులైన కవులుగాక కృష్ణరాయల సభయందు స్థిరముగ బెక్కండ్రాంధ్ర కవు లాశ్రయించి యుండిరి. వారిలో నెనమండ్రు ప్రముఖులు. వీ రానాటి యాంధ్ర సారస్వత ప్రపంచ

మునకు దిగ్దంతులవంటివా రగుటచే వారిని రాయలు అష్టదిగ్గజ కవీశ్వరులని కీర్తించి వారిని తన భువన విజయ సభాభవనమునం దెనిమిది దిక్కుల గూర్చుండ నియమించెను. అల్లసాని పెద్దన, నంది తిమ్మన, మాదయగారి మల్లన, ధూర్జటి, తెనాలి రామకృష్ణుడు, కందుకూరి రుద్రయ, రామరాజభూషణుడు, అయ్యలరాజు రామభద్రుడనువారలీ వర్గములోనివారు. కందుకూరి రుద్రయ స్థానమందు కొందఱు పింగళి సూరనార్యుని పేర్కొందురు. ఈ యెనమండ్రును రాయలకు నచ్చిన కవీశ్వరులేయైనను మొదటి యిరువురిపై యాతని కభిమానము మెండు. ఇందుకు తార్కాణము వారి గ్రంథములనే యాతడంకితము గొనుట. స్తుతిమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకు మాధుర్యమునకు మెచ్చియు నతని కబ్బమును గొనలేదు. నిరంతరమును దన్ను వినోదములచే నానందింపజేయు పాండురంగవిభుని రచనను గైకొనలేదు. అల్లసాని వారి మనుసంభవమును నందివారి పారిజాతాపహరణమునే కోరి వరించెను. వీరిరువురిలోగూడ రాయలకు పెద్దనపైనే నెక్కువ మక్కువ. అతనికాంధ్ర కవితా పితామహుడన్న బిరుదము నొసగెను. గండపెండేరమును తానే చేతులార యతని పాదమున దొడిగెను; ఊరికతడు బోవునపుడతని పల్లకిని తనచేతబట్టి యెత్తెను. వాహ్యాళిబోవు వేళ నతడెదురైన దానెక్కి వచ్చుచున్న మదకరిని డిగి యతనికి గైదండయిచ్చి దానిపై నెక్కించుకొనెను. ఏ సీమ యందతడగ్రహారమును గోరిన నందే [illegible] యొసగెను. ఈ రీతి కృష్ణదేవరాయలు ఆంధ్రమున గవితసెప్పుట వలనను నాంధ్రకవుల నాదరించి పోషించుటవలనను అతనికి ఆంధ్రభోజుడను బిరుదనామము గలిగినది. భోజుని యాస్థానమున గీర్వాణ వాణి [illegible] కృష్ణరాయల సభాస్థానము నందట్లే యాంధ్ర భారతి వర్ధిల్లినది.

(సశేషము)

---

# చర్య

శ్రీ కె. శివారెడ్డి

ఇన్నాళ్ళనుంచి చావిట్లోనే వుంది
పుట్టిన దగ్గరనుంచి మేకుకు కట్టేయబడేవుంది —
కోడెదూడ—బయలు ముఖం చూళ్ళేదు.
బయట కట్టేద్దామని—అవును
బయట కూడా కట్టేద్దామనే తీసుకొస్తుంటే
ఒక గుద్దు గుద్ది—ఎత్తి పడేసి
దేశాలుమీద పడ్డది —
స్వేచ్ఛలో—స్వేచ్ఛగా—స్వేచ్ఛకై—
కట్టేయమంటే—తెంచుకుపొమ్మనే
మేకును గూడా పెళ్ళగించుకు పొమ్మనే
అణచిపెట్టటమంటే—ఎదురులిరగమనే—
జన్మతః అణువుల్లో నిబిడమైన
అసంకల్పిత ప్రతీకార చర్య ఇది.

---

# రక్తి

## శ్రీ నూతలపాటి గంగాధరం

పొనుగు జనించిన ఎర్రని సంజవేళ
విహారం వెళ్లడం రివాజే ఎవరికైనా!

ఊరి సివారున ఏటి కాలువ మలుపు తీరాన
తరతరాల అమాయకత్వానికి చిహ్నంగా
ఆకాశం ఎత్తున పెరిగిన గంగరావి చెట్టు
వంకర టింకర కొమ్మల నీడలు
తూర్పు కొండవైపు సాగి లోకాన్ని కప్పివేస్తుంటే
వింతగా చూశాను
చింతను రుచి చూశాను.

పెరుగుతున్న అమాయకత్వం నీడలో
పసరు గుండెలో పెరిగిన కలుకు ముక్కుతో
పచ్చినెత్తుటి మడుగులో గింగిలా తన్నుకొంటున్న
పచ్చచిలుక చరమ పరిస్థితినిచూచి
పరితపించి పోయాను
మరి తప్పించలేకపోయాను

ఆరిపోతున్న వెలుగు గతీ
ఆవరిస్తున్న ఇరుల సంగతీ
ఏమీ పట్టించుకోని
ఏటి ఒడ్డున నిరాశలాంటి శ్మశానంలో
స్తబ్ధతకు సంకేతంగా లేచిన పహాఘుమను చూచి
'ప్రాణికి ఇంతకుమించి గమ్యంలేదా?
ముందుకు గమించే యోగం కాదా?'
అని విరక్తి చెందాను.

వెనక్కి తిరిగాను
ఇల్లు చేరుకున్నాను
గూటిలో దీపం చిరునవ్వుతో
స్వాగతం పలికింది.
ముఖం కడుక్కోవడానికి వెళ్లాను
పెరటిలో, యూకలిప్టస్ తోపు చాపున,
గిలకబావి ప్రక్కన,
పూచిన మల్లెపందిరి వెనక
అప్పుడే విరిసిన నక్షత్రాలా మెరిసే.
ఆ రెండు కళ్లు నన్ను కవ్వించాయి
అవి బ్రతుకులో
వెన్నెల కురిపించడం కొత్తకాకపోయినా
కొత్త రుచులతో కొత్త శక్తిని కల్పించి
రేపులోనికి నన్ను పురికొల్పుతున్నాయి.



*

# కథానికా శిల్ప పరామర్శ

శ్రీ దోనెపూడి వెంకయ్య

ఆధునిక సాహిత్య ప్రక్రియలలో ఆబాలగోపాలాన్నీ, ఆకర్షించేది కథానిక. దీనికీనాడు అత్యంత ప్రజాదరణ వుంది అందువల్ల ప్రచారమూ వుంది. అసలిది కథానికా యుగం అని అనవచ్చునేమో కూడా. దీనిక్కారణం తెలిసిందే. వార్తాపత్రికలు పెరిగాయి. వార పత్రికలు పెరిగాయి. పక్ష పత్రికలు మాస పత్రికలు వగైరాలు విరివిగా వస్తున్నాయి. వేలకొలది క్రొత్త గ్రంథాలు రచింపబడుతున్నాయి ప్రజల్లో కూడా చదువు సంధలు పెరిగాయి. ఉత్పాత వృద్ధి అయింది. లయితే సమయమే లేదు. ఈనాటి జీవితంలో ప్రతిదానికీ తొందర. ప్రతిదానికీ తొక్కిడి. ప్రతిదానికి ఒత్తిడి. పోటీ. ప్రశాంతత లేదు. అంతా హడావుడి. అంతా ఆదుర్దా ఈ తొందరల మధ్య చదువుకోవటానికి వీలయ్యేవి కథానిక. దైనందిన జీవితంలో నిత్యమూ మనకుండే బాధలూ ఘనం పడే చిరాకూ మనం నెరవేర్చాల్సిన విధులూ—వీటన్నింటి మధ్యనుండి పైకి లాగి మనల్ని ఇంకో లోకానికి లాక్కొనిపోయి కథానిక మనకు అసాధారణమైన వినోదాన్నీ, ఆనందాన్నీ యిస్తుంది. ఉన్నతస్థాయికి చెందిన ఒక మానసిక విశ్రాంతిని యిస్తుంది. శుభ్రమూ స్వచ్ఛమూ అయిన ఈ అసాధారణానుభవం వల్ల కలతబారివున్న మన మనస్సులు కాస్త తేరుకుని సేదదీరి గాలి పీల్చుకోవటానికి వీలవుతుంది. ఇలా చూస్తే కథానిక అనేది ఒక రకమయిన కవితా ప్రక్రియ అనొచ్చు. అందుకనే సాహిత్యంలో కథానికకు అంతటి ప్రాధాన్యత వచ్చింది.

ఈనాడు ప్రజాసాహిత్యం అంటే వాస్తవానికి కథా సాహిత్యమే. ఇదే ప్రజాసామ్య సాహిత్యం. ఈ కథానికలో దేన్నిగురించి అయినా రాయొచ్చు. ఏ వస్తువయినా పనికొస్తుంది. ఎటువంటి పాత్ర అయినా పనికొస్తుంది. పూర్వరంగం ఏదయినా ఉండొచ్చు. చెప్పదల్చుకున్న తత్త్వం ఏదయినా కావచ్చు. విశ్లేషించదలచిన సమస్య ఏదయినా కావచ్చు. ఉద్రేక కవితావేశంలోనుండి వచ్చిన ఖండకావ్యం అయినా కావచ్చు. ఒకానొక జీవితధర్మ నిరూపణం కావచ్చు. అది కల్పితకథ కావచ్చు. యథార్థకథ కావచ్చు. సగం ఇదీ సగం అదీ కావచ్చు. అంటే కథకు పనికిరానిదీ అంటూ ఏమీ లేదు. దీనిలో ఉన్న నియమాలు చాలా కొద్ది. రచన సంక్షిప్తంగా వుండాలి. ఇది దీని ముఖ్యలక్షణం. 1500 మాటలనుండి 15000 మాటలలోగా ఎంతయినా కావచ్చు, ఇంకా తక్కువ అయినా కావచ్చు. అంతమాత్రాన స్పష్టంగా ఉండదని భావించటానికి వీలులేదు. కథానికలో విషయం కళ్ళకు కట్టినట్లు వర్ణింపబడుతుంది సినిమాలోని చిత్రణం లాంటిది అయినప్పటికీ. వాడుక భాషలో వుంటుంది కనుక ప్రతివానికి అర్థం అవుతుంది. అక్షరజ్ఞానంవున్న ప్రతిపాఠకుడూ కథ చదివి ఆనందిస్తాడు. ఇందులో స్త్రీ పురుష విచక్షణ లేదు. చిన్నా పెద్దా తారతమ్యం లేదు.

కథానికలోవున్న ఈ కుదింపువల్ల ఈ మడింపు వల్ల ప్రతిఅంశమూ కేంద్రాభిముఖమై వుంటుంది. దీనిలో జీవితంలోని ఒకానొక అంశాన్ని గ్రహించి అత్యంత క్లుప్తమయిన పరిమితిలో యిమడ్చటం జరుగుతుంది. కథ అనేది ఒక కళాఖండం. దీనిలో ప్రతిమాటా ముఖ్యమే. అందుచేత పందెపు గుర్రం లాగా పాఠకుని మనస్సును ఆకట్టాలి ప్రారంభంనుండీ. ప్రథమ వాక్యంతోటే వేగాన్ని పుంజుకొని కథముందుకు పరుగెత్తాలి. కథలో ప్రారంభమూ ముగింపూ ముఖ్యమైనవి. ప్రారంభించటం అనేది యింకా ముఖ్యమైనది. కష్టమైన పనికూడా అదే. ఒక గొప్పకథ చదివినప్పుడు ఒక జీవిత రహస్యం మనకు తెలిసిపోయిందనిపిస్తుంది. మనం మారతాం. మన దృక్ప

థానికి మరో క్రొత్త పరిణామం సంక్రమించినట్లవుతుంది. కథానికలలో మనల్ని మనం స్పష్టంగా చూసుకుంటాం. మనకు వేయి కళ్లు వస్తాయి. విభిన్న దృక్పథాలు అవగతమవుతాయి. విచిత్రమయిన సన్నివేశాలద్వారా వింతవింత వెలుగులు మన కన్నుల ముందు నిలుస్తాయి. మన మనస్సులు విశాలమవుతాయి మనం ఆశ్చర్య చకితుల మవుతాం.

కథ అంటే ఏమిటో నిర్వచించిన వారిలో 'ఎడ్గార్ ఎలెన్‌పో' అనే అమెరికా రచయిత అత్యంత ప్రముఖుడు. కథా రచయిత కొన్ని సంఘటనల నూహిస్తాడు. వాటి నాధారంగా కథ నిర్మిస్తాడు. అయితే నిపుణుడయినవాడు ఆ సంఘటనల కనువుగా వుండటం కోసం తన భావాలను మార్చుకోడు. తనకొక భావం వుంది. పాఠకుని మనస్సుపై ఆ భావ ముద్రపడాలి. దాన్నికోసం ప్రయత్నిస్తాడు. దాని కవసరమయిన సంఘటనల నూహిస్తాడు. ఆ వూహించిన సంఘటనలను సహజంగా వుండేట్లు చిత్రిస్తాడు. తాననుకున్న ఫలితాన్ని పొందటంకోసం అవసరమయిన సాధన సంపత్తి నంతా సమకూర్చుకుంటాడు. కథలోని మొదటి వాక్యం దగ్గర్నించీ ఒక బిగింపు వుంటుంది. వృథా అయిన వాక్యం వుండదు. ఒక అక్షరంకూడా పొల్లుపోదు. ప్రతిదీ నిర్ణీతమయిన లక్ష్యానికి అభిముఖంగా సాగుతుంది అనుకున్న ఫలితాన్ని సాధించేదిగా వుంటుంది. అది ప్రత్యక్షంగా వుండొచ్చు. పరోక్షంగా వుండొచ్చు. ఇలా వుండాలి కథా రచన. ఇంతటి జాగ్రత్త తీసుకోవాలి. ఇంతటి నైపుణ్యాన్ని ప్రదర్శించాలి. అప్పుడు చివరకు ఒక దృశ్యం నిలుస్తుంది. పాఠకుని మనస్సుపై ఒక చెరగని ముద్రపడుతుంది. ఒక తృప్తి లభిస్తుంది. ఇదీ కథ రాయటం అంటే.

'గయ్‌డీ మొపాసా' అనే ఫ్రెంచి రచయిత ప్రపంచ కథా సాహిత్యానికి మకుట ప్రాయమయిన వాడు. కథా శిల్ప సూత్రాలలో ఎక్కువభాగం మొపాసా పెట్టిన భిక్షే. అతడంత అందెవేసిన చేయి. సిద్ధహస్తుడు. ఫ్రెంచి భాషలో అతడు రాసిన కథలు వందల కొద్దీ వున్నాయి. 'నెక్లెస్' అనే కథ ప్రపంచంలోని అన్ని భాషలలోకీ తర్జుమా అయింది. తెలుగులో కూడా వచ్చింది. ప్రసిద్ధ హిందీ కథకుడు ప్రేమచంద్ దీన్ని అనుకరించి ఇంకో కథ రాశాడు. మొపాసా నీరవమయిన మానవ జీవితపు లోతుల్లోకి చొచ్చుకొనిపోయి అక్కడనుంచి మనుషుల్లోని సంఘర్షణను చిత్రిస్తాడు. ఏ కథ చూచినా చెప్పే పద్ధతిలోనూ చివరికంటూ ఏమవుతుందోనన్న ఉత్కంఠతో చదివించే విధానంలోనూ ఒక అద్భుత నైపుణ్యం ప్రదర్శిస్తాడు మొపాసా. అందుకే మొపాసా కథలు ప్రపంచంలో కథానికా సారస్వతానికి మేలుబంతులని కొనియాడటం జరిగింది. అయితే ఒకటుంది. మొపాసా పరిశీలిస్తాడు. చిత్రిస్తాడు. వ్యాఖ్యానించడు. మొపాసా కథ అంటే ఒక నిపుణుడయిన రిపోర్టర్ వ్రాసికొన్న షార్టుహాండు నోట్సు లాంటిది. దాని తర్జుమా కాదు. మొపాసా స్వీకరించిన ఇతివృత్తాలన్నీ పలురకాలయిన మనస్తత్వాలుకల నాయకులు—అంటే హంతకులు, సంఘద్రోహులు, రౌడీలు, వేశ్యలు—వీరికి సంబంధించి వుంటాయి. అశ్లీల రచనలు చేశాడని ఇంగ్లాండులోను అమెరికాలోను కొందరు విమర్శకులు భావించక పోలేదు. ఇలాంటి కథ లెన్నుకోవటానికి కారణం ఏమిటి అని అంటే ఒకటే సమాధానం. మొపాసా జీవితంలోని పరిస్థితులు అతనికి అలాంటి ఇతివృత్తాలతో పరిచయం కలిగించాయి. ఆ పరిస్థితులు అతనిలో మానవస్వభావాన్ని గురించీ మానవజాతిని గురించీ ఒక దృక్పథాన్ని కలిగించాయి. అది అనేకమందికి ఆమోదయోగ్యం కాకపోవచ్చుగాక.

మొపాసా కథలలో మనస్తత్వ చిత్రణ తక్కువ అనే చెప్పొచ్చు. భావసంఘర్షణను చిత్రించే కథలు కావవి. సంఘటనాత్మక కథలు అవి. ఆకస్మిక సంఘటనలు ఎక్కువ. కథ ప్రధానం వాటిల్లో. శిల్ప నైపుణ్యంతో వాటికి మెరుగులు దిద్దాడు. ఈ శిల్ప చాతుర్యమే అంతటి పేరుప్రతిష్ఠలను తెచ్చిపెట్టింది మొపాసాకు. శిల్పగారడీలు, వస్తువును మించిన ఆర్భాటం, హడావుడి, నాటకీయత వుంటాయని చెప్పొచ్చు. కొన్ని మంచికథలు రాసినా గొప్ప రచయితగా మొపాసాతో మనకు పొత్తు కుదరదేమోనని శ్రీ బుచ్చిబాబు అభిప్రాయం. చలం కథలలో మొపాసా ప్రభావం వున్నదని అంటారు.

'మొపాసాది మహోన్మాదంలోని మహాకవిత్వం. గద్యం పద్యం అనే సరిహద్దులకు అతీతమైనది. పద్యాలేవీ రాయకపోయినా నా కవి. వింత Pensations వెతికి కవిత్వం చేసినవాడు. నాడులవిూదుగా విద్యుచ్ఛక్తి ప్రవహింపజేస్తాడు. నే వెవర్ని గురించి Super-

lative లో మాట్లాడను గనుక ఇది మాత్రం చెబుతున్నాను. కథానకంలో అతనిది ప్రపంచ రచయితలలో ప్రథమశ్రేణి. Short Story కీ lyric కీ భేదం లేదని నా వుత్సాహంలో ఒక్కొక్కప్పుడు అనేస్తుంటానే. దాని కీర్తని కథలే కారణం. అసలా రెంటికీ Technique లో సమీప సాజాత్యం వున్నదిలే. కవిత్వమనే Spirit ని కుంభించుకున్న దివ్యదృష్టి అతని రచనలో కొన్ని భాగాలు. కవిత్వం అనగా ఏమిటి అని నేను వేసుకున్న ప్రశ్నకు జవాబుగా అతనిలోంచే చాలా సామగ్రి ఏరుకోవలసి వుంటుంది.' (వ్యాసక్రీడలు—శ్రీ శ్రీ).

కథానికా శిల్పాచార్యులలో 'ఛెకోవ్' అనే రష్యన్ రచయిత కూడా అగ్రశ్రేణికి చెందినవాడే. అసలు కథానికా రచయితలలో ఛెకోవ్‌గే అగ్రతాంబూలం అని అంటారు. నిజాన్ని సూటిగా చెప్పటమే అసలు సాహిత్య లక్షణం అని అన్నాడు ఛెకోవ్. ముగింపులోని బిగింపులను కాదు మనం ఛెకోవ్‌లో చూసేది. జీవితంలోని కొత్త కోణాలను చూస్తాం అతని కథల్లో. పైకి అతిసామాన్యంగా కనిపించే సన్నివేశంలోనే అసామాన్యమయిన వెలుగుల్ని నింపుతాడు. మామూలు మనుషుల్లోని స్వభావ సౌకుమార్యాలను పైకితీసి చూపిస్తాడు. మనం ఊహింప సాహసింపని విధంగా వుంటాయవి. తాను స్వీకరించిన పాత్రలను గురించి అతనికి పూర్తిగా తెలుసు. వాళ్లను గురించి వర్ణించేటప్పుడు ఆ పాత్ర యొక్క ప్రతికదలికా ఆ పాత్ర స్వభావమూ కళ్లకు గట్టినట్లు చూపిస్తాడు. దానివల్ల ఆ పాత్రలు మనకు అర్థమవుతాయి. బహుకొద్ది మాటలవల్లనే దృశ్యం మనముందు నిలుస్తుంది. ఛెకోవ్‌లో నిజాయితీ వుంది. తన అనుభవానికిరాని భావనలను గురించి రచయిత రాయకూడదు అని అంటాడు అతను. ఒక సమయంలో కలరా వ్యాధి వ్యాపించి అనేకమంది మరణిస్తుంటే తన రచనా వ్యాసంగాన్ని ప్రక్కకునెట్టి వైద్యం చేయటానికి వాళ్ల మధ్యకు దూకాడు ఛెకోవ్. వృత్తిచేత అతడు వైద్యుడు.

శిల్పాన్ని గురించి, ఛెకోవ్ చెప్పిన మాటలు కొన్ని గమనార్హాలు. అనవసరమైందేదీ కథలో వుండకూడదు. కథకు సంబంధంలేని దాన్నంతటినీ నిర్దాక్షిణ్యంగా తీసిపారవేయాలి. గోడమీద ఒక తుపాకి వ్రేలాడుతున్నదని మొదట్లో రాస్తే తరువాత తప్పకుండా దాని ఉపయోగం యేదో వుండాలి. ప్రకృతి వర్ణనలు సహజంగా వుండాలి. సందర్భోచితంగా వుండాలి. క్లుప్తంగా వుండాలి. సంక్షిప్తత అనేది అమూల్యమయిన గుణం అంటాడు ఛెకోవ్. అది వరప్రసాదం వంటిది. ఇంకో విచిత్రమయిన విషయాన్ని చెప్పాడు ఛెకోవ్. కథను రాసి దాని మొదలూ తుదా కట్టివేయాలి అని అన్నాడు. మొపాసా రాసిన కథల్లో నాటకీయత వుంటుంది. ఛెకోవ్ కథల్లో అలాకాదు. మామూలు జీవితాలను గడిపే సాధారణమైన మనుషులను గురించి రాశాడు అతను. రచయిత అయిన వాడు ఉన్నది ఉన్నట్లుగా చిత్రిస్తాడు. ఇక దానితో యేమి చేయాలి అనే దాన్ని పాఠకులకు వదిలివేస్తాడు. ప్రత్యేకమయిన సమస్యలను పరిష్కరించవలసిందిగా ఒక రచయిత నడుగకూడదు. దానికై వేరే స్పెషలిస్టులు ఉన్నారు కదా ఆయా క్షేత్రాలలో అని అంటాడు ఛెకోవ్. కుదించి చెప్పటం కథానికలో అత్యవసరం. ఈ లక్షణమే ఛెకోవ్‌లోని ప్రత్యేకత. అప్రధానమయిన అతిచిన్న విషయాలను తీసుకుని అత్యంత జాగరూకతతో నిపుణతతో అణిముత్యాలవంటి కథలల్లాడు ఛెకోవ్. మూడు వందలకుపైగా కథలుంటాయి అతనివి. అవి తర్వాత వారికి అనేకమందికి మార్గదర్శకాలయాయి.

తనకు మోడల్‌గా మొపాసాను తీసుకున్నానని ఛెకోవ్ చెప్పాడు. అతని కథలన్నీ బాహ్య జగత్తులో జరిగే వాటిని ఆధారంగా తీసుకొని కూర్చినవే. ఏదీ కన్పించదు కల్పన లేకుండా మంచి కథలు వ్రాయవచ్చు, కాని అది గొప్పకథ అవుతుందా అని ప్రశ్నించారు కొందరు. ఛెకోవ్ కథలలో మొదలూ తుదీ ప్రధానంగా కనుపించవు. అతని కథలు యిసుకమీద దిగవిడిచిన చారలవంటివి అని బుచ్చిబాబు అన్నమాట.

ప్రపంచంలోని కథానికా రచయితలలో తరువాత చెప్పుకోదగ్గవాడు 'సోమర్ సెట్ మామ్' అనే ఆంగ్ల రచయిత. మామ్‌లో మొపాసా ఛాయ యున్నాయి. ఇంగ్లీషు మొపాసా అని అతనికి పేరు. మొపాసా అడుగుజాడల్లోనే రచించాడు ఎక్కువ కథలు. జీవితంలో అనుకోని సంఘటనలు సంభవిస్తాయి. దానికి కారణం విధి అనాలి. ఈ రీతిలో రాస్తాడు కథలు. అయ్యో పాపం అని అనిపిస్తుంది మనకు కథ చదివిన తరువాత. దీన్ని మనం మొపాసా రాసిన 'నెక్లెస్' కథలో చూస్తాం.

మామ్‌లో మొపాసాలో వినాటకీయతవుంది. Originality వుంది. చక్కని శైలివుంది. సాహసోపేతమైన సంఘటనల పట్ల అభిలాషవుంది. మామ్ ప్రపంచం అంతా తిరిగాడు. దాదాపు వంద కథలు రాశాడు. తన రచనల మీద కావలసినంత డబ్బు సంపాదించాడు. కథలు ఎందుకు చదువుతారు? ఏమీ చేయటానికి లేనపుడు వినోదంకోసం చదువుతారు. అదే ప్రధానాశయంగా కథలు రాశాను అని అంటాడు మామ్.

మామ్ కి అభిమాన పాత్రమయిన కథావస్తువు వ్యభిచారం. ఏ ఒక్క తత్వానికీ రాజకీయ జాతీయ సిద్ధాంతానికి జాతిమతాలతో ముడిపడి, దృక్పథానికీ కట్టుబడిపోక కేవలం మానవ ప్రకృతిని విశదపరిచే కథలు రాశాడు మామ్. చాలా కథలు సమాజం కూర్చిన నైతిక నమూనాతో ఇముడక పారిపోయి సహజం దృష్టిలో పతనం చెందినవారిని గురించినవే. సాంప్రదాయం శాసించిన జీవిత విధానంపై తిరుగుబాటుచేసి కొత్తదోవ తొక్కే వ్యక్తులంటే మామ్‌కి యిష్టం.

జీవితాన్ని ఉన్నది ఉన్నట్లుగా చిత్రిస్తాను. చెడునూ విమర్శించను. మంచిని పైకి ఎత్తను. సుఖదుఃఖాలను సమంగా చూస్తాను. మనుషుల్లో మంచీ చెడూ కలిసివుంటాయి. వాటిని అలాగే చిత్రిస్తాను అని అన్నాడు మామ్. వినోదాన్ని కలిగించటమే కథారచయిత లక్ష్యం. ఉపదేశం చేయటంకాదు. కథానికను మతప్రచారానికో రాజకీయ ప్రయోజనాలకో ఉపయోగింప జూడటం అంటే దానిని దుర్వినియోగ పర్చటమే అని మామ్ అభిప్రాయం.

మామ్ చాలా కథలు రాసినా ఊహాబలం, కవితాశక్తి, జీవితంపట్ల ఉండాల్సిన గౌరవభావం లోపించాయి. రచనావిధానంలో శిల్పం వుంది. అందరూ చదువుతారు —అని బుచ్చిబాబు. 'నేను'గా చెప్పే కథలు నడపటంలో మామ్ అద్వితీయుడు.

తెలుగు కథారచయితల్లో బుచ్చిబాబుమీద మామ్ ప్రభావముద్ర అత్యధికంగా వుంది.

హెమింగ్వే అన్న అమెరికా రచయిత కూడా సుప్రసిద్ధుడే. ఇతనిలో రుడయార్ కిప్లింగ్‌లోవున్న వర్ణనాచాతుర్యం వుంది. అయితే కవితాలక్షణం లేదు. హెమింగ్వే రాసిన చాలా కథలు రౌడీలు, దొంగల ముఠాలు, హంతకులు — వీరిని గురించినవి. వీళ్ల కథలు రాయటానికి హెమింగ్వే సూటి అయిన తీవ్రమయిన శైలిని స్వీకరించాడు. ఇంగ్లీషులో ఈ రకమయిన రచనలు చేయటంలో తనంతటివాడు లేడనిపించుకున్నాడు.

అమెరికాలో కథానికా శిల్పాన్ని గురించిన అనేక ప్రయోగాలు జరిగాయి. సన్నివేశ చమత్కారం ప్రధానంగా వున్న కథలు 'పో' రాశాడు. క్రమంగా పాత్ర చిత్రణకు మనస్తత్వ చిత్రణకు ప్రాధాన్యత వచ్చింది. బాహ్యసన్నివేశాలతోబాటు అంతర్జగత్తులో కూడా కథా గమనం సాగింది. 'హాథారన్' 'హెన్రీ జేమ్సు' మొదలయినవారి చేతుల్లో ఈ ప్రయోగాలు జరిగాయి. తరువాత దేశీయ వాతావరణాన్ని పూర్వరంగంగా గ్రహించి రచనలు చేయసాగారు. 'బ్రెట్ హార్టే' మొదలయినవాళ్ళ యిలాంటి రచనలు చేశారు. భాషలో కూడా బిగువు చూపి అలంకారికమయిన శైలిలో కథలు రాసినవాడు 'క్రేన్'. 'హెమింగ్వేది' నిరలంకృతమయిన భాష. 'డి. హెన్రీ' ముగింపులో చమత్కారాన్ని ప్రదర్శించి కథలు రాశాడు. 'ఆండర్సన్' చెకోవ్‌వల్ల ప్రభావితుడై రచనలు చేశాడు.

ఇలా అనేకరకాలుగా సాగి కథానిక సర్వాంగ సౌష్టవాన్ని పొందింది. సమస్త శిల్ప విన్యాసాలను ప్రదర్శించింది—ప్రదర్శిస్తున్నది.

తెలుగులో దిగ్గజాలవంటి కథా రచయితలున్నారు. శిల్పానికి మెరుగులు దిద్దిన ఆధునికులయిన రచయితలలో చలం, బుచ్చిబాబు, పద్మరాజు, రా. వి. శాస్త్రి కొట్టవచ్చినట్లు కనిపించేవాళ్ళు. ఉదాహరణగా చెప్పే పేర్లే యివి. యింకా అనేకులున్నారు.

కథలు ఎలా వ్రాయాలి అన్నదానిమీద ఎంతో వైవిధ్యాన్నీ ఎంతో వైచిత్రినీ ప్రదర్శించిన ఈ శిల్పవేత్త లందరిలోనూ కథలు ఎందుకు రాయాలి అన్న విషయం మీద దాదాపు ఏకాభిప్రాయమే వున్నదని చెప్పవచ్చు. మొపాసా అశ్లీల రచనలుచేసి, ఉన్నది ఉన్నట్లు రాస్తాను, మీరు దానితో ఏం చేసుకున్నా సరే అని షార్టుహాండు రిపోర్టరులా చెప్పాడు. చెకోవ్ కూడా అదే మాట అని సమస్యల పరిష్కారానికి స్పెషలిస్టుల దగ్గరికి పొమ్మన్నాడు. వ్యభిచారం అభిమాన వస్తువైన మామ్ కూడా ఉన్నది ఉన్నట్లే రాశా

నన్నాడు. వినోదమే ప్రధానంగాని ప్రచారంకోసం సాహిత్యాన్ని దుర్వినియోగపరచకూడదన్నాడు. హెమింగ్వే సంగతి సరేసరి. తెలుగువారిలో 'చలం' అంతే. కుటుంబరావు కూడా వాస్తవికత ఉండాలన్నవాడే.

గ్రీకు కళలను చూచినట్లయితే యిదే దృష్టి కనుపిస్తుంది. వాటిల్లో ప్రకృతి అనుకరణ వుంటుంది. అచ్చు గుద్దినట్లుగా ఉన్నది ఉన్నట్లుగా వాస్తవిక జీవితానికి సన్నిహితంగా వాళ్లు కళలను తీర్చిదిద్దారు.

అయితే భారతీయ కళల్లో మనకు కనుపించేది యిది కాదు. పాశ్చాత్యులు ప్రకృతిని అనుకరిస్తే భారతీయులు ఆదర్శాన్ని వర్ణించారు. ఉదాహరణకు ఒక గ్రీకు చిత్రకారుడు ఒక మాంసపు ముద్దను చిత్రించాడు అని అనుకుందాం. దాన్ని చూసి ఒక కుక్క నిజంగానే మాంసపు ముద్ద అని అనుకొని మోసపోయి తినటానికి వచ్చింది. అది అంత వాస్తవికంగా వుంది. నిజమే. అయితే ఏమయింది దాని వల్ల? ప్రకృతిని అనుకరించటం ఎందుకు? భ్రాంతిని గొల్పటం ఎందుకు? నిజమయిన మాంసపు ముక్కనే తెచ్చి ఆ కుక్కముందు పడేయవచ్చుగా. వాస్తవికతకు దగ్గరగా వుండటమేకాదు అది పూర్తిగా వాస్తవికంగా వుంటుంది. కుక్కకు ఆకలికూడా తీరుతుంది. కాని భారతీయ దృష్టి ఎప్పుడూ ఆదర్శాన్ని చిత్రించటానికే ప్రయత్నిస్తుంది. అగోచరమయిన దానిని గోచరింపజేయాలని చూస్తుంది. నిజమయిన కళా ప్రయోజనం లభించేది అప్పుడే. కళ అనేది ఒక మల్లెపూవు వంటిది అని అనుకోవచ్చు. అది భూమిలో నుండి పైకి వస్తుంది. తాను జన్మించిన భూమి నుండి సారాన్ని గ్రహిస్తుంది. ఆ భూమిమీదనే వుంటుంది. అయినప్పటికీ భూమిపైన ఎత్తున వుంటుంది. అలాగే కళ అనేది ప్రకృతికీ జీవితానికీ సంబంధించి వుండాలి. దూరంగా వుండకూడదు. నిజమే. వాస్తవికతతో అసలు సంబంధం లేకపోతే కళ దిగజారి పోతుంది. నిష్ప్రయోజన మవుతుంది. కాని కళ అనేది ప్రకృతికి అతీతంగానూ వుండాలి. ప్రకృతినిమించి ఉండాలి. ప్రకృతిని వ్యాఖ్యానించాలి. జీవితాన్ని స్పృశించి, మార్చాలి.

ఇంతేకాదు. కథానికవలన ప్రయోజనం ఏమిటి అనే ప్రశ్నకు వినోదం మాత్రమే అని జవాబు చెబితే అది మనకు తృప్తినీయదు. భారతీయ దృష్టి వేరు. ఒక కథ ఏమిటి, సాహిత్యం అనే దానికి అసలు కళలు అని చెప్పబడే వాటికి ప్రయోజనం మూడు విధాలుగా వుంటుంది. వినోదం, ఆనందం—ఇది మొదటిది. ఇది హృదయైక వేద్యమయిన విషయం. ఆనందానుభవం అంతటితో ఆగదు. అది మనిషిలోని భావనలను సుతిమెత్తని రీతిలో సంస్కరించటం జరుగుతుంది. దాని వలన చిత్తశుద్ధి కలుగుతుంది. ఇది బుద్ధిగతమయిన రెండో ప్రయోజనం. ఈ సంస్కారంవల్ల ఈ చిత్తశుద్ధివల్ల మనిషిలో మంచి పెరుగుతుంది. అతని ఆత్మ అతనికి తెలుస్తుంది. అతని జీవితం మారుతుంది. అతడుచేసే పనులు మారతాయి. అతనిలో దైవత్వం వస్తుంది. ఇది మూడో ప్రయోజనం. ఇది అత్యంత ప్రధానమయిన ప్రయోజనం.

ఈ సమన్వయ దృక్పథాన్ని సరిగా అవగాహన చేసికొని అలవరచుకొని ఒక సమగ్రమైన సామాజిక ప్రయోజనాన్ని సాహిత్యంద్వారా సాధించిన గౌరవం భారతీయులదే.

పాశ్చాత్యులలో ఈ సమన్వయ దృష్టి లేదు. వారికి రెండింటి మధ్యా విభేదం కనుపిస్తుంది. గ్రీకుల సౌందర్యోపాసనకూ క్రైస్తవుల నైతికోపాసనానికీ మధ్యసాగిన సంఘర్షణకిదే కారణం. మనదేశంలో అలా కాదు. దైవాన్ని మనం సౌందర్య భావనతోనే కొలుస్తాం. శ్యామసుందరుడైన కృష్ణుడు కేవలం సౌందర్యరాశి మాత్రమేకాదు. ప్రేమ మూర్తికూడా. పరిపూర్ణమయిన ప్రేమ లేకపోతే పరిపూర్ణమయిన సౌందర్యం ఎక్కడినుంచి వస్తుంది? సంపూర్ణ సౌందర్య భావన లేకపోతే పరిపూర్ణమయిన ఆనందానుభవం ఎలా కలుగుతుంది? మంచికీ అందానికీ విరోధమూ లేదు. వ్యత్యాసమూ లేదు. అందంగా వుండాలి, ఆనందాన్ని యివ్వాలి, అని అంటే అది మంచి వున్నచోటే సాధ్యమవుతుంది. వీనికి అవినాభావ సంబంధం వుంది. ఇవి పరస్పర పూరకాలు.

రససిద్ధుడయినవాడే రచయిత అంటే. రససిద్ధి అంటే సీసాన్ని బంగారంగా మార్చే విద్య అని కూడా. రసానందం మనల్ని బ్రహ్మానందానికి సమీపంగా తీసుకునిపోతుంది. రసానందానుభవంలో ఆధ్యాత్మికత వుంది. అందని ఫలాన్ని కళల ద్వారా అందుకుంటాడు మనిషి. అందుకుని ఆనందిస్తాడు. తన

స్థితి కది నిషిద్ధమే అయినా తన కది పొందరానిదే అయినా, దాన్ని పొందగల్గుతాడు. అందనిదాన్ని అందుకుని కూడా ఆ ఆనందసీమనుండి పతనం చెందడు.

రచన అనేది రసానందంకోసమేనా విశ్వశ్రేయస్సుకా అని ప్రశ్నిస్తే ఆత్మానందం కోసమేనని చెప్పే వాళ్ళున్నారు. అది సంకుచితదృష్టి అని చెప్పి రచయిత సంఘానికి మార్గదర్శకుడు కావాలని అనే వాళ్ళూ ఉన్నారు. సాహిత్యానికి సాంఘిక ప్రయోజనమే ప్రధానం అని వీరంటారు. అంటే అది వేరు ఇది వేరు అని చెప్పే ధోరణి. సాహిత్యం పార్టీ ప్రచారానికి సాధనంగా పని చేయాలని చెప్పేవారి ధోరణ యిది. ఇక్కడ కూడా వర్గాలుగా విడదీసి సంఘర్షణ తెచ్చే ప్రయత్నం ఇది. ఇది వైషమ్యంమీద ఆధారపడిన సిద్ధాంతం. సంకీర్ణమయిన దృష్టి ఇది. కళలను పరిమితం చేయటానికి చేసే యత్నం. రచయితలు కేవలం సంఘ సంస్కర్తలూ ఉపదేశకులూ కాలేరు. కానక్కర లేదు. రసస్ఫూర్తిని కలిగించే అందమయిన రచనలు చేయాలి నిజమే. అయితే అటువంటి రచనలు సత్యంస్కాగాన్ని కలిగించేవిగానే వుంటాయి. రచయిత మనస్సు సమాజ సంస్కరణ భావంపైన నిలిస్తే సాహిత్యపు విలువలు నశించి పోతాయి. సౌందర్యభావన మీదనే నిలిచి రచనలు సాగాలి. అంటే ఆదర్శానికి దూరంగా పోవటం కాదు. ఉదాహరణకు ఒక ప్రయాణీకుడు దారిలో పోతూ రోడ్డు పక్కన ఒక సైన్‌బోర్డు చూశాడు. అతను పోవాల్సిన ఊరి పేరు ఏ వైపు ఉందో తెలియపరిచారు. ముందుకు పోవటానికి అది దోవ చూపిస్తుంది. ఆ సైన్ పోస్టు చాలా అందంగా వుంది. అందుకనే అది అతని దృష్టిని ఆకర్షించింది. అయితే దాన్ని పొగడుతూ అక్కడేవుండక దాన్ని తీసివేసి యింటికితెచ్చి డ్రాయింగ్ రూమ్‌లో అలంకరించి పెట్టుకుంటే ఎలా వుంటుంది? ఇందులో తప్పులేక పోవచ్చునేమోకాని దాని ప్రయోజనాన్ని గురించిన అజ్ఞానం మాత్రం స్పష్టమవుతుంది. ఒక కళాఖండం ఎందుకు సృష్టింపబడిందో మనకు తెలీకుండా దానివల్ల ఆ ప్రయోజనాన్ని పొందకుండా, తతిమ్మా విషయాలను గురించి మాట్లాడితే అంతమాత్రాన ఆ కళాసృష్టిని గురించి మనకు అర్థమయింది ఏమిటి అని చెప్పుకోవాలి? దానిని గురించి మనం ఏమని విమర్శించగలం? ఎలా వ్యాఖ్యానించగలం?

చదివిన కొద్దీ మాటి మాటికి క్రొత్త క్రొత్త అర్థాలు గోచరించి నూతన సత్యాలను స్ఫురింపజేస్తేనే అది అందమయిన రచన అని అనిపించుకుంటుంది. అదే అత్యంత ఆకర్షణీయంగా వుంటుంది. రమణీయత అని అంటేనే అర్థం అదే. సానలుదీరిన వజ్రం ఎటు త్రిప్పితే అటు ఎన్ని రకాలయిన వింత కాంతులు వెదజల్లుతుంటుందో అలాంటిది ఉత్తమమయిన రచన.

ఈ నాడు కథానికా రచయితలు అసంఖ్యాకంగా వున్నారు. వాళ్లీ విషయాన్ని గమనించి తాత్త్విక దర్శనంతో నైతికావేశంతో సౌందర్య దృష్టితో రచనలు చేయవచ్చును. దైనందిన జీవితంలో మామూలు మనుషుల చుట్టూ ఉన్న చిన్న చిన్న విషయాలనూ సాధారణ పరిస్థితులనూ గురించిన కథలే వ్రాయవచ్చుగాక. అంతమాత్రాన కుళ్లనే వర్ణించాలా? బురదను మెచ్చుకోవాలా? పుండుపై రంగు వ్రాసినట్లు కాదా అది? అది సాహిత్య వ్యభిచారం కాదా? సాహిత్యాన్ని మత్తుమందుగా వాడుకోవటం కాదా అది?

అందువల్ల మామూలు వ్యక్తులనూ సాధారణ పరిస్థితులనూ వర్ణిస్తూనే వానిని అధిగమించిన సత్యాలనూ దేశకాలాతీతమయిన శాశ్వత జీవన మూల్యాలనూ వెతకి వెలికితీసి చూపించాలి. అట్టినేర్పును సంపాదించాలి. అట్టి రచనలు చేస్తేనే రచయితలను సమాజంలోని దేవదూతలనీ, ప్రవక్తలనీ, దివ్య జ్యోతులనీ చేసిన వర్ణనలు సార్థకమవుతాయి. అట్టి రచనలవల్లనే మనుషులో పాశవిక ప్రవృత్తి నశించి దైవీ సంపద పెరుగుతుంది. ఈ లోకం నాకం అవుతుంది.

---

# ప్రయాణం

## శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం

జీవితమూ, ప్రయాణమూ ఒకటయినా కాకపోయినా, ఆ రెండిటికీ చాలా పోలికలున్నాయన్నది మాత్రం నిర్వివాదాంశమే.

వర్తమాన పరిస్థితులు—చక్కని జీవితంతోపాటు చక్కని ప్రయాణాన్నికూడా 'అరుదు'చేసి వదులుతున్నాయి.

'చక్కని జీవితం'లాగే 'చక్కని ప్రయాణమూ' మనిషి మనిషికీ నిర్వచనం మార్చుకుంటుంది.

టికెట్‌కొనని వాడికి—రైలుదిగేవరకూ టి. సి. రాక్షసుడెదురు పడకపోతే చాలు, ప్రయాణం సవ్యంగా సాగినట్లే.

టికెట్ కొన్నవాడికి—సీటు దొరికితే తృప్తి. మరికొందరికి కూర్చుందుకు జాగా దొరికినంత మాత్రాన చాలదు. పగలయినాసరే, శయనించేందుకు శయ్య కుదరాలి. అప్పుడే ఆనందం.

లోకో భిన్న రుచిః.

ఒక రైలుపెట్టెలో ప్రయాణం చేస్తున్న ప్రయాణీకులందరికీ తలో రకమయినా కోరికా! ఈ కోరికలెంత విచిత్రాలు !

తాను దిగవలసిన స్టేషనువరకూ రైలు ఆగకుండా పరుగెడితే ఎంత బాగుంటుంది!

ఈ రైలు రెట్టింపు వేగంతో శరంలా దూసుకుపోతే ?

ఏమీ వద్దుకానీ, ఏ ప్రమాదమూ సంభవించకుండా భగవంతుని దయవల్ల సరిగా చేరితే చాలు.

కిటికీపక్క సీటు దొరితే— సింహాసన మెక్కినట్లే ఉంటుంది కొందరికి.

దేశకాలమాన పరిస్థితులకి ప్రతిబింబం రైలుపెట్టె. ముఖ్యంగా— మూడో (రెండవ?) తరగతి రైలుపెట్టె.

ఈ పెట్టెలో ఉండేది — మామూలు మనుషులు,

ఇక్కడ ఎదురయ్యేది — మామూలు జీవితం.

సగటు జీవితం సాక్షాత్కరింపజేసుకోవాలంటే రాజకీయ నాయకులదగ్గరనుంచి — రచయితలనుంకూ యీ రైలుపెట్టెనే శరణు వేడాల.

మామూలు జీవితంలో ఉండే పోలికలన్నీ యీ రైలుపెట్టె ప్రయాణంలో ఉంటాయి.

లంచగొండితనం, కుట్ర, దగా, మోసం, వంచన, ఎడనెడ మంచితనం, కొంచం మానవత్వం, అడపా తడపా విశాల హృదయం, అవినీతి, నీతి— ఒకటేమిటి? అన్నీ ఎదురై పంకరిస్తాయి యిక్కడ.

ప్రతిప్రయాణమూ ఒక అనుభవమే.

ఈ రైలు పెట్టె—చిత్రప్రపంచం. చిత్రమైన ప్రపంచం. ముక్కూ మొహమూ తెలీని మనుషుల మధ్య—నిర్బంధంగా—కొంతకాలం గడపకతప్పదు.

ప్రతివాడికీ తెలుసు—రైలుదిగాక తనకీ మిగిలిన వాళ్లకీ ఎవ్విధమయిన సంబంధమూ ఉండబోదని. ఈ సహచర్యం అశాశ్వతమే అనీ తెలుసు. ఐనా—ప్రయాణీకులు సహజంగా ప్రవర్తించరు.

లేని ఔదార్యం చూపేదొకరు.

ఉండే చిరాకుని దాచుకునే దొకరు.

ముక్కు మూసుకుని తపస్సు చేసుకునే మునుల్లా మౌనందాల్చే దొకరు.

ఉన్నరంగులు దాచుకుని లేని రంగులు బయటపెడుతూ రైలుపెట్టెను నాటకరంగం చేసేది కొందరు.

ప్రపంచ జ్ఞానాన్ని దిగుమతి చేసుకుందుకు చాలా అవకాశాలిస్తుంది రైలుపెట్టె.

అటువంటి ఒకానొక రైలుపెట్టెలో—

నిమ్మకు నీరెత్తినట్లు కూర్చున్నాడతను. అతనే మన కథకి నాయకుడు.

రైలెక్కిన కొంతసేపటివరకూ నలుగురినీ పరికించి నాలుగుమాటలూ విన్నాడు.

కిటికీ పక్కసీటు దొరికింది.

ప్రయాణికుల పాలిటి దేవేంద్ర పదవివంటిదే కిటికీ పక్కసీటంటే.

ఇంకేముంది? అతను మిగిలినవారిమాట మరిచిపోయాడు. హాయిగా కూర్చుని మోచేతులు కిటికీలో ఆన్చి— అవతలకు చూడసాగాడు.

రైలు ముందుకు పరుగెడుతూంటే — కొండలూ చెట్లూ ఓటమితో తలవంచుకుని వెనక్కిపోతున్న దృశ్యం.

ఆ గెలుపంతా తనదే అయినట్లు ఆనందం.

సిగ్నల్సూ, రాబోయే స్టేషనూ ముందే కనిపిస్తాయి.

రైలు దిగకుండా ఏం కావాలంటే అవి కొనుక్కోవచ్చు దగ్గరకి పిలిచి. ఏవిధమయిన ఆత్రుతా లేకుండా ప్లాట్‌ఫారం చూడవచ్చు. ఎవరేగా తెలిసినవారు కనిపిస్తే పిలిచి—దర్జాగా కబుర్లు చెప్పొచ్చు. ఇవన్నీ కిటికీ పక్కసీటిచ్చే సుఖాలు. ఐతే — బొగ్గు నలుసులు కళ్లల్లో పడడంవంటి చిన్నచిన్న దుఃఖాలు కూడా ఎదుర్కోవలసి ఉంటుంది. ఎండ, వాన— కిటికీ పక్కసీటుని వెక్కిరించినా వెక్కిరించవచ్చు. ఇవికాక — 'ఆ తలుపు మూస్తారూ మూస్తారూ?'

'ఆ కాస్త గ్లాసందుకోండి' ఈ కాళీగ్లాసిచ్చెయ్యండి ప్లీజ్' 'ఆ పాన్ వాలాని కేకెయ్యరూ'? వంటి యాతి బాధలుకూడా భరించవలసి ఉంటుంది కిటికీప్రక్క సీటు.

ఐతే—

వాతావరణం చక్కగా ఉండడాన అతను కూర్చున్న కిటికీపక్క సీటు మరింత సుఖంగా ఉంది. ఎండలేదు. మేలి ముసుగు కప్పుకున్న జవరాలి ముఖంలా ఉన్నాడు మబ్బుల వెనుక సూర్యభగవానుడు. ఆకాశం అందమైన అమ్మాయి కట్టుకున్న రంగుల డిజైన్ల చీరలా ఉంది—రంగుల మబ్బులతో.

పచ్చని పొలాలు. మనోహరమయిన దృశ్యాలు. అన్నీ అనుభవించేస్తున్నాడతను— యితరులు మరింత అసూయపడేటట్లు.

ఉండుండి దేనిగురించో దీర్ఘాలోచనలో పడుతున్నాడు.

అంతలోనే మళ్లీ త్రుళ్లిపడి సర్దుకుంటున్నాడు. ఏదో గొణుక్కుంటున్నట్లు అతని పెదవులు కదులుతున్నాయి ఒక్కొక్కసారి.

రైలు పరుగెడుతూంది.

అది చేస్తున్న శబ్దం క్రమబద్ధం కావడాన అదీ లయప్రధానమైన సంగీతమై ఐ హృదయాలను తాకి ప్రకంపనాలు చెలరేపుతూంది.

రైలుతోపాటే కాలమూ పరుగెడుతూంది.

రెండూ పరుగులే. ఒకటే వ్యత్యాసం. ఎట్టి పరిస్థితుల్లోనూ కాలం వెనక్కి జరగదు. ఆగదు.

రైలు ఆగింది. అదో చిన్న స్టేషను. ఏమీ కోలాహలం లేదు.

ఆ పెట్టెలోంచి ఎవరూ దిగలేదు. కాని—

టికెట్ ఎగ్జామినర్ మాత్రం ఎక్కాడు.

తన పెట్టెలోకి అతను ప్రవేశించాడని గ్రహించిన మరుక్షణం కథానాయకుడి ముఖంలో వింతగా మార్పు వచ్చింది. మొదట మందహాసం...అనంతరం ఆందోళన...భయం...అతను ప్రయత్నపూర్వకంగా యథాస్థితికి వచ్చాడు. ఐనా అతని ముఖంలో అసాధారణత కొట్టవచ్చినట్లు కనపడుతూనే ఉంది.

అతను కళ్లు మూసుకుని— సుదీర్ఘాలోచనలో ఉన్నాడో లేక నిద్రపోతున్నట్లు నటిస్తున్నాడో నిర్ధారించి చెప్పడం కష్టమే. ఒకసారి కళ్లు తెరిచి—లేచి అవతలకి వెళ్లబోయే ప్రయత్నం చేయబోయాడు. మళ్లీ అంతలోనే ఆ ప్రయత్నం విరమించుకున్నాడు. చాలా కాళ్లను తప్పించుకుని వెళ్లగలిగినా— టికెట్ ఎగ్జామినర్ కంటపడక తప్పదని అతనికి తెలుసు.

కిటికీ అవతలకి చూస్తూ గంభీరంగా కూర్చున్నాడు. టికెట్ ఎగ్జామినర్ రానే వచ్చాడు.

'టికెట్ ప్లీజ్...'

తనని కానట్లు ఉండిపోయాడు—అవతలకి చూస్తూ.

'టికెట్—' ఈ సారి గట్టిగా.

కథానాయకుడు చలించలేదు.

ఈసారి టికెట్ ఎగ్జామినర్ అతని భుజంమీద తట్టి మరీ అడిగాడు విసుగ్గా 'టిక్కెట్టు...'.

అతను గొణిగాడు—'కొనలేదు—'

కళ్లు చిట్లించి ఓసారి అతని ముఖం చూశాడు తప్ప టికెట్ ఎగ్జామినర్ ఆశ్చర్యపోలేదు. అతని అనుభవంలో యిటువంటివారి నెందరిని చూశాడో!

మిగిలిన ప్రయాణీకులు మాత్రం కళ్లు పెద్దవి చేసి చూశారు. మంచిబట్టలే వేసుకుని—పెద్దమనిషిలా కనపడుతున్నాడు. దర్జాగా కూర్చున్నాడు కిటికీపక్క సీటులో. తీరాచూస్తే టికెట్ కొనలేదు! డబ్బివ్వని వాడు ముందే పడవెక్కాడట. అలాగేఉంది వ్యవహారం—అనుకున్నారు.

'టికెట్ లేకుండా ప్రయాణం చెయ్యడం నేరమని తెలియదూ?'

'తెలుసు.' నీరసంగా అన్నాడు.

'ఎక్కడనుంచి వస్తున్నారు? ఎక్కడికి వెళ్లాలి? డబ్బివ్వండి.' రసీదు పుస్తకమూ పెన్సిలూ సిద్ధంగా పట్టుకున్నాడు టి. యి.

'నాదగ్గర డబ్బులేదు. నేను చాలా పేదవాడిని. కష్టాలలో ఉన్నాను.' లేచి నిలుచుని దీనంగా అన్నాడు. అయోమయంగా అతని ముఖంచూసి—వచ్చే స్టేషనులో—మిమ్మల్ని పోలీస్ కప్పచెప్పవలసి ఉంటుంది.' నా విధి నేను నిర్వర్తించాలి..' అన్నాడు టి. యి.

'నా పరిస్థితి వింటే—మీరంత నిర్దయగా ఉండలేరు.'

టి. యి మౌనాన్ని అంగీకారంగా భావించి—చెప్ప సాగాడు అతను.

'నా పేరు రంగనాథం. వయసు ఏభై రెండు. ఐదేళ్లకింద—నేను చేయని నేరం నెత్తినవేసి ఉద్యోగం నుంచి తొలగించారు. కారణం—రాజకీయాలు.

ఉద్యోగం పోవడంతో పరువూ పోయింది. ప్రైవేట్లు చెప్పుకుంటూ—ఓ పూట పస్తులతో కాలం గడుపుతున్నాను.

పెళ్లీడు కొచ్చిన అమ్మాయితప్ప నాకు సంతానం లేదు. అమ్మాయి శశి—నా ఆరో ప్రాణం. నా పంచ ప్రాణాలూ అన్నపూర్ణ. అంటే నా అర్ధాంగి. సరిఅయిన తిండిలేక—కృశించి పోయింది. ధర్మాసుపత్రికి తీసుకెడితే టి. బి. అన్నారు. మందు లిప్పించగలిగే శక్తి నా కెక్కడిది? ఇంత అసమర్థుడి నయినా—అన్నపూర్ణకి నేనంటే ఎంత ప్రేమో చెప్ప లేను.

కునికే నక్కమీద తాటిపండు పడ్డట్లయింది నా పని.

అమ్మాయి—ఎవరితోనో లేచి పోయింది!

నిజమే. ఏ నాటికీ యీ నాన్న తనకి పెళ్లి చేయలేడని ఆమెకు తెలిసిపోయి ఉంటుంది. నన్ను బాధపెట్టడం యిష్టంలేక తనదారి తాను చూసుకుంది.

శశి లేఖ.

'నాన్నా!'

జీవితం లాటరీ అన్నది నిజమే అని నా నమ్మకం. మన యింటి పరిస్థితి నాకు పూర్తిగా తెలుసు. ఇంతకంటె మనం చెడిపోయేదీ ఏమీ ఉండదు. నా గురించి...నా భవిష్యత్తు గురించి—నువ్వూ అమ్మా ఎంత దిగులుపడుతున్నారో నేనర్థం చేసుకున్నాను. చెయ్యని నేరానికి నువ్వు శిక్ష అనుభవిస్తున్నావు. విధి వసిరేసిన జాతకాలు మనవి. అమ్మాయి పెళ్లి చెయ్యరేం అని నలుగురూ నిన్నాడి పోసుకోడం నాకు వినపడుతూనే ఉంది. ఈ మనుషులకి జాలి లేదు నాన్నా. సానుభూతి లేదు. మీ గుండెలమీద నిప్పుల కుంపటిగా బ్రతకడం—నాకు దుర్భరమై పోతోంది. ముఖ్యంగా అమ్మ ఆరోగ్యం చెడటానికి నేనే మూలకారణమేమో అన్న—అనుమానం బలంగా పీడిస్తూంది.

అందుకు—

మీ సమస్యను పరిష్కరించేందుకు—

ఎలాగూ లాటరీయే ఐన జీవితాన్ని పణంగా పెట్టి జూదం ఆడుతున్నాను. గెలిచానో—అందరమూ సుఖపడతాం. ఓడిపోతే—మీకు తెలియనివ్వను. మీ మనసు కష్టపెట్టను.

నేను లేచిపోతున్నాను నాన్నా.

ఆశీర్వదించు. నీ దీవెనలు నాకు తప్పకుండా అందుతాయి.'

శశి ఉత్తరమే మిగిలింది మాకు.

ఆమె చేసింది తప్పు అనడానికి సాహసించలేను. అదీ నా పరిస్థితి. చాలా తెలిసియిు శశి—యిలా చేసిందంటే—అందుకు తగిన కారణాలుండనే ఉన్నాయి.

నేనూ అన్నపూర్ణా మిగిలాం.

శశి గురించి -నిజం తెలియనివ్వలేదు నేను.

అప్రియమయిన నిజం చెప్పడంకంటె మౌనమే మేలు కదా?

ఇదంతా రెండు సంవత్సరాలనాటి కథ.

అన్నపూర్ణ ఆరోగ్యం మరింత చెడింది.

హాస్పిటల్లో చేర్చాను.

ఇన్నాళ్లయ్యాక శశినుంచి ఉత్తరం వచ్చింది. టెలిగ్రాం—మూడే ముక్కలు.

'నాన్నా... ఒక్కసారి... రా.'

హాస్పిటల్లో ఉండగా టెలిగ్రాం తెచ్చియిచ్చాడు మెసెంజర్. అన్నపూర్ణకి విషయం తెలిసిపోయింది.

'నా ప్రాణం మీ చేతులలో తప్పపోదు. అమ్మాయి ఎలా ఉందో? చూసి రండి—'

చేతిలో చిల్లిగవ్వలేదు. ఎలా వెళ్లేది ?

నా కయితే ఆత్రతగానే ఉంది, ప్రాణంలో ప్రాణంగా పెంచుకున్న అమ్మాయి, రమ్మని ప్రాధేయ పడితే వెళ్లకుండా ఉండడం రాతి గుండెలకి తప్ప మామూలు మనిషికి అసాధ్యం.

నా మనసు తెలిసినదానిమల్లె—మంగళసూత్రం తీసి నా చేతుల్లో పెట్టింది అన్నపూర్ణ.

'పూర్ణా! బావురుమన్నాను నేను.

'మాంగల్య బంధంకంటె- మానసిక బంధం గొప్పది.

'వేగం వెళ్లిరండి.'

మంగళసూత్రం అమ్మ బుద్ధిరాలేదు. తాకట్టు పెట్టినా విడిపించుకునే శక్తి ఉండదు.

మొండిగా రైలెక్కాను.

భగవంతుడి అనుగ్రహంవల్ల ఏ ఆటంకమూ లేకుండానే అమ్మాయి దగ్గరకు వెళ్లాను.

ఆ చిన్న పూరిగుడిసెలో — ఒంటరిగా నరక యాతన పడుతుంది శశి. నన్ను చూడగానే—అంత బాధలోనూ ఒక్కసారి ఆమె కళ్లు మెరిగాయి.

'వచ్చావా నాన్నా! పాపిష్టిదాన్ని...ఎంత శ్రమ కలిగించానో! ఈ క్షణాలలో నిన్నొకసారి చూడాలన్న కోరికను అణచుకోలేకపోయాను. క్షమించు నాన్నా. అమ్మకి నా నమస్కారాలు చెప్పు.

జీవితం లాటరీ నాన్నా. లక్ష కొకరు గెలుస్తా రేమో! నేను చిత్తుగా ఓడిపోయాను. నన్ను మరిచిపో..'

ఆరిపోయేముందు ఒక్కసారి దీపం ఉజ్వలంగా వెలుగుతుంది. శశి కన్నుల్లో వెలుగూ అంతే అయింది.

శశి జీవితం ఆరిపోయింది.

నా దుఃఖానికి అంతూ దరీ లేదు.

నా నిర్భాగ్యం గ్రహించి కాబోలు—నలుగురూ శశి శవాన్ని మురికికుండీవద్దకు ఈడ్చేశారు.

అంత జరిగినా మంగళసూత్రం అమ్మలేక పోయాను.

అది నా చెయ్యిదాటితే అన్నపూర్ణ కూడా చెయ్యి దాటిపోతుందేమో అన్న భయం.

! చెత్తలబండీ వచ్చి శశి శవాన్ని లాక్కుపోతున్నా ఏడుస్తూ నిలబడిపోయాను.

శశి శాశ్వతంగా వెళ్లిపోయింది.

నా ఆశలన్నీ అడుగంటి పోయాయి.

ఇంక—నే నక్కడుండి చేయగలిగే దేముంది?

తిరుగుముఖం పట్టాను.

అన్నపూర్ణ ఎలా ఉందో?

నేను ప్రయాణం అయ్యేముందు డాక్టరు హెచ్చరించాడు 'ఆమె పరిస్థితి ఏమీ బాగులేదు. ఈ సమయంలో మీరు వదిలివెళ్లడం మంచిది కాదు.'

డాక్టరు మాటలు నన్ను నిలవనీయకుండా చేస్తుంటే వెంటనే స్టేషన్‌కి పరుగెత్తాను. కదులు తున్న రైలు ఎక్కేశాను.

అన్నపూర్ణ నన్ను కోరిం దేమీలేదు.

నా పేదరికాన్నీ బాధలనూ పంచుకుని అర్ధాంగి అనిపించుకుంది. ఆమె ఏకైకవాంఛ ఒక్కటే.

'మీ చేతుల్లోనే నా ప్రాణం పోవాలి.'

ఆమెకి కడుపునిండా తిండిపెట్టలేకపోయాను. వ్యాధి వస్తే మందు ఇప్పించలేకపోయాను.

ఆమె ఏకైక వాంఛనయినా తీర్చలేకపోతే భగ వంతుడు నన్ను క్షమించడు.

అన్నపూర్ణ నాకోసం ఎంత అలమటిస్తూందో?

అసలే నా మనసు తడబాటు పడుతూంది.

చూడండి...దయచేసి నా ప్రయాణానికి ఆటంకం కల్పించకండి. కొంచం మానవత్వంతో ఆలోచించి నా ఆవేదనను అర్థం చేసుకుని సానుభూతి చూపండి. మీ విధి నిర్వహణకు అడ్డుపడుతున్నాను. నిజమే. కాని— నిజంగా నేను నిస్సహాయుణ్ణి. నిర్భాగ్యుణ్ణి. నేను త్వరగా వెళ్లకపోతే అన్నపూర్ణ ఏమౌతుందో? ఆమెకు నే నిచ్చిన వాగ్దానం నిలుపుకోలేకపోతే .....

రంగనాథం గొంతు రుద్ధమైంది.

'కథలతోనూ కబుర్లతోనూ నన్ను కరిగించ లేరు. సిద్ధంగా ఉండండి. వచ్చే స్టేషనులో రైల్వే పోలీస్‌కి చెప్పదలుగాని మీ కథ—'

'కథా! కాదు. జీవితం బాబూ, మీరు నా మాటలు నమ్మరూ?'

'నమ్మను.' కర్కశంగా అన్నాడు టి. యి.

రంగనాథం—చుట్టూ చూశాడు.

ఎవరూ తన కథ నమ్మినట్టు లేదు.

ముసిముసి నవ్వులు నవ్వుతూ—' తప్పించు కుందుకు ముసిలాడు మంచి కథే కల్పించాడు. కాని— టి. యి. అతని పప్పు ఉడకనివ్వడంలేదు—' అని గొణుక్కుంటున్నారు.

'ఈ మంగళసూత్రం తీసుకుని—నన్ను వదిలె య్యండి.' అంటూ జేబ లో చెయ్యిపెట్టాడు రంగనాథం.

మరుక్షణం అతని ముఖం పాలిపోయింది.

'అయ్యో!' అంటాడతను.' నా మంగళ సూత్రం ఎక్కడో పోయింది. రైలెక్కే తొందరలో ఎక్కడ జారిపోయిందో!' చెప్పలేనంత ఆవేదన నిండి ఉందతని స్వరంలో.

రైలు ఆగింది.

ఏమీ జరగనట్లే లేచి—రంగనాథంని ఉద్దేశించి 'దిగండి—' అన్నాడు టికెట్ ఎగ్జామినర్.

'నన్ను వదిలిపెట్టరూ?' కడసారి ప్రయత్నంగా ప్రాధేయపడుతూ చూశాడు రంగనాథం.

'నన్ను విసిగించక—పదండి.'

టికెట్ ఎగ్జామినర్ చెయ్యి భుజంమీద పడబోతూంటే—'ఆగండి' అన్నాడు రంగనాథం. త్వరత్వరగా జేబులోంచి పర్సుతీసి టికెట్‌లాగి అతని చేతిలో పెట్టాడు..

ఈ సారి టి. యి. ఆశ్చర్యంగా చూశాడు. మరునిముషం అవమానించబడిన వాడిలా—'టిక్కెట్ కొనికూడా ఎందుకలా చేశారు?' అన్నాడు కోపంగా.

రంగనాథం నవ్వాడు.

ఒకటికి రెండుసార్లు టికెట్‌చూసి—ఛెక్‌చేసి వాపసుచేసి— కదిలాడు.

అతనివెంట రైలుదిగి మరొక పెట్టెలో ఎక్కాడు రంగనాథం.

రైలు కదిలింది—ప్రయాణం సాగించడానికి.

* * *

వేదిక చక్కగా అలంకరించబడింది.

విద్యుద్దీపాలు కాంతి విరజిమ్ముతున్నాయి.

సభ కిటకిటలాడడం లేదు. పల్చగా ఉంది. యువ రచయితలూ, సాహిత్యాభిమానులూ మాత్రమే హాజరయిన సాహితీ సభ అది.

వక్తలొక్కొక్కరూ సాహిత్యాన్ని పైకెత్తే స్తున్నారు.

మధ్య మధ్య రంగనాథాన్ని పొగిడేస్తున్నారు. ఆ నాటి సభకి ముఖ్య అతిథి—ప్రసిద్ధ కథకుడు రంగనాథం.

'ఇప్పుడు—ప్రముఖ కథా రచయిత శ్రీ రంగ నాథంగారు యువ రచయితలకు సందేశం యిస్తారు.'

రంగనాథం లేచి నిలబడ్డాడు.

'సభకి — నా నమస్కారాలు. ఇంతసేపూ వక్తలు నన్ను పొగిడారు. నా కథా కథన కౌశలాన్ని కొనియాడారు. అందుకు కృతజ్ఞుణ్ణి. కాని— చేదుగా ఉన్నా ఒక్కనిజం చెప్పవలసిన బాధ్యత నా మీద ఉంది. అనుభవం తెలియజేసిన సత్యమది.

పాఠకులూ పత్రికలూ నన్ను గొప్ప రచయితగా అభినందిస్తూంటే అదంతా నిజమే అనుకుని గర్వ పడుతూ వచ్చాను. కాని—యివాళ యిక్కడికి చేసిన ప్రయాణంలో ఒక వింత జరిగి—నా కళ్లు విడ్డాయి. టికెట్ కొననట్లు నటించి—టికెట్ కలెక్టర్‌కి చిక్కని కథ చెప్పాను. కాని అతను కరగలేదు. నా కథా కథనం అతన్ని కొంచమయినా చలింపజెయ్య లేదు. నా కథ విన్న ప్రయాణీకులుకూడా నమ్మలేదు.

నా గర్వం అణిగి పోయింది.

నేను మంచి కథకుడినా, కానా? అన్న పరీ క్షలో ఓడిపోయాను.

అయితే—ఈ ప్రయాణం నాకు మేలే చేసింది.

నేను చేసిన ప్రయాణం — అసత్యంనుంచి సత్యానికి.

నేను మీ కివ్వ గలిగే సందేశం ఏమీ లేదు. జీవితానికి—తీయని భ్రమలకంటే— చేదు అయిన నిజాలే ఎక్కువ మేలు చేస్తాయి.

ఇంతకంటె నేనేమీ చెప్పలేను. క్షమించండి.

రంగనాథం వేదిక దిగి పోయాడు.

తరువాత రంగనాథం మళ్లీ కథ వ్రాయలేదు.

# పండితరాయల దక్షిణ నాయకత్వం

డా. మహీధర నళినీమోహన్

పండిత రాయల పేరు చెప్పగానే చాలామందికి లవంగి జ్ఞాపకం వస్తుంది. వారిని గురించి రకరకాల చిత్రమైన కథలు ప్రచారంలో ఉన్నాయి. లోకంలో ఉన్నవీ, నేను విన్నవీ కొన్ని ఇక్కడ వ్రాస్తాను. తరువాత వాటి సత్యాసత్యాలు నిర్ణయించడానికి ప్రయత్నిస్తాను.

'ట'కారాలు వదిలేసి కథ వ్రాస్తాను టూకీగా. గోదావరీతీరంలో కోనసీమలో ముంగండ అగ్రహారవాసి అయిన ఉపద్రష్ట జగన్నాథ పండితుడు దక్షిణదేశంలో ఆలంబనం దొరకక ఉత్తరహిందూదేశం వచ్చాడు. ఢిల్లీలో ఒక సత్రములో బసచేసి, ఫాదుషావారి దర్శనం కోసం ప్రయత్నిస్తున్నాడు. అంతలో ఒక చిత్రమైన సంఘటన జరిగింది. అతడు బసచేసి ఉన్న సత్రం పక్క బావి దగ్గర ఒకనాటి ఉదయం ఇద్దరు ముస్లిం స్త్రీలు తగవులాడుకుంటున్నారు. జుట్టూ జుట్టూ పట్టుకున్నారు. ఉర్దూలో ఒకరినొకరు తిట్టుకుంటూ దెబ్బలాడుకుంటున్నారు. సత్రపు అరుగుమీద కూర్చుని పళ్లు తోముకుంటున్న జగన్నాథుడు వాళ్ల దెబ్బలాటను చూస్తున్నాడు. అతడికి ఉర్దూభాష బొత్తిగా అర్థం కాదు.

ఆ దెబ్బలాట చినికి చినికి గాలివాన అయేసరికి రాజభటులువచ్చి, ఆ ఇద్దరు స్త్రీలను పట్టుకుని, ఫాదుషా దగ్గరకు తీసుకువెళ్లేరు. ఆ సమయంలో అక్కడ మొదటినుంచీ ఉన్న జగన్నాథుణ్ణి సాక్షిగా తీసుకువెళ్లి రాజు ముందర నిలువబెట్టేరు. తన పాండిత్య, సంపదతో సంపాదించలేని రాజదర్శనం ఈ విధంగా అయాచితంగా లభించింది అతడికి.

అసలు ఏమి జరిగిందో చెప్పమని ఫాదుషా జగన్నాథుణ్ణి అడిగేడు. తనకు ఉర్దూ రాదనీ, ఆ భాష రాకపోయినప్పటికీ ఆ ఇద్దరు స్త్రీలూ ఏమేమి అన్నదీ వరసగా చెప్పగలననీ అన్నాడు. ఒకరి తరువాత ఒకరు ఏయే మాటలు అన్నదీ 'టేపు రికార్డరు'లాగ వప్పగించాడు. ఈ ఏకసంథాగ్రహణ ప్రతిభ చూచి రాజు నివ్వెరపోయాడు. తనకు ఉర్దూభాష రాదని సాక్షి బుకాయిస్తున్నాడనుకున్నాడు. భాష తెలియనిదే ఇంత లేసి వాక్యాలు 'గుర్తుంచుకోవడం ఎల్లా సాధ్యమో రాజుకిగాని, సభాసదులకిగాని అంతుబట్టలేదు.

తాను ఏ భాషలో ఏ శబ్దం విన్నా మరిచిపోకుండా తిరిగి వప్పగించగలనని జగన్నాథుడు సవాలు చేశాడు.. అది నిజమో కాదో పరీక్షించడానికి అప్పటికప్పుడు ముల్లాచేత కురానులో కొంతభాగం చదివించి, దానిని తిరిగి వప్పచెప్పమన్నాడు రాజు. జగన్నాథుడు తడుముకోకుండా, పొల్లుపోకుండా కురాను వప్పగించాడు. బావి దగ్గర తురకపిల్లల దెబ్బలాట సంగతి ఏమైందో తెలియదుకానీ, తద్వారా రాజుకి జగన్నాథుని అపూర్వ ప్రతిభ తెలియవచ్చింది. అతణ్ణి తన ఆస్థాన పండితుడుగా వేసుకున్నాడు.

త్వరలోనే జగన్నాథుడు ఫాదుషాతో కలిసి అంతఃపురానికి కూడా వెళ్లేటంతటి సన్నిహితుడు అయాడు. ఒకనాడు అంతఃపురంలో వారిద్దరూ చదరంగం ఆడుతున్నారు. రాజుకి దాహం వేసింది. పానీయం కావాలని సంజ్ఞ చేశాడు. అప్పుడు రాజుగారి కూతురు—లవంగి అనే పడుచు—బంగారుకుండలో పానీయం తీసుకుని వచ్చింది ఒయ్యారంగా నడుస్తూ. ఆమె కట్టుకున్న బంతిపువ్వురంగుగాగరా, ఆ బట్టలో మెరిసిపోతున్న ఆమె సౌందర్యమూ, నెత్తిమీద కుండతో హంస నడకలూ చూచి జగన్నాథుడు పరవశుడైపోయాడు.

లవంగిని వర్ణించవలసిందని రాజు జగన్నాథుణ్ణి కోరేడు. నెత్తిమీద కుండ పెట్టుకుని ఆమె నడుస్తూ ఉంటే నాకేమనిపిస్తోందంటే ప్రపంచంలోఉన్న మగవాళ్ల హృదయాలన్నిటినీ నలిపి ముద్దచేసి, ఆ కుండలో పెట్టుకుని తీసుకుపోతోందా అన్నట్లుగా ఉంది. అనే అర్థం వచ్చేటట్లు ఈ క్రిందిది శ్లోకాన్ని అళువుగా చదివేడు జగన్నాథుడు.

## భుజంగ ప్రయాతా

ఇయం సుస్తనీ మస్తకన్యస్త కుంభా
కుసుం భారుణం చారు వాసోవ సానా
సమస్తస్య లోకస్య చేతః ప్రవృత్తిం
గృహీత్వా ఘటే న్యస్య యాతీవ భాతి.

రాజు ఆవర్ణన విని చాలా సంతోషించాడు.

'తమకు ఏం కావాలో కోరుకోండి' అన్నాడు. జగన్నాథుడు అడగడానికి మొహ మాట పడ్డాడు.

'నా రాజ్యంలో ఉన్నది ఏది కావాలన్నా ఇస్తాను. చెప్పండి. ఏనుగులు, గుర్రాలు, బంగారం, రత్నాలు... మీ ఇష్టం. ఊఁ ..' అని ప్రోత్సహించాడు రాజు.

'అయితే...నాకు నచ్చినది ఏదైనాసరే కోరుకోవచ్చునా?' అన్నాడు జగన్నాథుడు.

'బేషక్'

అప్పుడు లవంగికేసి ఆప్యాయంగా చూస్తూ జగన్నాథుడు ఇల్లా అన్నాడు.

'ఏనుగులు నా కెందుకూ? గుర్రాలు మాత్రం ఏం చేసుకోనూ? ధనంమీద ఆశ నాకు లేశమున్నా లేదు...'

'మరి?'

'నెత్తిమీద చేతులు జోడించుకున్న ఈ లేడి కన్నుల లవంగిని ఇప్పించండి. చాలు'

## భుజంగ ప్రయాతా

న యాచే గజాళిం నవా వాజిరాజిం
న విత్తేషు చిత్తం మదీయం కదాచిత్
ఇయం సుస్తనీ మస్తక న్యస్త హస్తా
లవంగీ కురంగీ దృగంగీ కరోతు.

అందమైన రొమ్ములు కలిగిన, శిరస్సున జోడించిన చేతులు కలిగిన, బంతిపూవన్నె గాగరా తొడుక్కున్న, రంభకూడా సాటిరాని సౌందర్యం కలిగిన ఈ లేడి కన్నుల లవంగి కావాలి నాకు.

## భుజంగ ప్రయాతా

ఇయం సుస్తనీ మస్తక న్యస్త హస్తా
కుసుంభారుణం చారుచేలం వసానా
అరంభా స మానాపి రంభా సమానా
లవంగీ కురంగీ దృగంగీ కరోతు.

నవనీతంలాంటి కోమలమైన అంగములు గలిగిన ఈ యవన యువతితో ఒక్కసారి ఏకశయ్య లభించినట్లయితే ఆ నందననవనందన్ను ఈభూతలమే దొడ్డదని భావిస్తాను.

## కాలభారిణీ

యవనీ నవనీత కోమలాంగీ
శయనీయం యది నీయతే కదాచిత్
అవనీతలమేవ సాధుమన్యే
నవనీ మాఘవనీ వినోద హేతుః

ఈ యవన రమణిని, మదనతాప జనితమైన విపత్తును శమింపజేయగల దానిని, నవనీతంలాంటి శరీరంగల దానిని, అపూర్వ సౌందర్యవతిని, వహ్వా వహ్వా అంటూ అమృతధారలవంటి మాటలతో పరవశింపజేస్తూన్న దానిని తొడమీద కూర్చోబెట్టుకోగలవాడిదే జన్మఅంటే.

## తోటకం

యవనీ రమణీ విపద శమనీ
కమనీయతమా నవనీత సమా
ఊహి ఊహి వచో మృత పూర్ణముఖీ
స సుఖీ జగతీహ యదంక గతా.

తామర పువ్వులాంటి ముఖమూ, కాటుక పిట్టలవంటి కన్నులు, మారేడు కాయలవంటి రొమ్ములు, విద్యుల్లతవంటి అంగనిర్మాణము, తెగబారెడు జడ కలిగిన ఈ సుందరికి ప్రాణనాథుడు లేకపోతే ఎల్లా? ఎల్లా? ఎల్లా?

## భుజంగ ప్రయాతా

ముఖం పంకజం లోచనే ఖంజరీటౌ
కుచౌ శ్రీఫలే విద్యుదేవాంగ యష్టిః
యది ప్రాణ నాథేన హీనాసుకేశీ
తతః కిం? తతః కిం? తతః కిం? తతః కిం?

గుక్క తిప్పుకోకుండా జగన్నాథుడు ఇల్లా చదివేసరికి, గుక్క తిప్పుకోడానికి పాదుషావారికి చాలా కాలం పట్టింది.

మత్తెక్కించే కవితాధారలోనుంచి బయటపడి, కవి అడిగినదేమిటో తెలిసేసరికి చక్రవర్తి కళ్ళ జేవు

రించాయి. ఆ కళ్లల్లోని ఎర్రని జీరలు చూచి జగన్నాథుడు ఇల్లా అన్నాడు.

ఈ లోకంలో యాచకుల కోరికలు తీర్చగల వారు ఇద్దరే ఇద్దరు. ఒకడు ఢిల్లీశ్వరుడు, మరొకడు జగదీశ్వరుడూనూ. యాచిస్తే వీళ్లిద్దరినే యాచించాలి. ఇస్తే వీళ్లిద్దరే ఇవ్వాలి. లోకంలో ఇంకా రాజులు లేకేం, బోలెడంతమంది ఉన్నారుకానీ, వాళ్ల దగ్గరికి కాయగూరలకోసమూ, ఉప్పూ, పప్పూ కోసమూ వెడితే వెళ్లాలి అంతే.

## ఉపజాతి

ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా
మనోరథాన్ పూరయితుం సమర్థః
అన్యైర్నృపాలైః పరిదీయమానం
శాకాయవాస్యా ల్లవణాయ వాస్యాత్.

దీనితో రాజు పసన్నుడయాడు. తాను అన్న మాట నిలువబెట్టుకోవడంకోసం లవంగిని జగన్నాథుడికిచ్చి పెళ్లి చేయించాడు.

తురకపిల్లని పెళ్లి చేసుకున్న కారణంచేత పండిత రాయులని వెలివేసింది బ్రాహ్మణ్యం. రాజుగారి ప్రాపకం ఉండడంచేత ఆ వెలి తొలిరోజులలో అంతగా బాధించలేదుకానీ, రానురాను అది దుర్భరం అనిపించింది అతడికి.

ఒకనాడు పండిత రాయలు లవంగి సమేతంగా కాశీ వెళ్లి గంగలో స్నానం చేయడానికి రేవులో దిగబోతూ ఉండగా మతభ్రష్టుడైన కారణంగా పవిత్ర గంగానదీ స్పర్శకు అనర్హుడని నిందించి, అక్కడి బ్రాహ్మణులు వాళ్లని నదిలోకి దిగనీయకుండా అటకాయించారు.

'సరే మమ్మల్ని గంగ దగ్గరకు వెళ్లనీయక పోతే మించిపోయిందా, గంగే మా దగ్గరకు వస్తుంది చూడండి' అని గంగాభవానిని స్తవం చేయడం మొదలుపెట్టేడు పండిత రాయలు ఆశువుగా.

## శిఖరిణీ

సమృద్ధం సౌభాగ్యం సకల
వసుధాయాః కిమపిత
న్మహైశ్వర్యం లీలా జనిత
జగతః ఖండ పరశోః
శ్రుతీనాం సర్వస్వం సుకృత
మథ మూర్తం సుమనసాం
సుధా సౌందర్యంతే సలిల
మశివం నః శమయతు.

ఇత్యాదిగా 52 శ్లోకాలు చదివేడు. ఒక్కొక్క శ్లోకం చదివే సరికి గంగ ఒక్కొక్క మెట్టు పొంగి రాసాగింది.

## ఉపజాతి

విభూషితానంగ రిపూత్తమాంగా
సద్యః కృతానేక జనార్తి భంగా
మనోహరోత్తుంగ చలత్తరంగా
గంగా మమంగా న్యమలీ కరోతు.

అని 52 వ శ్లోకం చదివేసరికి గంగానది 52 మెట్లు పైకి ఎక్కివచ్చి, లవంగీ సహితుడైన పండితరాయలని తనలో లీనం చేసుకున్నది.

అక్కడా అక్కడా చిన్నచిన్న మార్పులతో మొత్తం మీద ఇదీ కథ.

ఈ కథలోని ఢిల్లీశ్వరుడు అక్బరుపాదుషా అని భావించారు మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారూ (సంస్కృత కవి జీవితములు అనే గ్రంథంలో). కావలి రామస్వామిగారూ (Deccan Poets) అనే గ్రంథంలో మరికొందరూనూ.

అక్బరు చనిపోయేనాటికి జగన్నాథుడు పదేళ్లు కూడా నిండని పసివాడు. (ఈ విషయాన్ని మరో వ్యాసంలో నిరూపిస్తాను). అక్బరు కూతురైన లవంగిని ఇతడు వరించడం ఎల్లా సాధ్యం?

ఈ ఇబ్బందినుంచి తప్పుకోడానికి లవంగి షాజహాను చక్రవర్తి కూతురు అన్నారు మరికొందరు.

పాదుషా వారి కూతురు పరపురుషుల ఎదుటికి కుండనెత్తినో, చంకనో పెట్టుకుని వస్తుందా? పరదాలో ఉండవలసిన రాకుమారికి ఇది బొత్తిగా అసమంజసం కదూ? మంచినీళ్లు తేవడానికి ఆమె తప్ప మరెవ్వరూ లేరూ? తన కూతుర్ని పచ్చిపచ్చిగా వర్ణించి ఆమెని తొడమీద కూర్చోబెట్టుకోవాలని ఉందనీ, ఆమెతో ఏకశయ్య లభిస్తే బాగుండుననీ అన్నవాడిని పాదుషా క్షమించి ఊరుకుంటాడా? ఉచితానుచితజ్ఞుడైన పండిత రాయలు అటువంటి పనిచేసి, తన పీకల మీదికి తెచ్చుకుంటాడా ?

ఈ ఇబ్బందిని దాటుకోడానికి లవంగి పాదుషా

వారి కూతురు కానేకాదనీ, రాజనర్తకి సుమా అనీ మరికొందరు కొత్తగా కనిపెట్టేరు. నర్తకిని జగన్నాథుని పరం చేయడానికి నవాబుకి అభ్యంతరం ఏముంటుంది?

'బ్రాహ్మణోత్తము'డైన జగన్నాథునికి తురకపిల్లతో సంబంధం ఉన్నదన్న విషయం మింగుడు పడని 'ఛాందసులు' మరికొందరు ఈ లవంగి అసలు తురకపిల్ల కానేకాదు సుమండీ అన్నారు. అచ్చంగా బ్రాహ్మణ పిల్లే అన్నారు. అందులోనూ వైదిక బ్రాహ్మణ్యం అన్నారు. మళ్లీ మాట్లాడితే వేగినాణ్యం అని కూడా అంటారు. వేదవేదాంగవేత్త అయిన ఒకానొక బ్రాహ్మణుడు తన స్వంతకూతురు అయిన లవంగిని—పసిగుడ్డుగా ఉండగా—తనకు పరమఆప్తుడైన షాజహాన్ చేతుల్లో పెట్టి, మరణించడమో సన్యసించడమో చేశాడనీ, షాజహాన్ ఆమెను కన్నకూతురిలాగ చూసుకున్నాడనీ, అందరూ ఆ పిల్ల నవాబుగారి కూతురే అనుకున్నారనీ వీరి వెర్షన్. (శతావధాని దోమా వెంకటస్వామి గుప్తగారి ఊహ ఇది).

సకలశాస్త్ర పారంగతుడూ, పరమ వేదాంతీ అయిన పండిత రాయలు మతభ్రష్టతకు ఒడిగట్టడం నమ్మశక్యంకాని విషయమనీ. అసలు అతగాడి మనస్సు ఆ పిల్లమీదికి ప్రసరించడమే ఆమె బ్రాహ్మణకన్య అనడానికి తిరుగులేని ఋజువులనీ కొందరి వాదం. వెనకటికి దుష్యంతుడు కణ్వాశ్రమంలో శకుంతలని చూచి, మొదటి చూపులోనే మోహించి, తనలాంటి పరమపవిత్రుడి మనస్సు ఆమెమీదికి ప్రసరించింది కనుక, ఆమె తాను పెళ్లాడడానికి తగ్గ కన్య తప్ప మరొకర్తి అయిఉండడానికి వీలులేదు అవటా అని నిశ్చయించుకుని 'సతాంహి సందేహ పదేషు వస్తుషు, ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః' అనుకోలేదుటండీ! అల్లాగే పండిత రాయలూనూ.

లవంగికీ, పండిత రాయలకీ అసలు సంబంధమే లేదనీ, ఈ కథలన్నీ వట్టి బూటకాలనీ మరికొందరి అభిప్రాయం. ఈ వాదానికి కారణాలు రెండు విధాలుగా ఉన్నాయి.

## మొదటి కారణం

వేదాంత శాస్త్రం కుణ్ణంగా అభ్యసించిన పండిత రాయలకి అగ్నిసాక్షిగా పెళ్లాడిన భార్య ఉండగా పరస్త్రీ వ్యామోహం ఉండడం అసంభవం అని. ఈ వాదంలో ఉన్న బలం ఏ పాటిదో నేను చర్చించదలుచుకోలేదు.

కరుణవిలాసంలో తనహృదయేశ్వరీ వియోగాన్ని గురించి పండితరాయలు ఎంతో దయనీయంగా వర్ణించాడు. ఆమెకూ తనకూ గల సంబంధాన్ని బహుసున్నితంగా హృదయదఘ్నంగా వివరించాడు.

## వసంత తిలకా

సర్వేఽపి విస్మృతపథం విషయాః ప్రయాతా
విద్యాపి ఖేదగలితా విముఖీ బభూవ
సా కేవలం హరిణశావకలోచనా మే
నైవాపయాతి హృదయాదధిదేవ తేవ.

(అన్ని విషయాలూ విస్మృతి పథంలో పడ్డాయి. దుఃఖంచేత విద్యకూడా విముఖం అయింది. నా హరిణాక్షి మాత్రం అధిదేవతవలె నా హృదయాన్ని విడిచిపెట్టి వెళ్లనంటోంది.)

ఎవరీ హృదయాధి దేవత?

లవంగి కాదు కదా?

కాదు.

ఏమంటే—

కరుణ సముల్లాసంలోని ఈ శ్లోకం చూడండి.

## వసంత తిలకా

ధృత్వా పద స్ఖలన భీతివశాత్కరం మే
యారూఢ వత్యసి శిలాశకలం వివాహే
సామాం విహాయ కథ మద్య విలాసిని! ద్యా
మారోహసీతి హృదయం శతధా ప్రయాతి.

(ఓ విలాసినీ! వివాహవేళలో సన్నెకల్లు తొక్కవలసి వచ్చినప్పుడు కాలుజారబడ వచ్చుననే భయంతో నా చెయ్యి పట్టుకుని మరీ తొక్కేవు. అటువంటిది ఈ నాడు నన్ను వదిలి ఒంటరిగా స్వర్గానికి ఎల్లా ఎక్క గలిగేవో కదా అని నా హృదయం పరిపరివిధాల పోతోంది చెలీ!)

పెళ్లిలో సన్నెకల్లు తొక్కించడం వైదిక సంప్రదాయం. తురకపిల్లచేత ఈ పని చేయించి ఉండరు కదా!

మరి అయితే ఆ విలాసిని ఎవరూ ?

ఇల్లా వివరిస్తున్నాడు శృంగారోల్లాసంలో.

## వసంతతిలకా

ప్రాతస్తరాం ప్రణమనే విహితేగురూణా
మాకర్ణ్య వాచ మనులాం భవ పుత్రిణీతి
నేదీయసి ప్రియతమే పరమప్రమోద
పూర్ణాదరం దయితయా దధిరే దృగంతాః.

(వేకువజామునే లేచి ఇంటిలోని పెద్దలకు నమస్కరించింది. వారు గుమ్మడిపండులాంటి కొడుకు పుట్టాలని ఆశీర్వదించారు. ఆ మాటలు విని ఆమె సిగ్గులబరికె అయిపోయింది. తల ఎత్తలేకపోయింది. దగ్గరలోనే నిలుచున్న భర్తమీద సాదరంగా పరమా నందంతో కూడిన కడగంటి చూపులు ప్రసరింప జేసింది !)

ఈమె ఎవరై ఉంటుందీ ?

లవంగేనా ?

తురకపిల్లతో కాపరం పెట్టిన కొడుకు ఇంటి గడప తొక్కనిస్తారా పేరంభట్టూ, లక్ష్మీదేవీనూ ?

ఆమె లవంగి కాదు.

కరుణసముల్లాసంలో ఇంకా ఇల్లా వివరిస్తున్నాడు.

## వసంతతిలకా

మందస్మితేన సుధయా పరిషిచ్యయామాం
నేత్రోత్పలైః ర్వికసితైః రనిశం సమీడే
సానిత్య మంగళమయీ గృహదేవతామే
కామేశ్వరీ హృదయితో దయితా నయాతి.

(నన్ను మందస్మితామృత స్నాతునిచేసి, వికసిత నేత్రోత్పలములచేత నన్ను పూజించే అనిత్యమంగళ మయి, నా ఇలవేల్పు—కామేశ్వరి—నా హృదయమును విడిచి వెళ్లడం లేదు.)

తన హృదయాధి దేవత కామేశ్వరిట!

ఆమె తన గృహదేవత అట.

ఆమె తన హృదయంలోంచి వెళ్లడం లేదట.

ఇందులోని కామేశ్వరీ శబ్దానికి 'కోరికలను తీర్చునది అనేఅర్థాన్ని మాత్రమేచెప్పేరు పరంజపేగారు.

(శివరామ్ మహాదేవ పరంజపేగారి భామినీ విలాస పీఠికలో)

తెలుగువారిలో, బ్రాహ్మణులలో, వేగినాటి వారిలో ఆడపిల్లలకి కామేశ్వరి అనే పేరు బహుతరుచుగా పెట్టుకుంటారని పరంజపే గారికేం తెలుసూ ?

ఈ శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ పండితరాయల పౌత్రుడునని చెప్పుకున్న మహాదేవభట్టు ఇల్లా వ్రాశాడు.

'గృహిణ్యాం దివం ప్రతియాతాయాం మృతాయాం సత్యాం, సానిత్యమంగల=పుత్రపౌత్రాద్యుత్సవః, తత్ప్రియురా నిత్యమంగళమయా గృహదేవతా కామేశ్వరీ.'

దీనినిబట్టి ఇందులో పేర్కొనబడ్డ స్త్రీ పండితరాయల గృహిణి అనీ, ఆమెకు పుత్రులూ పౌత్రులూ ఉన్నారనీ తెలుస్తోంది.

సందర్భం వచ్చింది కనక, పండితరాయల భార్యఅయిన కామేశ్వరిని గురించి ప్రచారంలో ఉన్న కథ కూడా వ్రాస్తాను.

సుమారు 40 సంవత్సరాల క్రిందట స్వర్గస్థులైన ముంగండ గ్రామవాసులు, తర్క-వ్యాకరణ సంగీతశాస్త్రాలలో నిధులు అయిన ఉపద్రష్ట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చెప్పిన కథ ఇది.

పండితరాయల కాలంలో ముంగండలో జరిగిన సంగతి ఇది. పరిటివారు ద్రావిళ్ళు. వారికి మునసబు గిరీ ఉండేది. యాళ్ళవారు కాపులు. పెద్ద భూస్వాములు. జగన్నాథుడు గ్రామాంతరగతుడై ఉన్న సమయంలో ఈ రెండు కుటుంబాలకూ చెందిన యువకులు కొందరు జగన్నాథుని భార్యఅయిన కామేశ్వరిని అవమానించారు. తత్కారణంగా ఆమె ముంగండ పెద్దచెరువులోపడి చచ్చిపోయింది. తరువాత ఈ సంగతి తెలుసుకున్న జగన్నాథుడు ఆ రెండు కుటుంబాలమీదా కసి తీర్చుకోవడంకోసం రాజ మహేంద్రవరం వెళ్లి, అక్కడ రుస్తుంఖాన్ అనే సర్దారును ఆశ్రయించి అతగాడిని తన కవిత్వంతో మెప్పించి, అతడి సాయంతో ఈ రెండు కుటుంబాల వారినీ ముంగండనుంచి తరిమివేయించాడు. యాళ్లవారు బెండమూర్లంకకీ పరిటివారు వానపల్లికీ తరలి వెళ్లిపోయారు.

ఈ కథ ఎంతవరకూ నిజమో తెలియదుకానీ, పండితరాయలకి కామేశ్వరి అనే తెలుగుపిల్ల భార్యఅయి ఉండడమూ, ఆమె అకాలమరణం చెందడమూ నిజమే అని నా విశ్వాసం. కరుణసముల్లాసం దీనికి సాక్ష్యం.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, భార్యని ఇంతగా ప్రేమించిన పండితరాయలు ఓ తురకపిల్లని పట్టుకుని 'యవనీ రమణీ విపదశ్మమనీ' అంటూ శివం ఎత్తినట్లు మాట్లాడుతాడా? అని.

కనుక లవంగీ పండితరాయుల కథలు అన్నీ కేవలం కల్పితాలు అని మొదటి వాదం.

## రెండవ కారణం

పండితరాయలు శ్రీరామచంద్రుడో, ప్రవరాఖ్యుడో కాదు నవనీత కోమలాంగిని యవని అయినంత మాత్రాన తోసిపుచ్చడానికి. అతడి వేదాంతశాస్త్ర పాండిత్యంగానీ, అతనికి అంతకుముందే పెళ్లి అయి ఉండడంగానీ ప్రతిబంధకాలు కానేకావు. అసలు లవంగి అనబడే తురకపిల్ల పండితరాయల జీవితంలోకి తొంగి చూడనేలేదు అనీ, ఆ పేరే అతడికి తెలియదనీ రెండవవాదం. సార్వభౌముని కూతుర్ని పెళ్లాడిన వాడైతే ఆ సంగతి ఢంకా బజాయించి తన గ్రంథాలలో వ్రాసుకోడా?

'లవంగియనుపేరుగల ఢిల్లీసుల్తాను కుమార్తెచే శ్రీనాధుని సమకాలపువాడగు డిండిమ భట్టారకుడు సన్మానింపబడినట్లు డిండిమవంశ చరిత్రమును తెలుపు విశేష రత్నమాలయను గ్రంథమున కలదు' అని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాశారు. (భమిడి సత్యనారాయణశర్మగారికి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన ఒక ఉత్తరంలో ఇల్లా ఉన్నట్లు శర్మగారు వ్రాసిన పండితరాయల జీవితం అనే గ్రంథంలో ఉంది.)

డిండిమభట్టు 14 వ శతాబ్దంలోఉన్నవాడు. పండితరాయలు 17 వ శతాబ్దం వాడు. వీరిద్దరికీ సుమారు 250 ఏళ్ల భేదం ఉంది.

'పండితరాయలు ఢిల్లీ సుల్తాను కూతురును పెండ్లాడినట్లే, ఆమె పేరు లవంగి అయినట్లే యుండుటచే భిన్నకాలములందు ఆ ఇద్దరు (డిండిముడు, జగన్నాథుడు) పండితులకును అట్టి సందర్భమే జరిగి యుండెనని నమ్ముట సరికాదని నా యభిప్రాయము. డిండిముడు లవంగిని దర్శించెనమటకు గ్రంథ ప్రామాణ్యమున్నది. పండితరాయల విషయమున లేదు. డిండిముడు పూర్వుడు. పండితరాయలర్వాచీనుడు అని ప్రభాకరశాస్త్రిగారు వ్రాశారు.

మొత్తంమీద లవంగి అనబడే ఢిల్లీసుల్తాను కూతురు పండితరాయలకి 250 ఏళ్లకిందట ఉండేది. కనుక, వారిద్దరికీ సంబంధం ఏమీలేదు.

మరి అయితే ఈ కథలన్నీ ఎల్లా పుట్టాయి?

నిప్పులేనిదే పొగరాదు కదా! అని కొందరి సందేహం. అయితే 14 వ శతాబ్దపు మొల్లకీ 16వ శతాబ్దపు తెనాలి రామలింగానికీ సంబంధం కలుపుతూ ప్రచారంలో ఉన్న కథలమాట ఏమిటి ?

పండితరాయలదని చెప్పబదుతూన్న, లవంగికి సంబంధించిన చిత్రమైన శ్లోకం ఒకటి ఉంది. అందులో వాడిన పారశీక శబ్దాలవల్ల ఆ శ్లోకభావం సరిగ్గా తెలియడంలేదు. చాలామంది పండితులకి ఈ శ్లోకాన్ని చూపించాను గానీ, వారెవరూ దాని భావాన్ని వివరించలేకపోయారు. పారశీక సంస్కృతభాషలు రెండూ బాగా తెలిసిన, చరిత్ర క్షుణ్ణంగా ఎరిగిన, తిరుమలేశలు ఎవరైనా దీని భావాన్ని విప్పి చెప్పగలరన్న ఆశతో ఆ శ్లోకాన్ని ఇక్కడ వ్రాస్తున్నాను.

### స్రగ్విణి

కాలపీ మందిరే బాలపీనస్తనీ
ఖాతు పీతాసవా లాలపీతి ప్రియా
నాగరాజీ మదామోద మేదస్వినీ
మాగరం మాగమః శాహజిల్లాహజీ.

ఈ శ్లోకాన్ని పండితరాయలు లవంగిని గురించి చెప్పినట్లుగా వ్రాయబడిఉంది. (పండితరాజ కావ్య సంగ్రహం.)

ఇందులో మొదటి రెండుపాదాలకీ అర్థం తెలుస్తూనే ఉంది.

'కాలపీ' అనేది ఒక ఊరు పేరు. ఝాన్సీకి దగ్గరలో 'కాల్‌పీ' అనే ఊరు ఉంది. ఇదీ అదీ ఒకటేఅయి ఉండాలి.

ఆ కాల్‌పీ అనే ఊళ్ళోఉన్న ఏదో దేవాలయంలో ఈమె నర్తకి కాబోలు. ఆమెను చూచి వర్ణిస్తున్నాడు. జాతు—పీత—ఆసవా=కొద్దిగా సారాయి సేవించినది. లాల్‌పీతా అంటే ఎర్రరిబ్బను అని అర్థం ఉర్దూలో. 'లాలపీతి ప్రియా' అంటే ఎర్ర రిబ్బను కట్టుకున్నది అని అర్థమేమో.

ఆనాటి చరిత్రకూడా బాగా తెలిస్తే కాని తక్కిన రెండు పాదాలూ అర్థంకావు అనుకుంటాను.

ఇంతకీ సారాంశం ఏమిటంటే— పండితరాయలకి లవంగి అనే ఆడకూతురితో పరిచయం ఉండడమే నిజమైతే ఆ లవంగి పాదుషావారి కూతురు మాత్రం కాదు. మరెవరో సామాన్య నర్తకి. కాలపీ మందిరంలో నృత్యం చేస్తూ ఉండగా పండితరాయలు ఆమెనుచూచి ఉండవచ్చు. పైన చెప్పిన శ్లోకాలన్నీ ఆ సందర్భంలో ఆ పిల్లని వర్ణిస్తూ చెప్పినవి అయిఉండవచ్చు. తరవాత ఆమెతో సంబంధం పెట్టుకున్నా ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఆమెను గురించి తన గ్రంథాలలో వ్రాసుకోదగినంత గొప్పవ్యక్తి ఏమీ కాదు ఆమె. ఎవరో పిల్లతో సంబంధం పెట్టుకున్నంతమాత్రాన వెలివేసేటంత పవిత్ర స్థితిలో ఏమీ లేదు ఆ నాటి సంఘం. అయితే ఇతడి వేదాంతశాస్త్ర పరిజ్ఞానం అంతా ఏమయిపోయినట్లూ? నీళ్లకి నీళ్లూ పసాదానికి ప్రసాదమూనూ. దేని దారి దానిదే.

గంగాలహరి పేరుతో గంగాస్తవంచేస్తూ ఉండగా గంగానది ఒక్కొక్కమెట్టే ఎక్కివచ్చి లవంగినీ పండితరాయలనీ తనలో కలపేసుకున్నది అన్న కథలో సత్యం ఏ మాత్రమూ లేదు. గంగ ఒడ్డున నిలబడి పండితరాయలు ఆ శ్లోకాలుచెప్తే చెప్పి ఉండవచ్చు. వెలివేత భరించలేక పండితరాయలు లవంగిలో కలిసి, గంగలోదూకి ఆత్మహత్య చేసుకొని ఉండవచ్చుననీ, ఈ సన్నివేశాన్ని పవిత్రీకరించే ఉద్దేశంతో గంగే పైపైకి పొంగివచ్చి వారిద్దరినీ తనలో ఇముడ్చుకున్నట్లు కథ అల్లబడి ఉండవచ్చుననీ కొందరు అనుకుంటూ విన్నాను. కాని, అందులోకూడా సత్యం ఏమీ లేదు.

ఏమంటే—అదే నిజమైతే గంగాలహరి అతడి ఆఖరి రచన అయి ఉండాలి కదా? కాని, గంగాలహరిలోని 16 శ్లోకాలు పండితరాయల రసగంగాధరంలో ఉదాహరణలుగా ఇవ్వబడ్డాయి! గంగాలహరి చెప్పిన తరువాతనే అతడు రసగంగాధరం వ్రాశాడనికదా అర్థం?

———



# మహానంది క్షేత్రము

శ్రీ పి. ఆర్.

మహానంది క్షేత్రము కర్నూలుజిల్లా నంద్యాల తాలూకాలో నందిమండలంలో ఉన్నది. నంద్యాల అనే పేరు నంది ఆలయం అనే పేరుకు భిన్న రూపమే అంటారు. మహానందిచుట్టూ పదిమైళ్ళ లోపల ప్రథమనంది, నాగనంది, వినాయకనంది, గరుడనంది, బ్రహ్మనంది, సూర్యనంది, విష్ణునంది, సోమనంది, శివనంది అనే నవనందులు ఉన్నాయి. నంద్యాల రైల్వేస్టేషన్‌లోదిగి ఈ క్షేత్రానికి బస్సులలో వెళ్ళవచ్చు. ప్రస్తుత శృంగేరీ జగద్గురువుల పూర్వులు నంది మండలంలోని కైప గ్రామానికి చెందిన వారే.

నిజంగా ఆరామక్షేత్రానికి వెళ్ళాలంటే మహానందికే వెళ్ళాలి. ఈ క్షేత్రం అన్నివిధాలా సకల మనోభిరామంగా ఉంటుంది. పరమశివుని ప్రథమ గణంలో నందీశ్వరునిది ప్రధానస్థానం. నంది శృంగ మధ్యమునుంచి ఈశ్వరలింగాన్ని మనం దర్శనం చేసినప్పుడే మనకి ముక్తి. శివునితో సారూప్యం చెందిన భక్తుడు నందీశ్వరుడు. శ్రీశైలంలో శిలాదుడు తపస్సుచేసి శివుని శిరమునుదాల్చే వరాన్ని పొందితే, నంది తపస్సుచేసి శివుని తనమూపునదాల్చిన మహానుభావుడు. సిరిసంపదలకు, శ్రేయస్సాధనకు, శివప్రీతికి నందీశ్వరుడే మొదటిమెట్టు. శివదర్శనమయ్యాక శివార్చన ద్రవ్యాన్ని (అనగా శివమాలిన్యాన్ని) నందీశ్వరునిమీద భక్తులు ఉంచుతారు. నవనందియాత్రలకు మంచిసమయం కార్తీకమాసం. నంది తపస్సుచేసిన చోటే ఈనాటి నవనందులు ఉన్నచోటు. నందులు అనే రాజులు ఈ ప్రదేశాన్ని పరిపాలించినప్పుడు అనేక దేవాలయాలను వారు కట్టించారు. తమ ఇష్టదైవమైన నవనందులను ప్రతిష్ఠించినందువల్ల యిది నందిమండలంగా పేరుగాంచినది.



మహానంది ఆలయంలో పుష్కరిణి.

ఈ క్షేత్రంలో ఎటుచూచినా మామిడిచెట్లు, అరటిచెట్లు, నారింజచెట్లు, కొబ్బరితోటలు పుష్కలంగా కనిపిస్తాయి. మహానంది నందనవనంగానే ఉంటుంది. మహానంది దేవాలయం అపూర్వమైనది. గర్భాలయంమీది విమానం ఉత్తరనాగర సాంప్రదాయం గలది. పూర్వకాలంలో ఒక రససిద్ధుడు ఈ విమానాన్ని కట్టాడు. కూలి ఇవ్వాల్సివచ్చింది. కూలివాళ్ళ అందరిచేత ఇసుకకుప్పలు పెట్టించాడు. ఎవరుపనికి చాలినంత ధనం వారికి ఆ కుప్పలలో లభించింది, అతడు చదివిన ఒక మంత్రంతో. ఈ విమాన సింహద్వారం పశ్చిమాభిముఖంగా యున్నది. పశ్చిమద్వారాలు గల ఆలయాలు భగన్నిర్మితాలని, ఋషులు కట్టడాలని చెబుతారు.

శ్రీశైలంలోగానే మహానందిలోగూడా లింగం భూమికి కొంచెంపైగా ఉంటుంది. భక్తులు చేతులారా

స్వామికి అభిషేకంచేసి అర్చించవచ్చు. ఈ లింగం ఎల్లా బయటపడిందీ అనేదాన్నిగూర్చి ఒక కథ చెబు తారు. అక్కడ ఒకపుట్ట ఉండేది. ఆ పుట్టమీద రోజూ ఒక కపిలగోవువచ్చి పాలు వర్షిస్తూ ఉండేది. పశువులకాపరి ఒకడు ఇది చూచాడు. పుట్టక్రింద బాలకృష్ణుడు నోరుతెరిచి ఈ పాలు త్రాగుతుండే వాడు. ఈ దృశ్యం ఆ గొల్లవాడు పెద్దనందునితో చెప్పాడు. నందుడువచ్చి చూచాడు. ఆ దృశ్యం కంటబడింది. తన్మయుడయ్యాడు. గోవు భయ పడింది. అది పుట్టను తొక్కి పక్కకు పోయింది. ఆ గిట్టలు ఆ పుట్టమీద ముద్రిత మైనవి ఇనాట్కి గూడా మనం చూడవచ్చు. నందుడు తనుచేసిన అపరాధానికి విచారించాడు. ఇష్టదైవ మైన నందిని పూజించాడు. ఆవు తొక్కిన పుట్ట శిలాలింగమయ్యేట్లు నంది ప్రసాదించింది. గర్భాలయం ఎదుట పెద్దనంది ఉన్నది. దాని ఎదుట చక్కని పుష్కరిణి. ఈ రెండింటివల్ల ఈ క్షేత్రానికి మహా నంది తీర్థము అనే పేరు వచ్చింది. దేవాలయ ప్రాకారం బయట విష్ణుకుండం, బ్రహ్మకుండం అనే రెండు కుండాలు ఉన్నాయి. త్రిమూర్తిత్వానికి గుడిలోని స్వామివారు అతీతులు. లింగం ఏర్పడిన వంకలు ప్రకృతి పురుష తత్వాలను తెలుపుతాయి.

మహానందికి ఎదురుగా ఉన్నటువంటి గుండం రుద్రగుండం. ఈ గుండంలో నీళ్లు కొంచెంగోరు వెచ్చగా ఉంటాయి. ఈ చెరువులోకి అయిదు ధారలు వస్తాయి. ఒక్కొక్కటి నాలుగు అంగుళాల చతురము గలవి. అన్నీ గర్భాలయం ప్రక్కనుంచే బయలుదేర తాయి. వాటి పేర్లు : శ్రీశైలధార, నరసింహధార, దైవానిధిధార, నందితీర్థం, కాశీతీర్థం. నందినోటవచ్చే తీర్థం ప్రశస్తమైనది. చెరువు 60 అడుగుల చతురం, నలువైపుల గుమ్మాలు. చెరువులోకిమెట్లు, చెరువు అడుగునుంచి బయటికి నీరుపారుతూనే ఉంటుంది. ఎప్పుడు చూచినా చెరువులో $4\frac{1}{2}$ అడుగుల నీరు లోతు ఉంటుంది. మునిగి పోతామనే భయం ఉండదు. గంటలకొద్దీ అందులో ఉండాలనే అనిపిస్తుంది. బయటికి రావాలనే అనిపించదు. చెరువుమధ్యలో మండపం ఉన్నది. అందులో పంచలింగాలు ప్రతి ష్ఠింపబడ్డాయి. ప్రతియాత్రికుడు చక్కగా అభి షేకం చేసుకోవచ్చు. చెరువు గోడలు చక్కగా చెక్కిన రాతి నిర్మాణాలు. గణపతి, నటరాజు, వరాహమూర్తి రాసక్రీడ మున్నగు శిల్పచిత్రాలు ఈ గోడలమీద ఉన్నాయి.

మహానంది ఆలయం సింహద్వారంవద్దనున్న గోపురం, ఉత్తరవైపునున్న గోపురంగూడా ముఖ్య మైనవి. వాటిపై బొమ్మలుగూడా చాలా ఆకర్ష వంతంగా ఉంటాయి. లోపలి ప్రాకారంలో పెద్ద జడమండపం ఉన్నది. మొదటి ప్రాకారానికి బయట గూడా పెద్దమండపాలు ఉన్నాయి. ప్రధానాలయం వెనుక చిన్నగుడులు 3 ఉన్నాయి. ప్రతిదానిలోను శివ లింగాలు ఉన్నాయి. మనస్ఫూర్తిగా పూజించిన వారిని స్థూల, సూక్ష్మ కారణాతీతమైన తుల్యావస్థకు తీసుకుపోతాయి ఈ లింగాలు. మధ్యలో సూక్ష్మలింగం స్త్రీ ముఖం గలది. స్త్రీలకు సహజమైన భావో ద్రేక ముద్రలు అందులో ప్రతిఫలిస్తాయి. వాటి ప్రక్కనే శ్రీరామాలయం. మహానందయ్యగారి భార్య ఈ ఆలయ నిర్మాణానికి కారకురాలు. ఇక్కడ ఉండే అమ్మవారిపేరు కామేశ్వరీదేవి. భైరవజోస్యుల మహా నందయ్యగారు దేవీ ఆలయ ముఖమండపం నిర్మాణం చేయించారు. దేవి ఎదుట శ్రీ చక్రం శంకరాచార్యుల వారి ప్రతిష్ఠ. విజయనగర సామ్రాట్టులు ఇక్కడ ఆలయాలను పోషించి వృద్ధికి తెచ్చినవారు.

---

# జీవన్ ముక్తుడు

మరాఠీ మూలం : శ్రీ అనిరుద్ధ పునర్వసు
అనువాదం : శ్రీ గాదంశెట్టి శ్రీరాములు

“అరే! మాటలన్నీ మాతో బాగానే మాట్లాడుతున్నావు గదా! చచ్చిపోయానంటావేమిటి? ఏం రోగం? అదెలాగండీ, ఇదిగో, గోపాలరావుగారూ, ఇక తమాషా మాటలు వదిలిపెట్టండి. ఇన్నాళ్లూ మనిద్దరికీ వున్న సంబంధాన్ని దృష్టిలో పెట్టుకొని వూరుకున్నాను. కాని ఇవాళ కనుక నా డబ్బివ్వకపోతే దారినవెళ్లే పదిమందినీ పిల్చి నా తడాఖా చూపిస్తాను. మీరు చచ్చిపోయారో బతికే వున్నారో నా కనవసరంలేదు. నాకు కావలసివుంది నా డబ్బు.”

సేఠ్ మహాదేవ్ గొంతు చించుకుంటూ కేకలేస్తున్నాడు. కాని గోపాలరావు ప్రశాంతంగా కూచొనే వున్నాడు. తనకు సేఠ్ మాటలు వినిపించినట్లే లేదు. ఎప్పటిలాగా గీతా పారాయణం చేస్తూనే వున్నాడు. గడపట్లో నిలబడ్డ రాధాబాయి ఇదంతా చూస్తూనే వుంది. వింటూనే వుంది. ఆమె కండ్లల్లో నీళ్లు తిరిగాయి. ముందుకువచ్చి మహాదేవ్ సేఠ్‌ను నోరు మూయించాలనే అనుకుంటూంది. కాని అలా చేయడానికి ధయిర్యం చాలడంలేదు ఏ క్షణానైనా గోపాలరావుకు కోపం వచ్చి సేఠ్‌ను మెడపట్టి బయటికి గెంటివేయవచ్చు లేదా జేబులోనుండి డబ్బు తీసి అతని ముఖాన విసరికొట్టి ‘ఇక నోరు మూసుకో’ అని అనవచ్చునని ఆమెకు అనిపిస్తుంది. కాని గోపాలరావు అలాంటిదేమీ చేయలేదు. ఆయన ఎంతో ధయిర్యంగా గీతాపారాయణం చేస్తూనే వున్నాడు.

మహాదేవ్ సేఠ్ ఇంకా పెద్దగా కేకలు వేస్తూనే వున్నాడు. కోపంతో అతని వళ్ళంతా వణికిపోతూ వుంది. ఎంతో నిరాడంబరంగా వినయంగా వుండే గోపాలరావు ఈనాడు ఇంత సిగ్గుశరమూ లేకుండా వుండడం చూసి కోపంతోబాటు ఆశ్చర్యం కూడా కలిగింది. గోపాలరావు గీతా పారాయణంలో నిమగ్నమై వుండడం కపటంగా కనిపించింది. గోపాలరావును కొట్టాలనిపిస్తూంది. కాని తన్ను తాను సంభాళించుకుంటున్నాడు. ఈ భావన రాకుండా అణచుకుంటున్నాడు. ఎంత తడవు నిలబడి వున్నా గోపాలరావు తనవేపు తిరిగిచూడనందున ఆటంబోతు రంకెవేసినట్లు కేకవేశాడు: ‘గోపాల్‌రావ్, ఇప్పుడేం చేయమంటావ్?’

గోపాలరావు తన పారాయణం కట్టిపెట్టి ఆయనకు ఈ శ్లోకం వినిపించాడు.

‘వేదేషు యజ్ఞేషు తపః సుచైవ
దానేషు యత్ పుణ్యఫలం ప్రదిష్టమ్,
అత్యేతి తత్ సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానముపైతి చాద్యమ్.’

‘ఈ కపటనాటకాలు నా దగ్గిరకాదు. డబ్బు ఎప్పుడిస్తారో చెప్పండి.’

‘ఏం డబ్బా? నేను మీవద్ద ఏమీ తీసుకోలేదే?’

‘మీరు కాకపోతే మీ భార్యాపిల్లలూ తీసుకున్నారు.’

‘అయితే ఇలా చేయండి. వాండ్లంతా అక్కడున్నారు. వెళ్ళి వారితో సంప్రదించండి. ఇచ్చిపుచ్చుకొనే పనులన్నీ వారే చూస్తూవుంటారు. ఈ ఇంట్లో నా అస్తిత్వం బొత్తిగా లేనట్లే’ అంటూ గోపాలరావు మళ్లీ గీత తెరచి నిశ్చింతగా చదవసాగాడు.

సేఠ్ మహాదేవ్ కోపంతో నెత్తిమీద టోపీలాగి నేలకేసికొట్టి అందుపై దభాల్ని కూలబడుతూ

'ఎంత దుర్మార్గం? పెండ్లాం పిల్లలపైన పెడు తున్నావా? ఇవాళ నీ సంగతేదో తేలుస్తా, డబ్బు లేకుండా ఇక్కణ్ణుండి కదల్ను. ఆఁ అంతే, మా అబ్బ పైన వొట్టు' అన్నాడు.

గోపాల్‌రావు మళ్లీ ఒకమాటు సేఠ్ మహాదేవ్ వేపు చూసాడు. గీత ఒకవేపు మూసిపెట్టి వంట ఇంటివేపు అడుగువేశాడు. తనవేపు వస్తున్న భర్తను చూసి రాధాబాయి లోనికివెళ్లి తలుపువేసుకొంది. ఇదంతా చూస్తూనే గోపాలరావు అంతవరకూ వెళ్లి తలుపుతట్టుతూ మెల్లమెల్లగా చెప్పాడు. 'చూడు, రాధాబాయీ, నీతో మాట్లాడ్డానికి ఎవరో వచ్చారు. ఆయన బాకీదారుడు. డబ్బు అడగడానికి వచ్చి అనవసరంగా నాతో వాదిస్తున్నాడు. అతడికి మన పరిస్థితి అర్థమయ్యేలాగా చేయడం మీ బాధ్యత గదా! నేను ఇంట్లో వుంటేనే చాలుననీ, అంత మాత్రం చేతనే సుఖంగా సంతోషంగా వుంటామనీ ఆరునెల్ల క్రితమే మీరంతా అంగీకరించారు. ఇప్పుడు అదంతా మరచిపోయి అకారణంగా నన్నెందుకు బాధపెడు తున్నారు? నేను చనిపోయానని మీకు తెలుసు గదా! ఆరునెల్ల క్రితమే చనిపోయాను.'

'అవునవును, మీరు చచ్చిపోయారు. నేను ముండమోసాను. నా బిడ్డలు పరాయివాళ్లయారు. ఇదంతా నాకు తెలుసు.' దభాల్ను తలుపు తెరచుకొని బయటికి వచ్చిన రాధాబాయి తన చేతి బంగారు మురుగుతీసి సేఠ్ మహాదేవ్ ముందు విసరివేసి ఇంకా ఇలా అంది. 'సేఠ్‌జీ, తీసుకోండి యీ మురుగు. పెండ్లినాడు మా అత్తగారు వీటిని నాకు పెండ్లి కానుకగా ఇచ్చారు. అయిదు సవర్ల మురుగు ఇది. దీంతో మీ అప్పు తీరిపోతుంది. ఇంకా ఏమన్నా కొరవ వుంటే మళ్ళీ రండి.'

మహాదేవ్ సేఠ్ స్థాణువులా చూస్తూ వుండి పోయాడు. పాపం, ఇదంతా అతనికేమి అర్థమవు తుందీ? గోపాలరావు వేపు చూశాడు. గోపాలరావు మళ్ళీ గీతా పారాయణంలో మునిగిపోయాడు. అతనికి ఈ ఇంటితో బొత్తిగా సంబంధం లేనట్లే కనపడు తున్నాడు. రాధాబాయి కన్నీళ్లు తుడుచుకుంటూ నిలబడిపోయింది. నేల మీద పడివున్న మురుగును తాకతలుచుకోనేలేదు మహాదేవ్ సేఠ్. లేచి నిలబడి తన టోపీ విదిలించుకుంటూ, రాధాబాయీ నేనెప్పుడూ ఈలాంటి పని చేయలేదు. నేను వెళ్లిపోతున్నాను. అవకాశం వున్నప్పుడే నా డబ్బు పంపించండి. అన్నాడు.

సేఠ్ వెళ్ళిపోయాడు. రాధాబాయి మురుగు తీసుకొంది. కాని చేతికి తొడుక్కోలేదు. చీరకొంగున ముడివేసుకొంటూ, వణికిపోయే గొంతుతో తిరస్కార యుక్తంగా ఇలా అంది. 'ఈ వయస్సులో చేయరాని పాపం చేయడం, తరవాత 'గీత'లో తలదూర్చి పశ్చాత్తాపపడడం ఏమంత బాగా వుంటుందీ?'

గోపాలరావు ఈ మాటలు విన్నాడు. కాని అతనికేమీ అనిపించలేదు. అతని మౌనముచూసి రాధా బాయి ఇంకా రెచ్చిపోయింది.

'ఇవాళ వసంత్ వచ్చింతరవాత ఏదో ఒకటి తేల్చేయండి.' అంటూ అంటూ వంటయింట్లోకి వెళ్లిపోయింది.

ఇరవై సంవత్సరాల ఆమె గృహస్థ జీవితంలో ఎప్పుడూ ఏడవాలసిన సందర్భమే రాలేదు. కాని గత ఆరునెలలుగా ప్రతిరోజూ ఎన్నిమార్లు ఏడుస్తుందో లెక్కలేదు. ఆమె సుఖప్రదమైన జీవితంపైన ఎవరి దృష్టి పడింది. ఏం జరిగిందో ఆమెకు అర్థం కావడంలేదు. ఎప్పటిమాదిరే తొమ్మిదీ ఇరవై అయిదు నిమిషాలకు రాధాబాయి చేతినుండి వక్కపొడి అందు కొని నోట్లోవేసుకొని నములూ నములూ ఇంటి నుండి బయలుదేరుతున్నాడు గోపాలరావు. పన్నెండు నిమిషాల్లో స్టేషన్ చేరుకుంటున్నాడు. తొమ్మిదీ నలభై నిమిషాలపాస్టు బండియెక్కి నలభై నిమిషాల్లో చర్చిగేట్ (బొంబే) చేరుకుంటున్నాడు. రోజూటి టైంటేబుల్ ఇవాళ కూడా జరిగింది.

*  *  *

రాధాబాయికి గూడా ఒక టైంటేబిల్ వుంది. తొమ్మిదీఇరవైఅయిదు నిమిషాలకు గోపాల రావు వెళ్లగానే ఆమె వేంకటేశ్వరస్తోత్రం చదవడానికి కూర్చుంటుంది. అది పూర్తిఅయ్యేవరకు వసంత్ కూడా కాలేజీనుండి వస్తాడు. అతడి భోజనం పూర్తిఅయ్యేవరకు హేమ కూడా స్కూలునుండి వస్తుంది. రాధాబాయి ఇద్దరికీ అన్నం వడ్డిస్తుంది. అందరూ తోడుగా భోజనం చేస్తారు. భోజనం తరవాత అన్నా—చెల్లెలు కూర్చొని చదువు కుంటారు. రాధాబాయి ఇంటి పనులు చక్కబెట్టు

కొంచె కొద్దితడవు విశ్రాంతి తీసుకుంటుంది. సరిగ్గా మూడు గంటలకు హేమ ఆమెను లేపుతుంది. తాను మూడున్నర గంటలకు క్లాసుకు వెళ్ళుతుంది. హేమ వెళ్ళిన తరవాత రాధాబాయి సాయంకాలపు వంట ప్రయత్నంలో పడుతుంది. గోపాలరావు సాయంకాలం ఏడు గంటలకు వచ్చి వెంటనే భోజనానికి కూర్చుంటాడు. ఎందువల్లనంటే ఉదయం కడుపునిండా అన్నం తినడం సాధ్యమయ్యేది కాదు. పైగా ఆఫీస్‌లో ఏమీ తినడం ఆయనకు ఇష్టంగాదు.

ఇదీ ఆయన నిత్య జీవితం. అందులో కూడా వక మజా వుంది. సంతోషం వుంది, కాని వకనాడు అకస్మాత్తుగా ఇదంతా భంగమైపోయింది. ఉదయం తొమ్మిదీ ఇరవై అయిదుకు ఇంటినుండి బయలు దేరిన గోపాలరావు షుమారు 12 గంటలకు తిరిగి వచ్చాడు. రాధాబాయితో ఏమీ మాట్లాడకుండానే మంచంపై బాసిన పట్టు వేసుకొని కూర్చున్నాడు. ఈ విధంగా వేళకాని వేళప్పుడు తిరిగి రావడం చూసి రాధాబాయి, వసంత్, హేమా వాళ్ళందరకూ ఆశ్చర్యమైంది.

'ఏమండీ, ఒళ్లేమైనా బాగాలేదా ?' రాధాబాయి నెమ్మదిగా అడిగింది.

'ఏం నాన్నా, పడక వేయమంటావా ?' వసంత్ భయపడ్తూనే అడిగాడు.

'నాన్నా, తల నొప్పిగా ఏమైనా వుందా ?' హేమ కూడా అడిగింది.

గోపాలరావు మౌనంగానే వుండిపోయాడు. వ్యాకుల చిత్తంతో పిల్లలవేపు చూసాడు. ఉన్నట్లుండి కండ్ల వెంట నీళ్ళు కారాయి. రాధాబాయి భయపడిపోయింది. దగ్గర కెళ్ళి 'ఇదేంటండీ, మీ కండ్లల్లో నీళ్ళ ?' అడిగింది.

దగ్గరనే నిలబడివున్న రాధాబాయి చేతులు తన చేతుల్లోకి తీసుకొన్న గోపాలరావు దుఃఖంతో 'రాధా, రాధా, వకవేళ నేను చచ్చిపోతే మీ పరిస్థితి యెలా వుంటుందీ?' అడిగాడు. రాధాబాయి దుఃఖంతో క్షణ కాలం మౌనంగా వుంది. తరవాత స్థిమితపడి 'అయ్యో, అయ్యో, యేమిటండీ ఈ అపశకునపు మాటలూ...?' అంది.

'కాదు రాధా, నేను చనిపోతే నువ్వు ఏం చేస్తావు?' గోపాలరావు మళ్లీ అడిగాడు.

భర్త తడికండ్లతో తన కన్నీటి దృష్టిని కలుపుతూ ఆమె 'ఏమిటీ మీరనేది. ఇంత పచ్చని సంసారంలో ఈమాట లేమిటీ?' అంది.

'కాదు రాధా, నా ప్రశ్నకు తిన్నగా సమాధానం చెప్పు.' గోపాలరావు ఎంతో బాధాకరంగా అడిగాడు.

'మీమాదిరే కష్టపడి మీ పిల్లలను పోషిస్తాను.' తన కన్నీళ్లు బిడ్డలకు కనపడకుండా ముఖం పక్కకు తిప్పుకొని జవాబు చెప్పింది. తన చేతులు వదిలించుకొని గోపాలరావు భుజానవేసి యేడుపుగొంతుతో అంది: 'ఉద్యోగంలో యేమైనా పొరపాట్లు జరిగాయా? అలాంటిదేదైనా జరిగితే మనకా ఉద్యోగమే వద్దు. మీరు మామధ్యవుంటే మరేం కావాలి?'

'అవున్నాన్నా, నేను కాలేజీ వదలిపెట్టి ఏదైనా ఉద్యోగం చేస్తాను. మీరు ఆ మాటమాత్రం మాటాడకండి. మీరు మాకు కావాలి.' వసంత్ తన తొట్రుపాటు స్వరాన్ని కప్పిపుచ్చే వ్యర్థ ప్రయత్నం చేస్తూ అన్నాడు. తండ్రిపాళ్లో తలపెట్టి ఏడవడం ఆరంభించాడు. హేమ కూడా తలగడలో తలదూర్చి యేడవసాగింది.

కొంతతడవు ఇలాగే గడచిపోయింది. అప్పుడు గోపాలరావు కొంచెం స్థిమితపడి 'నేను నా జీతం ఇంట్లో ఇవ్వను. జరుగుద్దా?' అడిగాడు.

'ఆఁ ఆఁ జరుగుద్ది' తల్లీ బిడ్డలు వకేసారి అన్నారు.

'ఇక నేను చచ్చిపోయాను. ఈ రోజునుండి ఇలాగే అనుకోండి. ఉద్యోగం చేస్తాను. కాని జీతం ఇంట్లో ఇవ్వను. ఈ ఇంట్లో వుంటాను. కాని మీలో వకడిగా వుంటాను. ఇంటి యజమాని హోదాలో మాత్రం కాదు. ఇక ఈ ఇల్లు మీది. దీన్ని మీరే నడపాలి. అర్థమైందా ? నేను చచ్చిపోయాను. ఈ రోజునుండి నేను లేను.' వకే గుక్కతో ఇదంతా చెప్పి మంచంమీదినుండి లేచాడు. కోటు ఇప్పి వంకెకు తగిలించి బయటి గదిలోకి వచ్చి భగవద్గీత తీసుకొని వెళ్లి వాలు కుర్చీలో కూచున్నాడు.

* *

ఆనాటినుండి గోపాలరావు ఇంట్లో వున్నప్పుడంతా వాలు కుర్చీలో కూచొని గీతా పారాయణ

చేస్తూ కనిపించేవాడు. ఇంట్లో వుంటూ కూడా లేని వాడితో సమానమే. ప్రతి రోజూ ఉద్యోగానికి వెళ్ళడం, సాయంకాలానికి తిరిగిరావడం, ఒకటో తేదీ నాడూ, ప్రతి శనివారమూ ఇంటికి ఆలస్యంగా వచ్చే వాడు. వచ్చినప్పటినుండి వ్యాకులతగా వుండేవాడు. రాత్రంతా చింతిస్తూ బెడ్‌లాంప్ వెలుగులో కూచొని 'గీత' చదువుతూ వుండేవాడు. గత ఆరు నెల్లుగా ఇలాగే జరుగుతుంది. ఆ ఇంట్లో ఆనందమూ సుఖమూ లోపించిపోయాయి.

ఇంట్లో డబ్బంతా ఖర్చయిపోయింది. గోపాల రావు ఉద్యోగం చేస్తున్నాడేగాని జీతం ఇంటికి తీసుక రావడంలేదు.

'ఉద్యోగంలో డబ్బు గొడవలేమైనా జరిగి పోయాయా ?' అని అడిగీ అడిగీ రాధాబాయి విసుగు చెందిపోయింది. రెండు నెల్లవరకు ఆమె మనస్సులో ఇదే సందేహం వుండేది. కాని ఆఫీసులో అలాంటిదేమీ జరగలేదని తరవాత తెలిసింది. ప్రతి ఒకటో తేదీనా గోపాలరావు నియమానుసారంగా జీతం తీసుకొంటూనే వున్నాడు. ఆఫీసులో పనిగూడా సక్రమంగానేచేస్తూ వున్నాడు. ఎక్కువ మౌనంగా మాత్రమే వుంటు న్నాడు. ఎవరితోనూ మాట్లాడేవాడు కాదు. కద లడు మెదలడు.

మొదటి రెండు నెల్లూ బాకీదారులకు 'కొంచెం ఇబ్బందుల్లో వున్నాం. డబ్బు తప్పకుండా ఇస్తాం.' అంటూ నచ్చజెప్పి పంపించింది రాధాబాయి. కాని తరవాత లోకులకు ముఖం చూపించడంకూడా కష్టమై పోయింది. హేమ స్కూలు ఫీజు కట్టాలి. వసంత్ పరీక్ష ఫీజు కట్టాలి. రాధాబాయి పట్టుదలవల్లనే అతడు కాలేజీకివెళ్ళి చదువుతున్నాడు. లేకుంటే చదువుమానేసి ఏదైనా ఉద్యోగం చూసుకొనేవాడు. ఇదంతాచూసి నేడు కాకపోతే రేపైనా గోపాలరావు తనమనస్సు మార్చుకుంటాడనే ఆశతోనే రాధాబాయి కుటుంబాన్ని నెట్టుకొస్తూవుంది బాకీదారుల బెద రింపులువిని ఆ కోపంతో మళ్ళీ ఇంటి విషయాల్లో జోక్యం కలుగజేసుకుంటాడనీ, ఇంటియజమాని మాదిరి వ్యవహరిస్తాడనీ ఆశపెట్టుకొని వుంది. కాని ఈ ఆశకూడా అడుగంటి పోయింది. గోపాలరావు ఇంటిలో వుండడం, భోజనం చేయడంతప్ప మరొకటి చేయ్యడం లేదు.

* * *

రాధాబాయి చాలదూరం నచ్చజెప్పే ప్రయ త్నం చేసింది. వసంత్, హేమ వాండ్లుకూడా బతి మాలారు. కాని గోపాలరావు చప్పగా అందరికీ ఒకే సమాధానం 'కాని నేను చనిపోయానుగదా!' చెప్పే వాడు. క్రమేణా ఇంటి రూపమే మారిపోయింది. కూడబెట్టిన డబ్బంతా ఖర్చయిపోయింది. అప్పు పెరిగిపోయింది. అప్పుదారుల పేచీలతో రాధాబాయి విసుగుచెందిపోయింది. ఆమెకు చెడుతలంపులు వస్తు న్నాయి. తన భర్త నిజంగా చనిపోయినా బాగావుండు ననిపిస్తున్నది.

ఒకనాడు ఈలాటి ఆలోచనలలోనే సతమత మవుతూ గోపాలరావును అడిగేసింది. 'మాట మాట్లాడితే చచ్చిపోయాను, చచ్చిపోయానంటారు, భోజనానికిమాత్రము రెండుపూటలూ సిద్ధమే?'

'నువ్వు కావాలంటే అదికూడా మానేస్తా' గోపాలరావు యేమాత్రం కోపగించుకోకుండానే అనే శాడు. ఆమాటకు రాధాబాయికి యేడుపొచ్చింది. ఆమె మరేమీ మాట్లాడలేకపోయింది. మరొకరోజున రాధా బాయి ధయిర్యంచేసి అడిగింది. 'వసంత్ కాలేజీ మానిచేసి ఉద్యోగం చేస్తాననంటున్నాడు. వాణ్ణి మనం ఇంజినీరింగ్ చదివిస్తామనుకొన్న విషయం మీకు తెలుసుగదా? వాడు ఈ సంవత్సరం ఇంటర్‌లో వున్నాడు గదా? మీరు యిలా వ్యవహరిస్తే యెలా జరుగుతుంది?'

'తండ్రి చనిపోయిన పిల్లవాడు ఈలాంటి పనికిరాని కలలు కనడం యేం భావ్యం?' గోపాల రావు నిర్లిప్తంగా అన్నాడు.

రాధాబాయి ఈ మాటలన్నీ వినీవినీ విసుగు చెందింది. వసంత్ చదువు మానివెయ్యడం ఆమె కెంతమాత్రమూ ఇష్టంలేదు. కనక ఆమె ప్రతిరోజూ ఉత్సాహపరచి కాలేజీకి పంపేది. కాని ఇప్పుడామె ప్రయత్నాలు సాగడంలేదు. ఇల్లు మునిగిపోయే టట్లుంది. ఎవరో ఒకరి సంపాదన అవసరమయింది. పరిస్థితులన్నీ సహించరానివిగా తయారయినాయి. ప్రతి రోజూ బాకీదారులందరికీ జవాబు చెప్పవలసివస్తుంది. చిన్నచిన్న ఆభరణాలన్నీ అప్పుడప్పుడూ అమ్మివేయడం జరిగింది. రాధాబాయివద్ద పెళ్ళినాటి గుర్తులుగా వున్న మురుగులు తప్ప మరేమీ మిగల్లేదు. భర్త

బతికివుండి కూడా రాధాబాయి విధవ జీవితం జీవిస్తూ వుంది.

ఇవాళ అటో ఇటో తేల్చుకోడానికే రాధాబాయి నిశ్చయించుకుంది. సేఠ్ మహదేవ్ కేకల ప్రభావం గోపాలరావుపైన ఆవగింజంత కూడా పడలేదు. రాధాబాయి ఇక యెక్కువకాలం సహించజాలకపోయింది. రెండునెల్లక్రితం వసంత్ చెప్పినమాటలు తల్చుకుంటూవుంటే ఆమె హృదయం కంపించిపోతూంది. రెండు నెల్లనుండీ ఆమె ఆ విషాన్ని హృదయంలో దాచిపెట్టుకుంది. ఎలాగైనా మళ్లీ తన భర్త ఇంటి విషయాల్లో జోక్యం చేసుకుంటాడనీ, బాధ్యత గుర్తిస్తాడనీ, వకటే ఆశ పెట్టుకుంది. కాని ఆ ఆశ నేటికీ నెరవేరలేదు. ఏడుపులూ, దిగుళ్లూ—ఇవే మిగిలిపోయాయి. ఇంతవరకూ గోపాలరావుకు కష్టంకలిగే మాటలేమీ ఆమె అనలేదు. నచ్చజెప్పడానికే ప్రయత్నించింది. కాని ఇప్పుడు కుండ బద్దలుకొట్టండే ఇక వేరే మార్గం లేదు.

వసంత్ ఇంటికి వచ్చి గోపాలరావువేపు చూడకుండానే వంట ఇంట్లోకి వెళ్ళిపోయాడు. తనకిప్పుడు తండ్రి ఎడల ఆదరణగాని, ప్రేమ గానీ లేదు. కొద్దిసేపటి తరవాత వంట ఇంట్లోనుండి బయటికి వచ్చాడు. అతడి శరీరం వణకిపోతూంది. ఏదో మాట్లాడాలని ప్రయత్నిస్తున్నాడు. కాని మాట పెగలడంలేదు. మాట కొంచెం మెల్లగా రానిస్తూ 'నాన్నగారూ!' అన్నాడు.

గోపాలరావుకు ఆ శబ్దం కొత్తగా తోచింది. గీత మూసిపెట్టి తల పైకెత్తాడు.

'నాన్నగారూ, ఇప్పటికే చాలా జరిగిపోయింది?'

'ఏం జరిగిపోయింది చాలా ?'

'మీరు జరిపేంపంతా; అమ్మ ఎంత బాధపడుతోంది ? అప్పలు పెరిగిపోతున్నాయి. మీకేవీ కనిపించడంలేదా ?'

'అంతా కనపడుతూనే వుంది. కాని వాటితో నాకేమి సంబంధం ? నేను చచ్చిపోయానని ఇంతకు ముందు అనేకసార్లు మీతో చెప్పివున్నాను గదా? ఈ ఇల్లు నీది. నువ్వు నడపవలసి వుంది.'

'అవునవును. వాడు ఈ ఇల్లు నడపవలసి వుంది. మీరు ఇంకో ఇల్లు నడుపుతారు. ఈ వయస్సులో ఇంకోదాన్ని పెట్టుకొని దాని ఇల్లు నింపండి.' రాధాబాయి సహనము కోల్పోయి మనసులోమాట కక్కేసింది.

'ఏమిటీ నువ్వు అనేది?' గోపాలరావు అదిరిపడ్డాడు.

'నిజమే అంటున్నాను. మాకేమీ తెలియదని మీరనుకుంటున్నారు. మాకు అంతా తెలుసు. వసంత్ తనకండ్లతో అంతా చూశాడు.'

'ఏం చూశాడు వసంత్' గోపాలరావు గొంతు బొంగురు పోయింది.

'అంతా చెప్పేసెయ్ వసంత్, తండ్రి అని భయపడవన్లేదు.' వసంత్ భుజం తట్టుతూ రాధాబాయి అంది. 'చెప్పు వసంత్, నువ్వు ఏం చూశావో చెప్పు.' గోపాలరావు శాంతంగానే అడిగాడు.

ప్రతినెలా వకటవతేదీనా, ప్రతిశనివారమూ మీరు మాలాడ్‌పేటలో వకామె ఇంటికెళ్తున్నారు. ఆమెకు జీతమంతా ఇచ్చేస్తున్నారు. ఆమెకు ఇద్దరు పిల్లలున్నారు. ఆ పిల్లలకు మీరు బొమ్మలూ మిఠాయిలూ పట్టుకెళ్తున్నారు.' వసంత్ భయపడుతూనే చెప్పేశాడు.

విన్నారా! ఈలాంటి పనికిమాలిన పనిచేయడానికే మీరు నా యింటికి నిప్పుపెట్టారా? ఈ వయస్సులో ఈ పని మంచిదేనా? నిజంగా చచ్చిపోతే వక్కసారి ఏడ్చి వూరుకొనే దాన్ని. కాని ఇదేం చచ్చిపోయిన సంసారం? రోజూ ఏడవడం రోజూ మోసపోవడం?' రాధాబాయి స్వరం కంపించి పోయింది.

'రాధా...' గోపాలరావు కఠోరంగా అన్నాడు.

'నేను చెప్పేదంతా సావధానంగా విను. ఆరు నెల్లక్రితమే ఇదంతా నేను మీతో చెప్పవలసింది. కాని పొరపాటు జరిగిపోయింది. వసంత్, నువ్వు చూసిందంతా నిజమే. నేను ఆమెవద్దకు వెళ్తున్నాను. ఆమెకు జీతమంతా ఇస్తున్నాను. ఆమె పిల్లలకు బొమ్మలూ మిఠాయిలూ పట్టుకెళ్తున్నాను. ఆ ఇద్దరు పిల్లలు, బొమ్మలు, మిఠాయిలూ—ఇందులోనే వారికి ఆనందం వుంది. వీండ్లుకాక ఆ ఇంట్లో మరో ఆమె వుంది--ఆ పిల్లల నాయనమ్మ ఆ యువతి అత్త. పాపం, ఆమె గుడ్డిది. ఆరునెల్లక్రితం సందర్భం చెబుతున్నాను. వినండి.

ఆనాడు రోజటిమాదిరే తొమ్మిదీ ఇరవై అయిదు నిమిషాలకు బయలుదేరాను. అలవాటు ప్రకారం దారిలో తమలపాకులు వేసుకొని స్టేషన్ చేరుకొన్నాను. రైలు వచ్చింది. ఎప్పటిమాదిరే బాగా రద్దీగా వుంది. ఎలాగైనా ఆ రైల్లో ఎక్కవల

సిందేగా? ఆ బండి జోగేశ్వరీ సెంట్రల్ స్టేషన్‌ల మధ్య నిలబడేది కాదు. తలుపువద్ద కమ్మీ పట్టుకొని ఏదో విధంగా ఎక్కాను. పుట్‌బోర్డుపైన ఎలాగోచేసి కాళ్ళు ఆనించాను. శరీరమంతా బయటికే వుంది. 'కొంచెం లోనికి వెళ్ళండి.' అని అంటూ వున్నానే గాని ఎవరూ కూడా కదల్లేదు. సెంట్రల్ వరకు అలాగే వేలాడుతూ బాధపడుతూ వెళ్ళవలసిందే! ఇంతలో నా ముందు నిలబడివున్న వ్యక్తి నాతో 'చూడు బ్రదర్, నువ్వు ఇక్కడకు రా, నేను నీ స్థలంలో నిలబడతాను. నాకు అలా నిలబడడం అలవాటే.' అన్నాడు.

నేను లోనికి వెళ్లి అతని స్థలంలో నిలబడ్డాను. అతను నా స్థలంలోకి వచ్చి నిలబడ్డాడు. బాంద్రా స్టేషన్‌లోని బయటి స్తంభానికి కొట్టుకొని ధడాల్ను కింద పడ్డాడు. ఎవరో గొలుసు లాగారు. బండి ఆగిపోయింది. కొంతమంది కిందికి దిగారు. నేనూ దిగాను. పరుగెత్తుకుంటూ ఘటనా స్థలానికి చేరుకున్నాను. అతని తల పుర్రె పగిలిపోయింది. నిర్జీవంగా పడివున్నాడు.

నన్ను 'బ్రదర్' అన్నాడు. నా మృత్యువును తాను స్వీకరించాడు. నేను చావవలసివుండె. కాని అతను చచ్చిపోయాడు. అతని ముఖం వికృతంగా గుర్తించ నలవికాకుండా వుంది, నేను మాత్రం అతన్ని సరిగ్గా ఎక్కడ చూశానూ? కాని అతడు నన్ను 'బ్రదర్' అన్నాడు. నన్ను మృత్యుముఖంనుండి కాపాడాడు.'

గోపాలరావు కండ్లనుండి కన్నీటిధార ప్రవహిస్తూ వుంది. అతనిగొంతు పల్చబడిపోయింది. ధోవతితో ముక్కులు తుడుచుకొని తిరిగి చెప్పడం ఆరంభించాడు.

నా కండ్లు తిరిగిపోయాయి. ఆ నిర్జీవప్రాణి స్థలంలో నా శవం కనుపించింది. నా తల పగిలిపోయి వుంది. యెదురుగుండా రాధాబాయి ముఖం కనపడింది. ఆమె తన ముఖాన బొట్టు తుడిచివేసుకొంది. అటు పక్కనే వసంత్,హేమావాండ్లు యేడుస్తూ కనిపించారు. రాధా నేను చనిపోయాను. నేను ఆనాడే చనిపోయాను.

స్ట్రెచర్‌మీద అతని శవం బాంద్రాకు తీసుక వచ్చారు. శవ పంచాయతీ జరిపివేశారు. అతని జేబులో మాలాడ్‌నుండి చర్చి గేటుపాస్. సిగరెట్ పెట్టె, రెండురూపాయల చిల్లర వున్నాయి. పాస్ పైన పేరూ, అడ్రసూ వున్నాయి— రమేష్‌చంద్ర మోడీ, టోపీవాలాచాల్, మాలాడ్.

అతడు తన కులస్థుడూ కాదు, పరిచయస్థుడూ కాదు. అయినా అతడు నన్ను బ్రదర్ అన్నాడు. స్వయంగా తాను చనిపోయాడు.' బ్రదర్, ఇక్కడకు 'రా' అంటూ నన్ను తన స్థలంలో నిలబెట్టాడు, నన్ను లోపలకు తీసుకొని తాను స్వయంగా బయటికివచ్చి నిలబడ్డాడు. ఈ ప్రపంచంనుండే బయటికి... వసంత్, ఆమెవుందే, నువ్వు చూసిన ఆమె, ఆ శవం భార్య, ఆ పిల్లలు ఆ శవం పిల్లలు. రాధా ఆ శవానికి ఆ ముసలామె గుడ్డితల్లి. రాధా, ఆ చనిపోయినవాని సంసారం అది. నేను అతని ఇంటిని చెదరగొట్టాను. నా కారణంగా ఆ ఇంటి యజమాని చనిపోయాడు. అతని ముసలితల్లి, భార్యాబిడ్డలకు ఈ ప్రపంచంలో యెవరూ లేరు. వారు అనాథలైపోయారు. వాండ్ల ఇంట్లో సంపాదించేవారెవర్ూ లేరు. ఉన్నవాడు కాస్తా నన్ను 'బ్రదర్' అని చచ్చిపోయాడు. రాధా, ఆమెను— నా సోదరుని... చిన్న సోదరుని భార్యనూ, అతని గుడ్డితల్లినీ కలుసుకోడానికి ప్రతి శనివారమూ అచ్చటికి వెళ్ళుతూ వున్నాను. నా జీతం వాండ్లకు ఇస్తూ వున్నాను. నేను వాండ్లకు ఇంతకంటే మరేం చేయగల్ను...ఆనాడు నేనే చనిపోయివుంటే,...రాధా, నీకు వసంత్ వున్నాడు. వాడే ఇంటియజమాని అయివుండేవాడు .. కాని రాధా, నేనే ఆ మృతసోదరుని కుటుంబం జరపాలి గదా ? అతని ప్రాణాలవెల యెలాగూ నేను చెల్లించజాలను. నన్ను బ్రదర్ అంటూ చచ్చిపోయాడు ... కాదు రాధాకాదు. నేనే చచ్చిపోయాను. 'నేను మీ మధ్యవుంటె, అంతే చాలు' అని ఆ నాడు మీరు అనలేదా? ఇప్పుడు ఈ బాధంతా ఎందుకు?...నేను ఇక్కడ వున్నందున మీకు సుఖం లేకపోతే......నన్ను వెళ్లనివ్వండి. ఆ మృత వ్యక్తి కుటుంబం పోషించడానికి నన్ను వెళ్లనివ్వండి. 'నేను చనిపోయాను' అని అనుకొని నాకు ముక్తి కలుగజేయండి. రాధా...'

కండ్లనిండా కరుణ భావన నింపుకొని రెండు చేతులూ జోడించిన గోపాలరావు రాధాబాయి ఎదుట నిలబడి వున్నాడు. ఉభయుల కండ్లవెంట అశ్రువులు ప్రవహిస్తూ వున్నాయి.

# ప్రవరసేనుని సేతుబంధ . వ్యా౦

## శ్రీ తిరుమల రామచంద్ర

సేతుబంధ మనగానే మన మనసులో రామాయణ గాథ మెరపువలె మెరుస్తుంది. అవును; ఇది రామాయణగాథే. రామాయణంలోని యుద్ధకాండ వస్తువుగా రచితమైన కావ్యం. సామాన్య వ్యవహారంలో ఉన్న ప్రాకృత భాషలో జానపదకవులు చెప్పిన ముక్తక ముక్తాఫలాల గుచ్ఛమైన గాథాసప్తశతిలో సీతారామ చరిత ఘట్టాలను వర్ణించే గాథలు కొన్ని ఉన్నవి. కాని, రామకథ వస్తువయిన తొలిప్రాకృత భాషా కావ్యం సేతుబంధమే. ఈ విధంగా ఇది దేశభాషల లోను తొలి రామాయణ కావ్యమయింది.

ఈ సేతుబంధ కావ్యాన్ని రావణవహో, 'దహముహవహో' అనికూడ వ్యవహరించినారు. దీనిని ప్రవరసేనుడనే రాజు రచించినాడు. సంస్కృతవాఙ్మయంలో తొలి గద్యకావ్య రచయిత, లాక్షణికాగ్రేసరుడు అయిన దండి

'మహారాష్ట్రాశ్రయాం భాషామ్
ప్రకృష్టం ప్రాకృతం విదుః,
సాగరః సూక్తిరత్నానాం
సేతు బంధాది యన్మయమ్.'

(మహారాష్ట్రంలోఉన్న భాష ఉత్తమ ప్రాకృత మని అంటున్నారు. ఆ భాషలో సేతుబంధం మొదలయిన కావ్యాలు, సూక్తిరత్నాలకు సాగరం వంటివి ఉన్నవి.) అని సేతుబంధ కావ్యాన్ని సూక్తి రత్నాకరమైన సాగరంగా ప్రశంసించినాడు. బాణభట్టు హర్ష చరితంలో

'కీర్తి ప్రవరసేనస్య
ప్రయాతా కుముదోజ్జ్వలా,
సాగరస్య పరమ్ పారం
కపి సేనేవ సేతునా.'

(కలువలవలె తెల్లని ప్రవరసేనుని కీర్తి రాముని కపి సేనవలె సముద్రం దాటింది.) అని నాడు.

సేతుబంధ కావ్య రచయిత ప్రవరసేనుడు వాకాటి వంశరాజని, క్రీస్తు శకం 410—440 ప్రాంతంలో ఉన్నవాడని, కాళిదాసుకు ఆశ్రయుడైన గుప్తసార్వభౌముడు ద్వితీయ చంద్రగుప్త విక్రమాదిత్యుని కుమార్తె ప్రభావతీదేవి కుమారుడని, డాక్టర్ ఎ. ఎస్. ఆల్తేకర్, డాక్టర్ ఆర్. సి. మజుమ్‌దార్ మొదలయిన విద్వాంసులు నిర్ణయించినారు. ఇతడు స్కందగుప్త కుమారగుప్తులతోపాటు కాళిదాసుకు శిష్యుడై ఉంటాడనీ, కొన్ని లిఖితప్రతుల ఆశ్వాసాంత గద్యలలోని 'సిరిపవరసేన విరఇఏ, కాళిదాస కవి దహముహవహే, మహాకవ్వే' అనే వాక్యాన్నిబట్టి ఈ కావ్యాన్ని సంస్కరించి ఉంటాడని కొందరు విద్వాంసులు భావిస్తున్నారు.

సేతుబంధం పదిహేను ఆశ్వాసాల కావ్యం. కవి ప్రతి ఆశ్వాసానికీ విడివిడిగా పేర్లు పెట్టినాడు. సాగరతట ప్రస్థానం, సాగరవర్ణనం, వానర ప్రత్యుత్సాహః, విభీషణాభిషేకః, సాగర ప్రదీపనం, శైలోద్ధరణం, శైలవహనం, రత్నాకర లంఘనం, సువేల వర్ణనం, ప్రదోష వర్ణనం, సీతావిలపనం, సేనా సన్నహనం, తుముల రణ వర్ణనం, ద్వంద్వరణ వర్ణనం, దశముఖవధః—అనే రీతిగా. ప్రవరసేనుడు ఆర్యాగీతిచ్ఛందస్సును ప్రధానంగా వాడినాడు. దీనికి ప్రథమ తృతీయ పాదాలలో పన్నెండు మాత్రలు, ద్వితీయచతుర్థ పాదాలలో ఇరవై మాత్రలు ఉంటాయి. యుద్ధాది వర్ణనలలో ఇతడు ఇతర మాత్రాచ్ఛందస్సులను వాడకపోలేదు. ఈ సేతుబంధమే గౌడవహో మొదలయిన ప్రాకృత కావ్యాలకు ఒరవడి అయింది.

ప్రవరసేనుడు మహాకవుల కోవలోని వాడనడానికి, దండిబాణ మహాకవుల ప్రశంసే తార్కాణం. ప్రాకృతభాషాయోషను తన యిచ్ఛవచ్చిన రీతిని, తన కనుసన్నలలో తిప్పుకొన్నాడీ కవి. రాజు కావడంవల్లనే కాబోలు యుద్ధకాండనే తనకావ్య ప్రధాన వస్తువుగా

గ్రహించినాడు. విషయవిభజన చాతురి, సముద్రాది వర్ణన విదగ్ధత ఇతని పరిశీలనా పాటవానికి దృష్టాంతాలు. సుగ్రీవుడు, సీత, త్రిజటి, వంటి పాత్రల పోషణలలో ఇతడు చూపిన సమర్థతను చూడగా, రాజుగా వివిధ ప్రకృతుల పరిచయ పరిశీలనతో సంపాదించిన పరిజ్ఞానాన్ని ఈ కావ్యంలో కుమ్మరించినాడా అని అనిపిస్తుంది. ఇక అన్యోన్యతముల యుద్ధ వర్ణనలను గురించి చెప్పనక్కరేలేదు. మాతామహుని దేశ విజయ యాత్రను చూచి ఉంటాడు. స్వయంగా యుద్ధాలు నడిపించిన వాడయి ఉంటాడు. కనుకనే నిజమైన రాజకవి అనిపిస్తాడు. ఈ కావ్యంలో విషయ రస వర్ణనాను గుణంగా కథనరీతి మారుతుండడం చూడగా, ఒక నాయకుడు, ఒక రాజు, ఒక దూత, ఒక ప్రత్యక్ష సాక్షి, జనపద భాషను పుక్కిట బట్టిన వాడు ఉపన్యసిస్తున్నాడా అన్నట్టు ఉంటుంది ఈ కావ్యం ఆమూలాగ్రం.

వాకాటులు వైష్ణవులు. కనుక ఈ కావ్యం మధుమథనుని స్తుతితో ప్రారంభమవుతుంది—

'ణమహ అవఢ్ఢిఅ తుంగం
అవసారిఅ విత్థలం అణోణ అగహీరవ్ఁ,
అప్పలహుఅ పరిసణ్హం
అణాఅ పరమత్థ పాఅడం మహుమహణవ్ఁ.'
(1—1)

(నమత అవర్ధిత తుంగం
అప్రసారితవిస్తృత మనవనత గభీరవ్ఁ,
అప్రలఘుకదరి శ్లక్ష్ణవ్ఁ
అజ్ఞాత పరమార్థ ప్రకటవ్ఁ మధుమథనవ్ఁ)

అని. మధుమథనుడు పంచభూతాత్మకుడు, అతని కంటె ఎత్తయినది లేదు. అతనికన్నా పరుస్తైనది లేదు. అతనికన్నా గభీరమైనది, లోతయినదిలేదు. అతనికన్నా ప్రకాశకరమైనది లేదు — అని కవి అతి సహజంగా తెలుపుతూ, పంచభూతాత్మకుడు, తద తీతుడు అని వర్ణిస్తూ, పఠితలను ఆవర్జించుకొంటాడు తనవైపు. తను తొలిసారిగా దేశభాష అయిన ప్రాకృతంలో కావ్యం చెబుతున్నాడు గనుక కావ్యకథను నిర్వహించడం కష్టం అంటాడు:—

'అహిణఅ రాఅరద్ధా
చక్కఖ్ఖలిఏసు విహడిఅ పరిటి వి ఆ,
మేత్తివ్వ పముహరిసి ఆ
ణివ్వోదుం హోఇ దుక్కరం కవ్వకహా.'
(1—9)

(అభినవ రాగారబ్ధా
చ్యుత స్ఖలితేషు విఘటిత పరిస్థాపితా,
మైత్రీవ ప్రముఖ రసికా
నిర్వోఢుం భవతి దుష్కరం కావ్యకథా.)

కావ్యకథను నిర్వహించడం మైత్రిని నిలుపుకొనడం వంటిది; చాల దుష్కరం. అభినవరాగంతో రెండూ ప్రారంభమవుతాయి. తప్పులు, స్ఖలితాలు కలుగకుండా చూచుకోవాలి. అలాటివి కలిగితే, తొలగించుకొని, రాగాన్ని—అనురాగాన్ని, రోచకతను—మరల పరిస్థాపించుకొనవలసి ఉంటుంది. ఈ రెంటినీ తుది వరకు నిర్వహించడానికి రసికత—సరసత అవసరం అని అంటాడు కవి. ఇలాటి కావ్యాలవల్ల

'పరివడ్ఢఇ విణ్ణాణం
సంభావిజ్జఇ జసో విఢప్పంతి గుణా,
సువ్వఇ సుఉరిసచరిఅం
కిం తం జేణ ణ హరంతి కవ్వాలావా.'
(1—10)

(పరివర్ధతే విజ్ఞానం
సంభావ్యతే యశః అర్జ్యంతే గుణాః,
శ్రూయతే సుపురుష చరితం
కిం తత్ యేన నహరంతి కావ్యాలాపాః)

విజ్ఞానం పెరుగుతుంది; కీర్తి కలుగుతుంది; గుణాలు సంపన్నమవుతాయి; సత్పురుషుల చరిత్రలు తెలుసుకోవచ్చు; ఇలాటి కావ్యాలాపాలలో ఎవరి మనసును హరించే గుణాలు లేవు? అని ప్రశ్నిస్తాడు కవి. ఇది 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' (కావ్యాలాపలను త్యజించాలి) అనే ధార్మికుల ఆంక్షకు సమాధానమయినట్లు తోస్తుంది. 'పరివడ్ఢఇ విణ్ణాణం' అనే ఈ ప్రవరసేనుని వాక్యాన్ని తర్వాతి ఆలంకారికులు కావ్య ప్రశస్తిని వివరించడానికి ప్రమాణంగా ఉదాహరించినారు.' 'అభినవార్ధగతితో ప్రతి ఆశ్వాసం చివర అనురాగమనే పదం చిహ్నంగా అంకితం చేసిన దశముఖవధ మహాకావ్యాన్ని వినండి. ఇది త్రిదశబందీలను విడిపించినగాథ; సమస్త త్రైలోక్య శల్యాన్ని పెరికివేసినగాథ; సీతా దుఃఖక్షయకరమైన గాథ. వినండి' అంటాడు.

'తం తిఅసబంది మోక్షం
సమస్త తెల్లోక్క హిఅఅ సల్లుద్ధరణమ్,
సుణహ అణరాఅ ఇణ్హం
సీఅ దుక్ఖక్ఖఅం దహముహస్సవహమ్.'
(1—12)

(తం త్రివశబంగిమోక్షం
సమస్త త్రైలోక్య హృదయ శల్యోద్ధరణమ్,
శృణుత అనురాగచిహ్నం
సీతా దుఃఖక్షయం దశముఖస్య వధమ్.)

ఈ కావ్యం సుగ్రీవాభిషేకానంతరం రాముడు కిష్కింధలో ఉన్నప్పుడు, వర్షర్తువు గడచి శరద్రుతువు ప్రవేశించడంతో ప్రారంభమవుతుంది. శరద్రుతువులో రాజులు జైత్రయాత్రకు బయలుదేరడం పరిపాటి గనుక, సిరిపవరసేనుడు రాజు గనుక రాజసంతో కావ్యాన్ని శరద్రుతు వర్ణనతోనే మొదలు పెట్టాడనిపిస్తుంది. ఈ శరత్తు

'తో హరివఇ జసబంధో
రాహఅ జీఅస్స పఢమ హత్థావలంబో,
సీ ఆ బాహ విహో
దహముహ వజ్ఝదిఅహో ఉవగఓ సరఓ.'
(1—16)

(సా హరిపతి యశోబంధః
రాఘవ జీవస్య ప్రథమ హస్తావలంబః.
సీతా బాష్పదిఘాతో
దశముఖ వధ్య దివసః ఉపగతా శరత్.)

శరద్రుతువు హరిపతిఅయిన సుగ్రీవుని కీర్తిపథంవలె ఉంది; రాఘవుని జీవితానికి ప్రథమ హస్తావలంబం— మొదటి చేపట్టుగా ఉంది; సీత బాష్పాలను తుడిచేదిగాను, దశముఖుని వధ్య దివసంగాను ఉన్నది; ఇలాటి శరత్సమయంలో అందరూ సీతాన్వేషణ వార్తకోసం వేచి ఉన్నారు. రాముని ఆశాబంధమైన హనుమంతుడు సీతాదర్శనవార్తతో తిరిగి వస్తాడు. అతనిని అందరూ తమ మనోరథమే తను దగ్గరికి సుఖంగా చేరిందా అన్నంత సంతోషంతో చూస్తారు. హనుమంతుడు:—

'పఢమం చిఅ మారు ఇణా
హరిస భరిజ్జంత లోఅణేణ ముహేణ,
జణఅ తణఅ పఉత్తీ
పచ్ఛా వాఆఇ ణిరవసేసం సిట్ఠా.' (1—37)

(ప్రథమయేవ మారుతినా
హర్ష భ్రియమాణలోచనేన ముఖేన,
జనకతనయా ప్రవృత్తిః
పశ్చా ద్వాచా నిరవశేషం శిష్టా.)

మొదట సంతోషం తొణికిసలాడే కళ్లతోను, ముఖంతోను జనకతనయ కుశలవార్తను—ప్రవృత్తిని తెలిపాడట; తరువాత వాక్కులతో నిరవశేషంగా చెప్పాడట. హనుమంతు సీతాదేవిని చూచినాను అనినాడు. రాముడు వినీవినట్లున్నాడు. సీతమ్మ క్షీణించిపోయింది అనినాడు. రాముడు దగ్గుత్తికతో నిట్టూర్చినాడు. మిమ్ములను గురించే శోకపడుతూంది అనినాడు హనుమ. నా కోసమా, తనకోసం కాదా అని రాముడు విలపించినాడు. జీవిస్తున్నది, ప్రాణాలతో ఉంది అన్నాడు మారుతి. మనం చేరేవరకు ఉంటుందా అన్నట్టు రాముడులేచి హనుమను కౌగిలించుకొన్నాడు.

'దిట్ఠంత్తి ణ సద్దహిఅం
ఝుణత్తి సబాహమంథరం ణీససిఅమ్,
సోఅఇ తుమంత్తి రుణ్ణం
పహుణా జిఅఇత్తి మారుఈ అవఊఢో.'
(1—37)

(దృష్టేతి శ్రద్ధితం
క్షీణేతి సబాష్ప మంథరం నిశ్వసితమ్,
శోచతి త్వామితి రుదితం
ప్రభూణా జీవతీతి మారుతి రవగూఢః)

ఇక లంకకు బయలుదేరవలెననే నిర్ణయం కలుగుతుంది రామునికి. అతడు అందరివైపు చూపు ప్రసారిస్తాడు. ఆ చూపు ఒకరొకరికి ఒకొక విధంగా భాసించిందట.

'సోహవ్వ లక్ఖణ ముహం
వణమాలవ్వ విఅడం హరివఇస్స ఉరమ్,
కిత్తివ్వ పవణ తణఅమ్
ఆణవ్వ బలాఇ సే విలగ్గఇ దిట్ఠీ.' (1—48)

(శోభేవ లక్ష్మణముఖం
వనమాలేవ వికటం హరిపతేః ఉరః,
కీర్తివ పవనతనయం
ఆజ్ఞేవ బలాని తస్య విలగతే దృష్టిః.)

ఆ చూపు లక్ష్మణుని ముఖానికి శోభ కలిగించిందట. కపిరాజయిన సుగ్రీవుని మెడలో వనమాల

వేసినట్లయిందట. ... తనయునికి ఒళ్లంతా కీర్తి వ్యాపించి రంగరించినట్లయిందట. కపిసైన్యానికి రావణవిజయయాత్రకు ఆనతి ఇచ్చినట్లయిందట.

కపిసేన సముద్రంవైపు బయలుదేరింది. చీకటి చెట్లతో నల్లగా, తరంగహస్తాలతో చల్లగా, పండిన పికతోటలతో సురభిళంగా. సముద్రుడనే గజరాజు మదరేఖవలెఉన్న సముద్రతటం చేరింది. ఆ సముద్రం

'దీసంతం అహిరామం
సువ్వంతం వి అవిహణ్ణసో అవ్వగుణమ్,
సుకఅస్స అ పరిణామమ్
పరిభుజ్జంతంపి సాసఅ సుహప్ఫలఅయ్'
(2—10)

(దృశ్యమాన మభిరామం
శ్రూయమాణమ వ్యవితృష్ణశ్రోతవ్య గుణమ్,
సుకృతస్యేవ పరిణామమ్
పరిభుజ్య మానమపి శాశ్వత సుఖ ఫలదమ్.)

ఎంత చూచినా తనివి తీరనిది. ఎంతవిన్నా విందామనిపించేది సుకృత పరిపాకంవలె ఎంత అనుభవించినా—ఎందరు ఎంతగా వాడుకొన్నా శాశ్వత సుఖమిచ్చేది. గగనానికి ప్రతిబింబమా అన్నట్లు, ధరణికి నిర్గమ స్థానంలాగ, దిక్కులకు ఆశ్రయంలాగ, భువనానికి మణికుట్టిమంపలె, ప్రళయకాలపు అశేషజల పూరంవలెను కనిపించింది సముద్రం.

'గఅణస్సవ పడిబింబం
ధరణీ అ వ ణిగ్గమం దిసాణవ ణిలఅమ్,
భువనస్సవ మణితలిమమ్
పలఅస్సవ సావసేస జలవిచ్ఛడ్డమ్' (2—2)

(గగనస్యేవ ప్రతిబింబం
ధరణ్యాః ఇవ నిర్గమం దిశానామివ నిలయమ్
భువనస్యేవ మణి కుట్టిమమ్
ప్రలయస్యేవ సావశేష జలవిస్తారమ్.)

ఇలాటి సముద్రంచూచి వానరులు భయపడ్డారు. దేహం వణకసాగింది. వెనక్కు తగ్గారు. సహజ చాపల్యమూ పోయింది. మరల సిగ్గుతో కుంచించుకుపోయారు. రెప్పపాటు కూడలేక కళ్లు పెద్దవిచేసి బొమ్మలవలె చిత్రఫలకంలోని బొమ్మలవలె ఉండిపోయారు. చిత్రాలలోని దీపాలలాగ తెల్లబడిపోయారు.

'సాఅరదంసణ హిత్థా
అక్ఖిత్తోసరిఅ వేవమాణ సరీరా,
సహసా విహి అవ్వ ఠిఆ
ణిప్పంద ణిరాఅలోఅణా కఇణివహా.'
(2-42)

(సాగర దర్శన త్రస్తాః
ఆక్షిప్తాప సృత వేపమాన శరీరాః,
సహసా లిఖితా ఇవ స్థితాః
నిష్పంద నిరాయత లోచనాః కపి నివహాః)

ఇంత విశాలమయిన సముద్రం ఎలా దాటాడబ్బా అని వానరులందరికీ హనుమంతునిపై, అతని పరాక్రమంపై గౌరవం ఇనుమడించింది.

సుగ్రీవుడు వారి దుస్థితిని చూచాడు. రాజుగా, రామమిత్రుడుగా, యోద్ధగా, సేనానాయకుడుగా వారికి ప్రోత్సాహం కలిగించవలసిన తన ధర్మం గ్రహించాడు. రామునికి పని కల్పించవద్దన్నాడు. పిరికితనం మానుకొని ధీరులుకండని చెప్పాడు. అయినా, వారు కదలలేదు, మెదలలేదు. సుగ్రీవుడు మరొకసారి ఉసిగొల్పాడు. సముద్రాన్ని ఊదిపారేస్తాను అన్నాడు. ఇంకనులాగి తెస్తాను అన్నాడు. వింధ్యను తెగగొట్టి అడ్డంగావేసి లంకకు నడిచివెళ్లతా నన్నాడు.

'తరిఉం ణ హు ణవర ఇమం
వేలావణ వఉల కుసుమ వాసి అసురహిమ్,
హత్థఉడేహి సమత్థా
తుమ్హే పాఉం పి ఫలరసం వ్వ సముద్దమ్.'
(3—8)

(తరితం నఖలు కేవల మిమం
వేలా వన వకుల కుసుమ వాసిత సురభిమ్,
హస్తపుటైః సమర్థాః
యూయమ్ పాతుమపి ఫలరసమిన సముద్రమ్)

వకుల కుసుమ సుగంధ వాసితమైన తీరం ఉన్న ఈ సముద్రం దాటడం మీకు లెక్కా? దోసిలోని పండ్లరసం పీల్చివేసినట్లు పీల్చివేయగల సమర్థులు మీరు—అని వారిని ప్రోత్సహించాడు.

'జం సాహసం ణ కీరఇ
తం దఅమాణేణ జీవిఅం కిర దఇఅమ్,
జో అప్పడిముక్క సుకఓ
సో విగణిజ్జ ఇ జఅమ్మి జీఅంతముఓ'
(3—13)

(య త్సాహసం న క్రియతే
త ద్దయమానేన జీవితం కిం దయితవ్యం,
యో ప్రతిముక్త సుకృతః
సోపి గణ్యతే జగతి జీవన్మృతః)

సాహసం చేయకుండా దయనీయంగా జీవితం గడిపితే ఏమి ప్రయోజనం? అంతేకాక రాముడు మనకు ఉపకారం చేసినాడు. ఆ ఋణం తీర్చుకోకపోతే మనం బ్రతికీ చచ్చినట్టే—అంటాడు.

సుగ్రీవుడు కపివీరులను ప్రోత్సహించిన మూడవ ఆశ్వాసమంతా చూడగా, రాజకవి తప్ప మరొకడు ఈ వీరకవిత చెప్పలేడు అనిపిస్తుంది.

పదవ ఆశ్వాసంలో లంకాపురంలో రాత్రి అంతఃపుర వర్ణనం రాజాంతఃపురవాసాను భవభావితాంతఃకరణుడు తప్ప మరొకరు వర్ణించగలడా అనిపిస్తుంది. ఇది వాల్మీకి వర్ణనలకు చాలవరకు భిన్నంగా వుంటుంది. రాక్షస రమణులు శయ్యలపై పడి పొర్లుతున్నారు; అలసిసొలసి ఉన్నారు; పరవశంగా పడిఉన్నారు; నిట్టూరుస్తున్నారు. ఇది మదన పారవశ్యమా, మధుమథనుని అపరావతారమైన రామునివల్ల కలిగిన భయమా?— అని ఉత్ప్రేక్షిస్తాడు కవి.

'వేవఇ ససఇ కిలిమ్మఇ
సఉణే ఆముఅఇ ణీసహో అంగాఇ,
ణ విణజ్జఇ కిం భీఓ
ఓ మఅణజరజ్జసో విలాసిణిసత్థో.'
(10–59)

(వేపతే శ్వసితి క్లామ్యతి
శయనే ఆముంచతి నిస్సహోంగాని
నవిజ్ఞాయతే కిమ్ భీతః
ఉత మదనపరవశో విలాసినీ సార్థః)

ప్రవరసేనుని అపూర్వసృష్టి సేతుబంధం. దీనిని నలుడు నిర్మించిన తీరు, కపివరులు తెస్తున్న కొండలను అందుకోడం, అమర్చడం, పక్కనుంచి అందిస్తున్న కొండలను నడుముతిప్పి అందుకోడం, కపివరులు ఎడమ భుజంపై కొండను మోసుకొని, దాని శిఖరాన్ని కుడిచేతో పట్టుకొనడం, ఎడమచేతిని నడుమువిూద పెట్టుకొని వంచి కొండకు ఆసరా చేసుకోడం, కొండను ఇద్దరు చేతులు కలిసి పట్టుకొని మోసుకొని రావడం, సందునుచూచి గుండ్లను విసరడం, అడుగునుంచి నీరు ఉబికిరాకుండా పెద్ద గుండును, బండను విసరడం, అలలు కట్టే సందులు విడిచిన కట్టడాన్ని చిన్న కంకరతో మూయడం, కట్టిన సేతువును బరువు మోస్తుందోలేదో అని చూచి, ముందుకు పోవడం, సముద్రం అడుగుదాకా పునాది (స్థాణం) వేయడం, ఎగుడు దిగుడు లేకుండ ఊపి సర్దడం, మొదలయిన విధానాన్ని సూక్ష్మాతి సూక్ష్మంగా, విపులంగా వర్ణించాడు. దీనిని సేతువును సంబంధమనీ అన్నాడు; నలుడు కట్టినాడు కనుక. దీనికి ఈ కావ్యాన్ని సేతుబంధం అనకుండా, నలపథం అని వుంటే సరి బాగుండేదేమో! ప్రవరసేనుడు ఇలాటి వంతెనలు, కట్టడాలు కట్టించి, కట్టడం బాగా పరిశీలించి ఉంటాడు.

ప్రవరసేనుని మరొక అపూర్వసృష్టి రావణ కల్పిత కృత్రిమ రామశిరస్సును చూచిన సీత విలాపం. ఈ కరుణమే భవభూతికి మాతృక అయిందని అనిపిస్తుంది. మనసాహిత్యంలో గాంధారీ విలాపం, కౌసల్యా విలాపం, అజవిలాపం, రతి విలాపం, సుహాస్వాహా విలాపంవంటి విలాపాలు ఎన్నో ఉన్నాయి. కాని అవన్నీ ప్రవరసేనుని సీతా విలాపంలో వెలితిపడిపోతున్నాయి. ఇదొక కరుణ రసరమణీయ కావ్యఖండిక.

అశోకవనంలో రెండు చెంపలకూ చేతులుచేర్చి నిట్టూరుస్తూ, నేలపై దృష్టినిలిపి కూర్చున్న సీతమ్మముందు రాక్షసులు భయపెడుతూ అప్పుడే నరకగా పచ్చిమాంసమూ, రక్తమూ మరిసిన తలను, రాముని తలను పోలినదానిని, ధనుస్సు పట్టుకొన్న తెగిన ఎడమచేతిని పడవేస్తారు. అకస్మాత్తుగా పడిన వాటిని చూచి ఆమె తెలివితప్పి ఎడమవైపునకు ఒరిగింది. అప్పుడు ఆమె కుడిపార్శ్వం చక్కగా కనిపించింది. కళ్లు నీటితో నిండిపోయాయి. కనుక రామునితలను బాహువును చూడలేకపోయింది. ఎదురుతున్న పెదవులవల్ల మాత్రమే నిట్టూర్పులు తెలుస్తున్నవి. కన్నీళ్లతోనే కళ్లు విప్పిచూచింది. ఏమీ తోచలేదు. భూమివిూద వాలిపోయింది. చేతులు చాచి, వేణీబంధం చెదరి, దుమ్ములేగింది; పయోధరాలు భూమికి అంటుకొని పోయాయి, లోపలికి పుర్రలలాగ అయాయి.

"ణవరి అ పసారిఅంగీ
రఅ భరి ఉప్పుహ పఇణ్ణవేణీబంధా,

పడి ఆ ఉరః ాణి అ
మహిఅల చక్కలఇఅత్థ శీ జనఅసు అ."
(11–67)

(అనంతరంచ ప్రసారితాంగీ
రఙోభృతోత్పథ ప్రకీర్ణ వేణీబంధా,
పరితోరస్పదానిత
మహీతలచ క్రీకృతస్తనీ జనకసుతా)

నాథా, ఏమిటో మాంసంముద్ద దగ్గరికి తెస్తున్నారని ప్రలపించినాను. కళ్లుతెరిచి చూచినాను. నీ ముఖం స్పష్టంగా కనిపించింది. సిగ్గులేకుండా ఏడ్చినాను. నాకిక కన్నీళ్లు మిగలలేదు. ఆశాబంధం కూడా నా హృదయానికి లేదు. మరి ఇంకా ఈ ప్రాణాలున్నాయే? ఎందువల్లనో నాకు తెలియడం లేదే!—అంటుంది సీత.

'వాహం ణ ధరేఇ ముహం
ఆసాబంధో వి మే ణ రుంభఇ హిఅఅమ్,
ణవరం చింతిజ్జంతే
ణ విణజ్జఇ కేణ జీవిఅం సంరుద్ధమ్?'
(11—81)

(బాష్పం నధారయతి ముఖం
ఆశాబంధోపి మే న రుణద్ధి హృదయమ్,
అనంతరంచ చింత్యమానే
న విజ్ఞాయతే కేన జీవితం సంరుద్ధమ్.)

ఈ విధంగా విలపిస్తున్న సీతను త్రిజట 'ఇదంతా మాయ' అని ఓదారుస్తుంది. సీతా విలాపం చదువుతుంటే, కుమారసంభవంలోని రతీవిలాపం చప్పున జ్ఞాపకం వస్తుంది.

'అథ సా పునరేవ విహ్వలా
వసుధా లింగన ధూసరస్తనీ,
విలలాప వికీర్ణ మూర్ధజా
సమదుఃఖా మివ కుర్వతీ స్థలీమ్.'

అనే చిత్రం కాళిదాస ప్రవరసేనుల భావుకతా సామ్యం తెలుపుతుంది.

యుద్ధవర్ణనలోను ప్రవరసేనుడు తన రాజరికాన్ని విశిష్టంగా తెలుపుకొన్నాడు. వివిధ సంగ్రామాలను, రామ రావణుల ద్వంద్వయుద్ధాన్ని యుద్ధతంత్ర కౌశలంతో వర్ణించాడు. రాజకవులకు, రాజరంజక కవులకు కల భేదం ఇలాటి పట్టులలోనే స్పష్టమవుతుంది.

రావణుడు కూలిపోతాడు. రఘుపతి అగ్నిఘనీత అయిన సీతను నిప్పులోకాగిన బంగారు కడ్డీని గ్రహించినట్టు గ్రహించి భరతుని అనురాగం సఫలం చేయడానికి అయోధ్యాపురి చేరుతాడు.

'ఘేత్తూణ జణ అతణ అం
కంచన లట్ఠింవ హుఅవహమ్మి విసుద్ధమ్,
పత్తో పురిం రఘువఈ
కాఉం భరతస్స సప్ఫలం అణురాఅమ్.'
(15—93)

(గృహీత్వా జనకతనయాం
కాంచనయష్టి మివ హుతవహే విశుద్ధామ్,
ప్రాప్తః పురీం రఘుపతిః
కర్తుం భరతస్య సఫల మనురాగమ్)

ప్రవరసేనుని యుద్ధనీతి, సేతుబంధ ప్రక్రియ, సేనావ్యూహ చమత్కృతి అనుభవసిద్ధాలని కావ్య పరిశీలనతో స్పష్టమవుతుంది. బౌద్ధ జైన సంప్రదాయాలలో రామాయణగాథ వివిధవిధాలుగా ప్రచలితమై ప్రజలను పెడదారి పట్టిస్తున్నదన్న ఆవేదన కలిగింది కాబోలు ప్రవరసేనునికి, విష్ణుభక్త శిఖామణికి. కనుకనే, వాల్మీకిని అనుసరించి ధర్మస్థాపనకోసమై సేతుబంధకావ్యం ప్రాకృతంలో, ప్రజల భాషఅయిన ప్రాకృతంలో, రచించాడని నా విశ్వాసం. సర్గ, అధ్యాయాది విభాగం సంస్కృత సాహిత్యంలో ప్రచురంగా ఆశ్వాసమనే విభాగం కన్నడ తెలుగు కావ్యాలలో గ్రహించడానికి కారణం ఈ సేతుబంధంలో ఆశ్వాస పరిగణనమేనని నాఊహ.

ప్రస్తావాంతరంలో అన్నట్టు బంధచ్ఛాయతో అభినవార్థగతి సంభావితమైన ఈ ప్రాకృత కావ్యాన్ని మూలంతోచదివి ఆనందించడం తెలుగువారికి చాల అవసరం.

# కలగూరగంప

## అలెగ్జాండర్ పోప్—వేమన

జూలై 1974 'భారతి' సంచికలో 'వేమన్న రభస' అను శీర్షిక క్రింద తెలుగు వేమనను, ఇంగ్లీషు కవి అలెగ్జాండర్ పోప్‌తో పోల్చుచు శ్రీ గంటి శ్రీరామమూర్తిగారు సరభసముతో ఇట్లు వ్రాసిరి :

'అలెగ్జాండర్ పోప్, మన వేమన్నలాగే ఘాటైన అధిక్షేపణలతో నైతిక విలువలను బలపరుస్తూ సూటైన ఉపదేశాత్మకమైన కవిత్వాన్ని రాసి రాణించాడు. అతని కవిత్వం అందరి నోట తాండవించింది. షేక్స్‌పియరు, మిల్టనువంటి మహాకవులకు కూడ అలాంటి ప్రజాదరణ లభించలేదు. అయినా అతన్ని కవిగా గుర్తించనివాళ్లెందరో ఉన్నారు. డా. శామ్యూల్ జాన్సన్ వంటి విమర్శక మూర్ధన్యుడు 'పోపు' లేకపోతే కవిత్వమే లేదని గర్జించాడు. అయినా పోపును ఈనాడు కూడా మహాకవిగా గుర్తించడం సులభసాధ్యం కావడంలేదు. కేవలం సాహిత్య దృష్టితో చూస్తే, మన సాహిత్యంలో వేమన్నకు గల స్థానం ఆంగ్ల సాహిత్యంలో 'పోపు'కు గల స్థానం వంటిదే.'

పైని వ్రాతలవలన మహాకవి పోపుకు జరిగిన అన్యాయమును పరిహరించుటయే ఈ చిరువ్యాసము ఉద్దేశం.

పోప్‌కు, వేమన్నకు సామ్యము లేదు—ఒక్క విషయంలోతప్ప—దానిని చివర విశదీకరింతును.

పోపు మహాపండితుడు. వేమన్నకాదు. వేమన వేదాంతి కావచ్చును. పోపు గ్రీకు భాషలోని హోమరు కృత 'ఇలియడ్'ను ఆంగ్లీకరించెను. 'ఇలియడ్' మన మహాభారతమువంటిది. పోపు అనువాదముయొక్క సృజనాత్మత, నూతనత చాలా గొప్పవి. మార్క్సిస్టు దృక్పథములో కవిత్వమును నిశితముగాఅవలోడించిన శాస్త్ర మేధావి కాడ్వెల్ (Christopher Caudwell) Illusion and Reality (1937) అను వివేచన విప్లవాత్మక ఆలంకారిక గ్రంథములో

'Where translations are good poetry like Fitz Gerald's Rubaiya or Pope's Iliad, they are virtually recreations'

అని పోప్ అనువాదమును 'పునస్సృష్టి' యనియు, మంచి కవిత్వమనియు వర్ణించినాడు. మన తెలుగులో మహాకవులందరును (నన్నయ, తిక్కన, ఎర్రన, సోమన, భాస్కరుడు, శ్రీనాథుడు, పోతన) అనువాద కవులే. వీరిదీ 'పునస్సృష్టి' (దీనిని నేడు Transcreation అందురు) కావచ్చును. వీరి యనువాద కవిత్వమును కొలుచుట కుపయోగించు కొలతబద్దతోడనే పోపు కవిత్వమును కొలచుట సహృదయతకు గీటురాయి. ఇక పోపు స్వతంత్ర రచనలను పరీక్షింతము. వీనిని గురించి శ్రీ రామమూర్తిగారిట్లు అభిననించిరి : 'ఘాటైన అధిక్షేపణలు', 'నైతిక విలువలను బలపరచునవి,' 'సూటైన ఉపదేశాత్మకమైన కవిత్వము', 'అందరినోట తాండవించింది', 'ప్రజాదరణ లభించింది' ఇత్యాది. భరతుడు నాట్యశాస్త్రమందును, మమ్మటాదులు తమ ఆలంకారిక దర్శనములందు చెప్పిన కావ్యలక్షణ ప్రయోజనము లివియే. ఇట్టి లక్షణములు కల పోపుకవిత్వము కవిత్వము కాదనుట స్వవచోవిఘాతమే యగును. 'లోకుల చనులె యాకులుగా గల్గినట్టివకైపో కవితల్' అని సంకుసాల నరసింహకవి ఏనాడో కుండబద్దలు కొట్టినట్లు చెప్పెను. షేక్స్‌పియరు మిల్టనులకంటె యెక్కువ ప్రజాదరణ పోపు కవిత్వమునకు లభించినదన, అందేదో సత్తా ఉన్నదని స్పష్టము. శ్రీరామమూర్తిగా రన్నట్లు సామ్యూల్ జాన్సను విమర్శక మూర్ధన్యుడే. అట్టి జాన్సనుకూడ పోపుకవిత్వమును మెచ్చుకొనెనని శ్రీరామమూర్తిగారే అంగీకరించిరి. అందరినోట తాండవించి, ప్రజాదరణ సంతరించుకొని, రెండు వేర్వేరుశతాబ్దముల లోని రెండు విభిన్న దృక్పథములు, తత్వములు కలిగిన ఇద్దరు మనీషుల (డా. జాన్సను 18 వ శతాబ్దము వాడు, సంప్రదాయవాది; కాడ్వెల్ 20 వ శతాబ్దము వాడు, విప్లవవాది) ప్రశంస లందుకొనిన పోపు కవిత్వము గొప్పది కాకుండిన, మరేమియును గాదు. ఎంతమంది మెచ్చిన, శ్రీరామమూర్తిగారు పోపును 'ప్యాసు' చేయ దురు? విపులమైన పృథ్విలో, నిరవధికమైన కాలములో తన రచనను మెచ్చువాడొకడున్నను చాలునని భవభూతి మహాకవి తృప్తిపడెను.

'ఈనాడు కూడ పోపును మహాకవిగా గుర్తించడం సులభసాధ్యం కావడంలేదని' శ్రీరామమూర్తిగారు. ఈ గుర్తించు అధికారము కల న్యాయమూర్తులెవరు? షేక్స్పియరు మిల్టనులను గూడ కవులుగా గుర్తింపనివారు నాడును నేడును ఉన్నారు. ఇంక మీదను ఉందురు. షేక్స్పియరు మిల్టనులు మహాకవు లగుటకు పోపు అధమకవి కానవసరములేదు. తిక్కన మహాకవి యగుటకు పోతన మహాకవి కాకుండ వలెనా? ఇది విచిత్ర తర్కము. ఎవరి మహాకవిత్వము వారిది.

వేమన, కన్నడములోని సర్వజ్ఞుడు, హిందీలోని కబీరు (వీరందరు దాదాపు సమకాలికులు)ల వంటివాడు వీరికి తాము కవిత్వమును దానిని చెప్పుచున్నామని తెలియదు. మనము వారిది కవిత్వమని అనుచున్నాము. అలెగ్జాండర్ పోప్ సంగతివేఱు. ఇంగ్లీషు కవిత్వ చరిత్రలో నొక స్వర్ణయుగమునకు చెందిన కవి రత్నము పోపు. ఈ యుగమునకే Augustan Age of English Poetry అని పేరు. ఇందుపోపు, అడిసన్, స్టీలు, స్విఫ్టు, డిఫో, కాంగ్రీవ్ మున్నగు కవి దిగ్గజాలుండిరి. కవిత్వములోని ఒక గొప్పయుగమునకు జెందిన పోపు గొప్పకవి.

శ్రీరామమూర్తిగారి 'చర్చలద్వారా, సద్విమర్శ ద్వారా, సూక్ష్మ పరిశోధనలద్వారా సరైన అవగాహన కలిగి క్రమేణ కవి ప్రతిభకు ఉచితమైన స్థానం లభిస్తుంది' అను సిద్ధాంతము పైకి బాగా కన్పడినను ప్రమాదభూయిష్ఠమని, ఆలోచించిన తెలియగలదు. దీని ప్రకారము మొట్టమొదట తెగబడి 'క్రమేణ' రాను రాను పొగడుబడు కవులే మహాకవులని అర్థము సిద్ధించును. ఇట్లెందుకు కావలెను? రాను రాను రుచులు చెడిపోవును విలువలు పడిపోవును. అట్టితఱి మహాకవి స్థానము పడిపోవు నవకాశములే హెచ్చు. కవుల స్థానములు నిర్ణయించుటకు కేవలము మన అభిప్రాయములే ప్రాతిపదికలు కారాదు. దేశకాల పాత్రములను పరిగణనలోనికి తీసికొనవలెను, Uncle Tom's Cabin ఆ నాడు మహారచన. నేడు దానిని చదువనివారే హెచ్చు. ఆర్థిక శాస్త్రమందువలె, సాహిత్యమునను ఒక విధమైన Gresham's law ('చెడ్డ ద్రవ్యము మంచి ద్రవ్యమును తఱిమివేయును') పని చేయు చున్నది.

మనకు ఒక మహాకవి యెప్పుడును మహాకవియే. పాశ్చాత్యులలో అట్లుకాదు. మీసములయొక్కయు, వేసములయొక్కయు ఫేషనులు మారుచు కాలచక్ర గమనముతో, పునరావృత్తమగునట్లు, పాశ్చాత్యుల కవితాభిరుచులు మారుచుండును. విక్టోరియన్ కవులపై నేడు విపరీతమోజు పుట్టుకొని వచ్చు చున్నది. శ్రీరామమూర్తిగారే తరువాతి పేరాలో నుదాహరించిన 'జాన్‌డున్' సంగతి చూతము. ఇతని కాలములో (16–17 శతాబ్ది) ఇతడు మహాకవిగానే పండితులచే గుర్తింపబడినాడు. ఒక సమకాలిక పండితు డితనిని 'కవిపట్టపురాజు' అనెను. బెన్ జాన్సను, 'కొన్ని కవితాప్రక్రియలలో డున్ ప్రథముడు' అనెను. అధ్యాత్మమార్మిక కవిత్వముమీద ప్రజాదరణ పోయినతర్వాత డున్ కవిత్వము మఱుగునపడిపోయి యుండెను. మఱల ప్రథమ ప్రపంచయుద్ధానంతర అధ్యాత్మికతా శూన్యతను నింపి పాశ్చాత్యుల నుద్ధరించుటకు ఇలియట్ డున్ కవిత్వమును 'ఉద్ధరించెను.' ఇట్టి 'రివైవలిస్టు' ఉద్యమములు తెలుగునను కలవు.

రామరాజభూషణుని, పింగళి సూరనను వారి సమకాలికులు మహాకవులుగా గుర్తింపలేదు. ఈనాడు వీరి కవిత్వ మాకాశమున కెత్తబడుచున్నది. ఆనాడు మహాకవులని ప్రశస్తి జెందిన మారన, పినవీరనలు నేడు మఱువబడినారు.

పోప్ వేమనలకు సమానధర్మమువారి వచస్సులలోని 'సమాసశక్తి'. దీనిని 'ఎపిగ్రం' (Epigram) అందురు. దాని గాత్రము పొట్టి, యాత్మయును 'విట్టి'. వీరి కవిత్వములు సామెతలవలె, లోకోక్తులవలె, క్లుప్తముగా అర్థబాహుళ్యము, హాస్యసౌరళ్యము కల్గి స్పందించు చుండును. ఈ లక్షణములు ఉత్తమ కవితా లక్షణములైతే, పోపు, వేమనలు మహాకవులే—స్వయంనియమిత సాహిత్య ప్రాడ్వివాకులే నిర్ణయ మిచ్చినను సరే. ఉదా: వేమన——

'తలలు బోడులైన తలపులు బోడులా'
'పురుషులందు పుణ్యపురుషులు వేఱయా'
'నీతిహీను నొద్ద నిర్భాగ్యు లుందురు'
'భక్తి కలుగు కూడు పట్టెడైనను చాలు'

Pope—

'Man never is, but always to be blest'
For fools rush in where angels fear to tread'
'An honest man is alw ys a child'
'A little learning is a dangerous thing'

ఈ దృష్టితో పోపును వేమనతో సమీకరణించిన ఎడల నా కభ్యంతరము లేదుకాని, వేమనను న్యూనతపరచు 'రభస'లో పోపు మహాకవిని కించపరప ప్రయత్నించిన శ్రీ గంటి శ్రీరామమూర్తిగారి విమర్శనాభాసము సహృదయ హృదయ బాధాకరమని నా అభిప్రాయము.

శ్రీ సర్దేశాయి తిరుమలరావు.

# ఉత్తర హరివంశము— పాఠపరిష్కారము

'ఉత్తర హరివంశము — పాఠపరిష్కారము' అను శీర్షికతో 1974 సం. జూన్ భారతిలో శ్రీ టి. పి. భాష్యకారాచార్యులు వ్యాసమొకటి ప్రచురించినారు. శీర్షికనుచూచి ఈ ఆచార్యులవారెవరో, ఉత్తర హరివంశము నాపోశనమెత్తిన మహానుభావులైయుండ నోపుదురని శ్రద్ధతో చదువుటకు ప్రారంభించిన నాకా శ్రద్ధ యెంతకాలమో నిలువలేదు. వ్యాసప్రారంభమే కాక మొదటిపుటలో అధికభాగము నా మాటలను నేనే చదువుకొనవలసి వచ్చినది. మంగళాదియనియో, కాక నా శైలినిమెచ్చియో, కాదనలేక, వారట్లుద్ధరించుకొనియుందురని సమాధానపడినను, విమర్శించిన తీరు మాత్రము, విజ్ఞులు మెచ్చునది కాదు.

1970 వ సంవత్సరమున ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన ఉత్తర హరివంశమునకు సంపాదకురాలిగా పాఠకలోకమునకు సమాధాన మొసగవలసిన బాధ్యత నాయందున్నట్లు భావించుచున్నాను. కాని యీ బాధ్యతను సయితము వారు నాయందు పూర్తిగా నుంచినట్లు కానరాదు. ఈ గ్రంథము ప్రచురింపబడిన నాలుగు సంవత్సరముల తరువాత, అందలి పాఠభేదములను, గ్రహింపవలసిన ప్రధాన పాఠములను చూపుటకు ప్రారంభించిన వీరా విషయము విస్మరించి 'అంజెదవుగాకనను' (ఉ. హ. 1—75) పద్యమును బురస్కరించుకొని 'ఈ పద్యము ఉత్తర హరివంశమా లేదా? హరి విలాసము లోనిదా? ఒక గ్రంథమునకు రెండు పేర్లును గలవా? శ్రీమతి యశోదారెడ్డిగారుగాని, శ్రీమాన్ ఆచార్యుల వారుగాని తేల్చి తెలుపర్హైరి.' అని నాతో సహ మఱొక్క శ్రీమాన్ ఆచార్యుల వారినిగూడ ప్రశ్నించినారు. ఈ ప్రశ్నతో వీరింతవఱకు విమర్శించిన ఉత్తర హరివంశము నా పీఠికతో, నా సంపాదకీయముతో వెలువడినది కాదా? అది, మఱి వేఱు గ్రంథమై యుండునా? అను సందేహము కలిగినది. అట్టిదేమేని యున్నచో అది గ్రంథమా? వ్యాసమా? ఈ మీ శ్రీమాన్ ఆచార్యుల వారెవరు? 'ముఖే ముఖే సరస్వతి' ఏ పుట్టలో ఏ పామున్నదో? దేశపు నలుమూలలున్న పండితులు పామరులు సహకరించినగాని తెలియరాని రహస్య విశేషముల కెన్నింటికో గాదెవంటిదీ ఉత్తర హరివంశము. ఆ గ్రంథ విశేషముల నెఱుగుటయే నా జీవిత లక్ష్యముగానున్న నాకు మీ శ్రీమాన్ ఆచార్యుల వారి పూర్తి పేరు నొసగి వారి రచనల చదువుట కవకాశము కల్పింప ప్రార్థితులు.

శ్రీ టి. పి. భాష్యకారాచార్యుల వారొక 'శీర్షికను' మొదలుపెట్టి దాని గూర్చి వ్రాయుచు నందే ఆనౌత్యమున కోర్చి, అప్రస్తుత మనక దానితో సంబంధము లేని, మఱొక విషయమును దడిపినారు. 'లక్షణ సార సంగ్రహము'నకు ప్రకాశకులు వ్రాయించిన చక్కని సమీక్షయొక్క బాగోగులతో నిటగల ప్రసక్తి యేమి? రత్నము లెచ్చటనున్నను ప్రాజ్ఞులు గ్రహింతురని తెలియదా? కాని, ఆ లక్షణసార సంగ్రహమునకు ప్రకాశకులు వ్రాయించిన చక్కని సమీక్షను చదువుట వలన తలయెత్తిన సందేహనివృత్తికొఱకై ఆ సమీక్షతో ఏ సంబంధములేని నన్ను, పేరు చెప్పకయే శ్రీమాన్ ఆచార్యులవారి నొక్కరిని ప్రశ్నించినారు. ఆ శ్రీమాన్ ఆచార్యులవా రేమందురో? కాని, నేను మాత్రము, జిజ్ఞాసువులు, విద్వాంసులు, విమర్శకులైనవారు ఆ సందేహ నివృత్తికొఱకా సమీక్షకులనే ప్రశ్నించు టుచితమందును. కాదేని ఏకకవికృతములైన రెండు వేర్వేఱు గ్రంథములలో నొకే పద్యము కొంత మార్పుతో గానవచ్చుటలోనున్న దోష మేది? విశేష మేమి? ఉత్తర హరివంశములోనున్న 'అంజెదవుగాక' అను పద్యము కొంత మార్పుతో లక్షణసార సంగ్రహమున నున్నట్లు మఱియు దానిని హరివిలాసములోనిదిగా

సమీక్షకులు స్వీకరించిన ..., మీరే వ్రాసితిరికదా! ఇక సందేహ మెచ్చటనో? దేనిని నిర్ణయింపవల యునో? నాకు తెలియరాదు.

ఇవి ఏవియుకాక, నాయందధిక ప్రత్యయముంచి నిజమునకు హరివిలాసమను గ్రంథ మున్నదా? ఉండిన నది సోమనాథుని కృతముగునా? అయిన నది హరివిలా సమా? కాక హరవిలాసమా అను విషయముల నెఱుగ దలచి ప్రశ్నించినట్లు కానవచ్చుచున్నది. అందుకు సంతోషమే! కాని ఇప్పటి మీా వ్యాస ప్రధానోద్దేశ్యమది కాదు. విస్తృత విషయములన్నింటికీ ఒక్కవ్యాసము లోకి సమాధానములనిచ్చి, సంశయముల దీర్చుటకు వలనుపడునా? కొంతకాలము ఓపిక పట్టవలయునని మనవి. కాదేని, 'తెలుఁగులో హరివంశములను' నా గ్రంథము జూడ ప్రార్థితులు. ( ప్రాప్తిస్థానము. 3-4-574, నారాయణగూడ, హైదరాబాదు 29, (ఆం. ప్ర) సుధర్మా పబ్లికేషన్స్)

ఇక, ప్రస్తుతాంశములకు నా సమాధానములు. అయ్యా! ఆచార్యులవారు అన్ని పాపులర్ ఎడిషన్‌ల వలెనే 'ఉత్తర హరివంశముకూడ, పాపులర్ ఎడిషన్ అన్న విషయము, మీారు మఱచినట్లున్నారు. దీని కొఱకై అకాడమీవారు అంగబలాన్నికాని, అర్థబలాన్ని కాని ప్రత్యేకముగా నుపయోగించలేదు. అవసరము కూడ లేదేమొ? అది క్రిటికల్ ఎడిషన్ సందర్భములో చేయవలసిన పని. యావదాంధ్ర దేశములోని ముద్రితా ముద్రిత ప్రతులను పరిశీలించి, కొన్ని సంవత్సరములలో సిద్ధము చేయవలసిన ప్రతి, ముద్రితమైనప్పుడు, ప్రశ్నించిన బాగుండెడిది. అట్లుగాక, విషయ గౌర వము, సంశోధిత ప్రతిని సిద్ధము చేయుటలోగల సాధక బాధకము లెఱిగిన పెద్దలు, పాపులర్ ఎడిషన్ సందర్భములో, అట్లుప్రశ్నించుట, తమకొక అరయమి నంట గట్టుకొనుట కాదా? విద్వాంసు లెందఱినో ఉవ్విళూరింపజేయుచు, చిక్కుల బెట్టుచుండిన, కార్య విశేషమునంతటిని, కేవలము, మూడు, నాలుగు నెలలో నా వలన ఆశించిన అవ్యాజ గౌరవమునకు కృతజ్ఞతలు.

1970 వ సంవత్సరములో ప్రకటితమైన 'ఉత్తర హరివంశము' పాపులర్ ఎడిషన్ చదివి నాలుగు సంవత్సరముల తరువాత చూపిన సవరణలలో— మొదటిది.

'బలియు నాగాయుత బాహు జగత్ప్రాణ
ప్రాణు
తనయు గదాకేలి దర్పమడఁచె'— ఉ.హ.1—8.

ఈ పై రెండు పాదములలో మొదటి పాదమున 'బాహు'నకు మారుగా అధోజ్ఞాపికయందున్న 'ప్రాణ' అను పాఠమునే ప్రధానముగా గ్రహించి యుండ వలసినదని వారి నిర్ణయము. ఈ నిర్ణయమును సమ ర్థించుచు శ్రీ టి. పి. భాష్యకారాచార్యులు—

'నాగాయుత బలప్రాణో
భీమో భీమ పరాక్రమః'—హరి. వి. ప. 62.7

అను మూలశ్లోకము నుద్ధరించి 'ఎఱ్ఱనయు మూలాను సారముగా—

'పదివేలేనుఁగు లంతలావున
భువిం బ్రఖ్యాతుఁ డైనట్టి'—
హరి. ఉ. భా. 4.8

అనియే యీా పట్టు ననువదించినారు' అని మహాను భావుడైన మఱొక్క మహాకవిని బయటకు గొని వచ్చినారు. వారీ సందర్భమునం దనవసరముగా ప్రబంధ పరమేశ్వరుని గొనివచ్చినను, ఉద్ధరించిన పద్యపాదములుమాత్రము వీరిని సమర్థించుచు వారి కొక బాసటయై నిలుచుటకుమారుగ నా మహాకవి యనువాద మిప్పట్టున మూలానుసారి కాదని చెప్పట కుదాహరణపూర్వక నిదర్శనములై, నా కుపకరించినవి. ముంజేతి కంకణమున కద్దమేల? మూలశ్లోకము, ఎఱ్ఱన పద్యములెదుట నున్నవి. నిజ్ఞాలే ప్రమాణము. శ్రీ ఆచార్యులవారొసగిన నిఘంటువును పురస్కరించు కొని ప్రాణః=లావు అని గహించి యనువాదము గావించినచో మూలగ్రంథమున 'ప్రాణః' ప్రక్కనే ఉన్న బలగతి ఏమికావలయు? మూలకారు డిప్పట్టున సమానార్థకములైన రెండు పదముల నిరర్థక ముగా వాడెనందురా? కాక, వా రుద్ధరించిన (నానార్థరత్నమాల) నిఘంటువును మూలగ్రంథ సందర్భమున గ్రహించి, సోముని విషయమున మాత్రము ఎఱ్ఱన పాఠ మాధారముగా, ప్రాణః = లావు అని వారొసగిన యర్థమున గ్రహింపవలెనందురా? ఇంత ఎందుకు? వారెంతయో శ్రమ కోర్చి, నిఘంటువుల నిచ్చి, మెచ్చిన 'నాగాయుతప్రాణ' అను పాఠాను సారమే ఈ పాదార్థమును పూర్వగాథతో నన్వయింప

గలరా? మొదట బలరాము డెప్పుడు? ఎవరి దర్పు? మెక్కడ యడగించెనో సరిపడిన తరువాత ఉన్న పాఠాంతరములనుండి ప్రధాన పాఠమును నిర్ణయించి గ్రహింప వచ్చును. కొన్నియెడల పాఠ నిర్ణయమునకు పనికి వచ్చునని, కేవలము నిఘంటువులేకాక మఱి వేఱు విషయము లున్నవి యని తెలిసినవారెట్లీ పాఠమును ఎట్టి అనువాద మాధారముగా నిర్ణయించిరో తెలియదు. పూర్వాపర సందర్భములు మూలమునసా ముల్లై పొసగిన తరువాతనే ఈ పాద మందలి పాఠమును 'నాగయుత బాహు అనియో, 2. నాగాయుతబాహు అనియో, కాక 3. నాగాయుత పాణి అనియో, ౪. నాగాయుతప్రాణి అనియో నిర్ణయము గావింపవచ్చును.

ఈ సీసపద్యములో ఈ ఒక్క పాఠమేనా? ప్రధాన పాఠముగ మార్పు గావింపవలసినది? తక్కిన పాదములలోనున్న పాఠములన్నియు మూలానుసారము లనియే మిన్నకుండితిరా? పూర్వమహాకవికృత గ్రంథము లందు, తగిన పరిశ్రమ లేకయే, తొందరపడి నా యిచ్చానుసారము ఏదో ఒక పాఠ నిర్ణయము గావించు సాహసము నాకు లేదు. అదియే 'దురూహ్య'మైన కారణము.

రెండవది :

'కత్తివాతులతో మారుగాచి తిరుగు
యాయలు ముఱు పాళెముల గాంచె నాఱువేల
పాశముల
వానిలోని పిశాచముల్ వచ్చి వచ్చి
పొదువ నస్నంటేఁ దునుకల ప్రోవు చేసె—
ఉ. హ. 1- 140.

ఈ పద్యములో రెండవ పాదమున పాళెములని యుండగా మూలగ్రంథముతో గొంత పరిచయము గలిగియుండుటచేత పాళెములకు మారుగ పాశములను పాఠమును ప్రధానముగ గ్రహించి, యందుకు తగిన యాధారములతో అప్పి నియమముల పాటించుచునే చూపియున్నాను. ఆ పాఠమును విమర్శకులు సయితము మెచ్చినారు. వారు మెచ్చి 'సెబాసన్న పాఠమునే ముద్రణ దోషముతో చిక్కబట్టుకొని, సంస్కర్త లిచ్చిన పాఠ మేది? యని యడుగుచున్నారు అని యేమియో తెలియకయే 'పూర్వపు ముద్రణములో (వావిళ్ల 1937) పాఠాంతరముగా చూపబడిన 'పాశముల' అనునదియే మూలానుసారియై యున్నది. అకాడమీవారు దాని నేమూలమున ముదించిరి' అని ఎట్లు వ్రాయగలిగిరో? రంధ్రాన్వేషణముకన్న సహృదయత ము విమర్శకుల కవసరము. ఇట్లంటినని నిజమైన తప్పులను ఒప్పులుగా స్వీకరించి సాహితీ జగత్తునకొక యపకారము చేయుమనికాదు. విమర్శకుల సూచనలు పరిశోధకుల కొక వెలుగుబాటయై ఉపకరింపవలయునేకాని, అచ్చు తప్పు లేవియో? నిజమైన తప్పు లేవియో తెలియని విమర్శలై యుండ వచ్చునా? అట్టి విమర్శలవలన వచ్చు ఫలితము శూన్య మని తెలియదా? లేనిచో తగు విధముగా పరిశ్రమించి, పరిశోధించి, నిర్ణయించిన పాఠమును గ్రహింప నొల్లని వారెవరు? ప్రూఫులను దిద్దుట తెలియక, రెండవ మారు సరిచూడని కారణముచే గ్రంథములలో నచ్చు తప్పు లనేకములు దొరలినవి.

మూడవది :

ఈ పై పద్యముననే మూడవ పాదమున—
'వానిలోని పిశాచముల్ వచ్చివచ్చి'

అని యున్న పిశాచముల్ అను పాఠమును పాశములుగా మార్చి వ్రాయుటనందుకు శ్రీ ఆచార్యుల వారికి నాపై కోపము. ఈ పిశాచనివృత్తికి మార్గమును చూపు మాంత్రికులు వారెవరున్నట్లు నాకు తెలియదు. తెలిసియుండిన అట్లొనర్చియుందునా? పిశాచములను వెడలించి పాశములను కంఠమునకు తగిలించుకొనుటకుముందు నాకు కొంత దూరపు చూపు అవసరముకదా? శ్రీ భాష్యకారాచార్యులవారు నన్నుపహసించుచు 'ఇక్కడ వేరెవరును పాఠాంతరమును చూపకుండుటయే పరిష్కర్త లిట్లు మారకుండుటకు కారణమై యుండవోపును' అని సెలవిచ్చినారు. పాఠాంతరమిట్లేవి లేవుకదా? అయినచో గ్రంథపరిష్కర్త పాఠనిర్ణయాదులగూర్చి, యే ఒక్కమాట పలుకుటకు అధికారముగాని అర్హతగాని లేదని మనవి చేయుటకు చింతించుచున్నాను.

సాధారణముగా తాళపత్రప్రతులందు అనేక కారణములవలన నాయా పదములు, వాక్యములు, అక్షరములు లోపించినప్పుడు గాని, క్రిమిదష్టములై యర్థములు గుర్తింపరాక యుండినప్పుడుగాని, లేఖక

ప్రమాదములవలన అర్థాతిసాధమునకు భంగము వాటిల్లుచుండినప్పుడు గాని, పాటింపవలసిన నియమములను, సదాచారములను పాటించియే, పదములను చేర్చినచోట, కుండలీకరించుటయు, మార్చినచోట పాఠముల నధోజ్ఞాపికయందు చూపుటయు, పరిష్కర్తలకు సరిపాటి. కాని అట్టి దోషములేవియులేక, అక్షరములు, పదములు, వాక్యములు, అర్థముతో గూడ స్పష్టమై, అన్వయము కుదురుచుండగా, యే పరిష్కర్తలకు గానీ ఆ పదములను మార్చి, వేఱు పదముల జేర్చి, పద్యమును పాడుచేయవలసిన అవసరమేమి వచ్చినది. నిరాధారముగ, అనవసరముగ మహాకవుల గ్రంథములలో పద్యపాదములందు పాఠభేదముల జొప్పింపగల సమర్థులైన పరిష్కర్తలున్నారని, ఉందురని, నిజముగా నాకు తెలియదు. 'వమోవిశ్వసృజే!' వ్యాపారముగా నేనా పని చేయలేను. మన్నింప ప్రార్థన.

నాచనసోముని ఉత్తర హరివంశములోని పద్యమున పిశాచపీడా నివృత్తిని చూపుచు శ్రీ ఆచార్యుల వారు—

'కత్తివాతులతో మారుగాచి తిరిగి
యాడు మురుపాశములఁ గాంచె నాఱువేల
వారిశో నవపాశముల్ వచ్చి వచ్చి
పొదువ నన్నింటిఁ దునుకల ప్రోవుచేసె'

అని, పాఠమును సృష్టించి పాదమును మార్చి పద్యము నొసగినారు. శ్రీ ఆచార్యులవారు సోముని పద్యమునకు పట్టిన పిశాచపీడను తొలగింపబోయి లేని పాశములమ గొనివచ్చి మెడకు చుట్టుకొనబోవుచున్నారు కదా? ఈ పాదమునకు అర్థాన్వయ మెట్లు పొసగునో? మూలానుసారముగానైన సమర్థింపగలరా? మూల గ్రంథములోనిదని ఎచ్చటిదో గొనివచ్చి, అర్థశ్లోకము నుద్ధరించిన మాత్రమున సరిపోలేదు. మూల గంథ భాగముల నుద్ధరించినవారు ఆ గ్రంథములో ఈ భాగములను పూర్తిగ చదివియే? ఈ మార్పును సూచించితిరా? మఱొక్కసారి చదివి, నిశ్చితాభిప్రాయముతో మూడవ పాదమున వారు సూచించిన మార్పు అవసరమనియే తలంచిన ప్రత్యుత్తర మీావలయు నాకు కాదు విద్వన్మండలికి.

నాలుగవది :

ఉత్తరహరివంశము షష్ఠాశ్వాసము 226 వ పద్యములో రెండవ పాద ప్రారంభమున 'ఘన'యని యున్నచోట నా సామాన్య దృష్టికి యతిభంగము కానవచ్చుట చేత అంతమాట ఆ సర్వజ్ఞ చక్రవర్తిని ఆడసాహసింపని నేను ఆ పాఠమును 'తన' గ దిద్ది 'దీనివల్ల పద్యమునకు యతిభంగము గలుగక యర్థముకూడ కొంతవఱకు సంతృప్తికరముగనే యతికినది. ఈ సంస్కరణము గుదురనిచో విజ్ఞులేదేని యుత్తమ పాఠమొసఁగ ప్రార్థితులు. అని సవినయముగ మనవి చేసిన నా మాటలందు ఘనముగాచెప్పి కొనిన స్ఫురణము కలిగినదా? పాఠకులే సాకిరులు. నా గ్రంథములలో అక్షరములు తప్పులుగా ముద్రింపబడినట్లే, ఉత్తరహరివంశము, పూర్వ ముద్రణములలోనున్న 'ధ్ఘ'లో ఉన్న 'ద' ముద్రణములు పొందగా, జారిపోయి 'ఘ' మిగిలియుండుటచేత నేను భ్రమ, ప్రమాదములకులోనై పృథాశ్రమపడితినని, నన్ను హెచ్చరించి నా కనువిప్పు కలిగించినారు. కాని ఆ పూర్వ ముద్రణము లేవో? ఎప్పటివో వివరముల నొసఁగలేదు. నేను పరిశీలించిన గ్రంథముల పట్టిక—

1. ఉత్తర హరివంశము—తంజావూరు తాళపత్ర ప్రతి. నెం. డి. 1+2. ఎస్. 99.

2. ఉత్తర హరివంశము—తంజావూరు తాళపత్ర ప్రతి. నెం. 2 141—ఎస్. 98.

3. ఉత్తర హరివంశము...తిరుపతి. వ్రాత ప్రతి. ఆర్. 122. ముద్రిత గ్రంథములు.

4. ఉత్తర హరివంశము - 1897. కందుకూరి వీరేశలింగముగారిచే పరిష్కృతము.

5. ఉత్తర హరివంశము—1913. వావిళ్ల వారిది.

6. ఉత్తర హరివంశము—1926—(వావిళ్ల) వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే పరిష్కృతము.

7. ఉత్తర హరివంశము—నాచిర్లు...వివరములు తెలియవు.

8. ఉత్తర హరివంశము—శ్రీ నిడుదవోలు వేంకటరావుగారిచే పరిష్కృతము.

నేను పరిశీలించిన రెండు తాళపత్ర పతులలోగాని, తిరుపతి వ్రాత ప్రతిలోగాని, మొదటి ముద్రణములోగాని, తరువాత ముద్రింపబడిన ప్రతులలో గాని 'ద్వ' అను పాఠము నాకు గనుపట్టలేదు. పూర్వ ప్రతులనుచు నిక శ్రీ భాష్యకారాచార్య శ్రేప్రతుల జూపుదురో? మీ వాదమునకు ప్రమాణముగా పూర్వ ప్రతులను జేర్కొనిన తరువాతనే పూజ్యులు శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులవారి విషయ ముమ గొనివత్తురుగాక.

సాధ్యమైనంతవఱకు వినమ్రభావముతో సత్య దృష్టితో కృషిచేయుచు తెలిసిన ఒక కొన్ని విషయ ములు పాపులర్ ఎడిషన్‌లో వ్రాసినాను. ఇప్పుడీ సమాధానము నిచ్చినాను. తప్పొప్పులకు పాఠకులే ప్రమాణము.

ఇంతకుమించి శ్రీ భాష్యకారాచార్యులవారికి నేను సమాధానము చెప్పవలసిన అంశములు లేవు. కొన్ని సందర్భములలో ప్రశ్నలకు కఠినముగనే సమాధానము చెప్పవలసి వచ్చినది. సత్యమెప్పుడును అందరికి ప్రియ మైనది కాదు. సమాధానమీదగిన కొన్ని ప్రశ్నలకైన సమాధానమిచ్చుట నా విధి అని ఈ వ్యాసము వ్రాసినాను.

—శ్రీమతి డా. పి. యశోదారెడ్డి.

క్రిందటి జూన్‌నెల సంచికలో వికాసలహరి' గ్రంథాన్ని సమీక్షిస్తూ డాక్టర్ వేంకటావధాని గారు తిరుపతిశాస్త్రిగారి కుమారులని నేను వ్రాసిన వ్రాత భ్రమప్రమాదాలకు మూలమంటూ గొర్తి కామశాస్త్రిగారు ఆగస్టు భారతి సంచికలో తెలపారు. నా వ్రాతమూలంగా చరిత్రకూ వాఙ్మయానికీ పెద్ద అపకారం జరిగినట్లు ఆయన భావించినట్లు నాకు తోస్తున్నది.

డాక్టరు వేంకటావధానిగారు తిరుపతిశాస్త్రి గారి ఔరసపుత్రులు కారని నే నిదివరకే విని ఉన్నాను. అయినా సోదరపుత్రులు పుత్రులనుకోవడం తప్పు కాదనీ, డాక్టరుగారు తిరుపతిశాస్త్రిగారిని పితృతుల్యు లగా భావిస్తున్నారనీ అభిప్రాయపడి నేను అలా వ్రాశాను. నాదీ పెద్ద పొరపాటే అయితే— వాఙ్మ యానికి అది అపకారకమయితే దాన్ని దిద్దు కుంటాను.

గొర్తి కామశాస్త్రిగారు వ్రాసిన దేమంటే డాక్టరుగారు తిరుపతిశాస్త్రిగారి అన్నగారి కుమారు లని. శ్రీ దేవులపల్లి— రామానుజరావుగారు మా తం 'వికాసలహరి' పీఠికలో 'దివాకర్ల—తిరుపతిశాస్త్రిగారికి స్వయముగా తమ్ముని కుమారులైన అవధానిగారు' అని వ్రాస్తున్నారు. ఈ వ్రాతలున్నూ భ్రమ ప్రమాదాలకు దారి తీస్తున్నాయని అనుకోవలసి ఉంటున్నది.

—శ్రీ బులుసు వేంకటరమణయ్య.



# ధ్వవిమర్శలు

## సాహిత్య సౌందర్యదర్శనము

(రచన : శ్రీ చర్ల గణపతిశాస్త్రి, ప్రతులకు: లలితాప్రెస్, 6—2—977 1. ఖైరతాబాద్, హైదరాబాద్—4. వెల, రు. 25 లు. పుటలు: డెమ్మి 768.

భారతీయ సాహిత్యలక్షణ వివేచన గ్రంథ సంచయము బహుముఖముల విస్తరించి శాస్త్రీయమైన ఒక మర్యాదను సంతరించుకొన్నది. అందువలన అది సాహిత్యశాస్త్రమును అలంకారశాస్త్రమును అని అనిపించుకొన్నది. భారతదేశమున ప్రాంతీయ భాషా సాహిత్య లక్షణ వివేచనము కూడ ఆ మార్గమునే పట్టుటచేత సంస్కృత లక్షణ గ్రంథముల అనువాదములు చాల వరకు ప్రాంతీయ భాషలలో వెలసినవి. ఆ విధముగా తెనుగుభాషయం దిప్పటికే ప్రసిద్ధములయిన అలంకారశాస్త్ర గ్రంథములన్నియు వచ్చియున్నవి. ప్రత్యేకముగా ఆయా గ్రంథముల అనువాదములు వచ్చినవే కాని అన్ని లక్షణ గ్రంథముల తాత్పర్యమును విచారించి ఆయావిషయములను ప్రధానముచేసి రచింపబడిన గ్రంథములు తెనుగులో చాల తక్కువగా వచ్చినవి. ఆచార్య కాకర్ల వేంకటరామనరసింహంగారిది మొదటిది. శ్రీ చర్ల గణపతిశాస్త్రిగారి ఈ సాహిత్య సౌందర్యదర్శనము రెండవది. సాహిత్య గ్రంథములయందును సౌందర్యమును దర్శించుటకు కావలసిన లక్షణ సామగ్రిని సమకూర్చిన ఈ గ్రంథమున కీపేరు చక్కగా అమరియున్నది.

ఈ గ్రంథమునందు మొత్తము పన్నెండు ప్రకరణా లున్నవి. కావ్యప్రకరణమున — ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసుల మతముల ననుసరించి కావ్య స్వరూప స్వభావములు నిరూపింపబడినవి. మరియు కావ్యప్రయోజన విషయమును చర్చింపబడినది. కవితారీతులన్న శీర్షిక క్రింద ఆధునిక కవితావాదములు స్పృశింపబడినవి. ఈ ప్రకరణము గ్రంథస్థ విషయమున కుపోద్ఘాత ప్రాయముగా నున్నది. రెండవ ప్రకరణము వృత్తులకు సంబంధించినది. అభిధా లక్షణావ్యంజనావృత్తుల స్వరూపస్వభావములు విశదముగా సోదాహరణముగా నిరూపింపబడినవి. తాత్పర్య శక్తిని గురించికూడ చెప్పబడినది. మూడవ ప్రకరణము ధ్వని గుణీభూతధ్వని ప్రకరణములు. ఆ యా మతభేదములతో ధ్వని స్వరూపస్వభావములను సంభావించి నిరూపించుట ప్రశంసనీయముగా నున్నది. ప్రధానములయిన సంలక్ష్యక్రమ, అసంలక్ష్యక్రమ ధ్వని స్వరూపములు ఉదాహరణములమీద వ్యాఖ్యానింపబడినవి. నాల్గవది రసప్రకరణము. భరతుని రససూత్రమునందలి 'సంయోగ' శబ్దముయొక్క అర్థమును ప్రాచీనులు భావించిన తీరుతెన్నులు సుస్పష్టముగా ఇందు చర్చింపబడియున్నవి. నవరసములను గురించియు, భావవిశేషములను గురించియు ఈ ప్రకరణమున సూక్ష్మవిచారణకలదు. నాయకప్రకరణమైదవది. నాయికానాయక భేదవిషయ విచారణమిందు సమగ్రముగాను ఉదాహరణ పూర్వకముగాను గలదు. ఆరవది నాటకప్రకరణము. దశరూపకములను గురించియు, ఉపరూపకములను గురించియు వ్రాసిన పిమ్మట, నాటక రచనాపద్ధతి, ఇతివృత్తము, పంచసంధులు, అంకవిభజన, మొదలయిన శీర్షికల క్రింద నాటక ప్రక్రియాసంబంధి సర్వవిషయములును కూలంకషముగా చర్చింపబడినవి. ఏడవది ఔచిత్యప్రకరణము. కావ్యమెట్లుచిత రమణీయముగా నుండవలయునో సోదాహరణముగా ఇందు నిరూపణము జరిగినది. ఎనిమిదవది సంఘటనా ప్రకరణము. ఇందు గుణములకును పదఘటనమునకును గల పరస్పర సన్నిహితసంబంధమును సుస్పష్టముగా విచారించినపిమ్మట రీతులనుగురించియు చర్చయున్నది. తొమ్మిదవ ప్రకరణము గుణదోషములను విచారించునది. ఉదాహరణములమీద గుణదోషముల రెండును విశదముగా చర్చింపబడినవి. సంస్కృతియని జీవుడు, స్వర్గము మోక్షము ఈ మొదలయిన విషయములను స్పృశించునది పదియవ ప్రకరణము. పదకొండు పన్నెండు ప్రకరణములు శబ్దాలంకారములకు అర్థాలంకారములకు సంబంధించినవి. అన్ని యలంకారముల మతభేద నిరూపణ పూర్వకముగా ఉదాహరణములతో విశదీకరింపబడినవి.

సంస్కృతలక్షణ గ్రంథములయందున్న సాహిత్య సంప్రదాయములనన్నింటిని శ్రీ చర్ల గణపతిశాస్త్రి గారు క్రోడీకరించి తమ యనుభవమును బుద్ధివైభవమును జోడించి ఈ బృహద్గ్రంథమును సంతరించిరి. ఈ గ్రంథ రచనమున శ్రీ శాస్త్రిగారనుసరించినపద్ధతి విలక్షణముగా నున్నది. నిర్వచన వాక్యములను సూత్రములుగా వ్రాసి వాటి వివరణముగా మిగిలిన గ్రంథమును రూపొందించిరి. ఆ సూత్రవాక్యములు జ్ఞాపకము పెట్టుకోతగియుండి వివరణములను స్మృతికి తేగలిగియున్నవి. భారతీయ శాస్త్రసంప్రదాయములనన్నింటిని ఈ గ్రంథము సమగ్రముగాను సరళసుందరముగాను ప్రదర్శించుచున్నది. ఉదాహరణములను చూపి లక్షణములను సమన్వయించుచు అలంకారములను వివరించుటవలన ముఖ్యముగా పట్టపరీక్షలకు పోవు విద్యార్థులకీ గ్రంథము మిక్కిలి ఉపకరిగా నున్నది. శ్రీ గణపతిశాస్త్రిగారు ఈ గ్రంథమును సమకూర్చుటలో పడిన శ్రమ తీసికొన్న శ్రద్ధ చూపిన నేర్పు గణనీయములుగా నున్నవి. సాహిత్య విద్యార్థులందరకును ఇది నిజముగా 'కల్పవల్లి' యనుటలో సందేహములేదు. ఇది తప్పనిసరిగా చదువదగిన ఉపయోగకరమైన ఉత్తమగ్రంథము.

— క్షేమేంద్ర.

## 'కథలు 15

కథా సంకలనం

(ప్రతులకు : కార్యదర్శి విశాఖసాహితి; 26—15—204 మెయిన్‌రోడ్, విశాఖపట్టణం 530001. వెల : రు 3.)

ఇది కథ కాదు, కుబేరుడికి ఒక్కటే కన్ను. చిన్నతనం, ట్రాన్స్‌ఫర్, పడగ నీడ, పడమటిగాలి, పెళ్ళాన్ని ప్రేమిస్తే, పెళ్లి, బ్రతకవేర్చిన వాళ్లు, భూతాల స్వర్గం. మనిషి, నేను చూసిన నక్షత్రం, యుద్ధపర్వం, రేవు దాటినవాడు, శారద అనే కథలున్నాయ్ 166 వ పుటల యీ సంకలనంలో. రచయితలు సర్వశ్రీ ముద్దగడ సూర్యప్రకాశరావు, 'జ్యేష్ఠ' అనే కలం పేరు రచయిత శ్రీ వి. సి. హెచ్. బసవరాజు, మండలీక వెంకటేశ్వర్లు, జి. శ్యామలత—భమిడిపాటి రామగోపాలం—ఆదిమధ్యం రమణమ్మ, శివల జగన్నాథరావు, ఆదూరి వెంకట సీతారామమూర్తి, పూసపాటి కృష్ణంరాజు, కె. వివేకానందమూర్తి, ఎల్. ఆర్. స్వామి, 'బాల' అనే మేడిసెట్టి శంకరరావు, కుమారి న్యాయపతి కృష్ణకుమారి.

సాహిత్యం :

'సామాజిక ఇతివృత్తం ప్రాముఖ్యంగా వ్రాసే కథలలో సాహిత్యానికంత అధిక ప్రాముఖ్యం ఉండదు. వస్తువునూ, ఆ రూపాన్నీ విడదీయులేం గదా? మంచి ఇతివృత్తాన్ని ఎంచుకుంటే మంచి భాష వస్తుంది. అదే సాహిత్యం' అంటాడొక భాషాశాస్త్రవేత్త. ఈ వాదన అంత సమంజసమయినది కాదేమోననిపించుతూంది ఈ కథలను తిరిగా చదివితే.

మొదటి కథ, ఇది కథ కాదు—ఈ కథలన్నింటిలోనూ ప్రశంసనీయంగా ఉన్నదనిపించుతుంది. అంతే కాదు పైన పేర్కొన్న శిరోవచనాన్ని ఖండించుతుంది కూడా. ఈ కథలోని ఇతివృత్తం చాలా సాధారణమయింది. రైలు ప్రయాణాలలో నిత్యమూ జరుగుతూండేదే. కాలం మారుతోంది. పరిస్థితులు మారుతున్నయ్. విలువలు మారుతున్నాయ్ అనే నినాదాలు చెవులు చిల్లులు పడేట్లు వినిపించుతున్న యీ రోజులలో కూడా లేనివాణ్ణిచూస్తే సమాజంలో అందరికీ తేలిక భావమే. మొలలో దోపుకున్న చిక్కంలోంచి ఐదు టిక్కెట్లను తీసి టికెట్ కలెక్టరు చేతి కందించింది. (4 వ పుట) టికెట్లను చూడగానే టికెట్ కలెక్టరు ముఖం వివర్ణమయి పోయింది. ఇందులో సాహిత్యం లేదా? రచయిత పరిశీలనాశక్తిని నిరూపించడం లేదా ఈ వాక్యాలు. రెండవ కథ 'కుబేరుడికి ఒకే కన్ను'లో (13 వ పుటలో) ఎండనిప్పులు కక్కుతోంది. 'అంటారు

రచయిత'. ఎండనిష్ఠా... ...కుక్కుతుందీ? ఔచిత్యం అంతగా కనిపించదం ...టాను.

సాంఘిక ఇతివృత్తాలలో కూడా అనన్యత, అపూర్వతవంటి విశేషాలను చూపించవచ్చునని 14 వ పుటలోని 'కాని పొరపాట్లు చెయ్యడం మానవ సహజం ..మంచి దానివల్ల శ్రమ తగ్గుతుంది' అనే వ్యంగ్యం వాక్యాలు నిరూపించుతయ్. మరో ఛలోక్తి 16 వ పుటలో 'అమ్మా కుటుంబానికి అంత చెడ్డ పేరు తెచ్చే తండ్రి పుట్టితేనేమి గిట్టితేనేమి. మూడవ కథ చిన్నతనం. రచయిత శ్రీ పోలవరపు శ్రీహరిరావు. రచయిత పరిశీలనాశక్తిని విశదంచేసే కథ యిది. వంశ గౌరవం, కుటుంబ మర్యాద అనే విలువలు వంశాను గతంగా వసు వనే సిద్ధాంతాన్ని హేతువాదం అంగీ కరించుతుందా?

పరిశీలన శక్తి :

ఏవేవో జరుగుతున్నాయ్ వర్తమాన సమా జంలో. అయ్యో ఇట్లా జరుగుతున్నయ్యే అని వాపోయే వాయా ఉన్నారు ఈనాడు. ఇట్లా జరిగితే మాత్రం యేం అనే రచయితలూ ఉన్నారు. ఇదే అభ్యుదయపథం అని వాదించే సాహితీపరులూ ఉన్నారు. కానీ, వర్త మానంలో జరుగుతున్న సంఘటనలను వసు నిష్టంగా పరిశీలించి, పరిష్కార మార్గాన్ని ధ్వనిప్రాయంగా సూచించే రచయితలూ ఎక్కువమంది లేరేమో. ఈ రకం పరిశీలనాశక్తిగల రచయిత శ్రీ మండలీక వెంకటేశ్వర్లు అనిపించుకుంది ట్రాన్స్‌ఫర్ అనే కథ చదివితే. అయితే ఎక్కడో జరిగే ఒకటి రెండు సంఘ టనలకు సార్వజనీనతను ఆపాదించవచ్చునా? అట్లా అని వాటి సంగతిని అసలు పట్టించుకోనకపోతే సాహి త్యంలో అపూర్వత అనే పదానికి ఇక అర్థం ఏముంటుందీ?

'కనీసం టీ నీళ్లతోనైనా...కడుపు నింపుకో టానికి కూడా కలిసిరాని రోజుల్లో ఎ రికోసం బ్రతికా లనిపించీ...ఇంకా ఆ గతి పట్టనివాళ్లు' అంటారు 43 వ పుటలో జి. శ్యామలత. ఈ వాక్యాలు నిరాశా వాదాన్ని సూచించవా? ఓటమిని సూచించవా? అంత మాత్రాన వర్తమానంలో ఇట్లా జరగడం లేదన గలమా? జరిగిందీ, జరుగుతున్నది ఉన్నది ఉన్నట్లు చిత్రించితే సాహిత్యం అవుతుందా?

వాస్తవికత :

శ్రీ భమిడిపాటి గోపాలం రచించిన పడమటి గాలి కథలలోనూ ఆదిమధ్యం రమణమ్మగారు రచిం చిన పెళ్ళాన్ని ప్రేమిస్తా అనే కథలోనూ వాస్తవికత అధికంగా ఉన్నది. అయితే, పెళ్లాన్ని ప్రేమిస్తా అనే కథలో మనస్సుల పరిశీలన కూడా ఉన్నది. 'ఒళ్లు వాలి పసివానిలా రోదిస్తున్న భర్తను చూసి క్షణం బిత రపోయింది. మాతృత్వం గుండెల్లో పొంగింది. స్నేహంగా ఆమె చేతివ్రేళ్లని అతని జుట్టులోకి దూర్చింది. హే భగవాన్ అధికారంతో అణచివేయ డమో, ఆటబొమ్మై ఆడటమో పసివాడుగా చేతు లలో వాలడమో చేస్తున్నాడు ఆ పురుషుడు. మస భావమూ. స్నేహమూ, చెలికానితనమూ ఎప్పుడు నేర్చుకుంటాడా' 76 వ పుట ప్రశ్న లన్నింటిలో పెద్ద ప్రశ్న కాదా యిది. యుగయుగాలనుంచీ, తర తరాలనూ మానవాళిని వేధించుతున్న సమస్య కాదా యిది ?

ఈ కథా సంపుటలోని కథ లన్నింటిలోనూ సాహిత్యపరంగానూ, సాంఘికవిలువల దృష్ట్యానూ కూడా రెండవ స్థానం శ్రీ శివల జగన్నాథరావుగారు వ్రాసిన 'పెళ్లి' అనే కథకు లభించుతుంది. చాలా సాధా రణమయిన ఇతివృత్తానికి సార్వజనీనతకు సంతరించ డమే యీ కథలోని విశేషం.

మిగతా కథలు కూడా హృద్యంగానే ఉన్నయ్. వర్తమాన సమాజానికి ప్రతిబింబాలే. అయితే న్యాయ పతి కృష్ణకుమారిగారు వ్రాసిన శారద అనే కథకు ఒక ప్రత్యేకత ఉన్నది. ఒకానొక రమ్యమయిన భ్రమను సృష్టించారు ఈ రచయిత్రి. ఆ భ్రమ వాస్తవానికి దగ్గరగా ఉన్నదా దూరంగా ఉన్నదా? అందులో సాహిత్య విలువ ఎంత? సాంఘిక ప్రయోజన మెంత?

## స్వవిషయం

(ప్రథమభాగము)

(రచన: శ్రీ లింగం వీరభద్రయ్యచౌదరి బి. ఏ. (ఆక్సన్) ఐ. ఆర్. ఎస్), బారిస్టర్—ఎట్—లా. రిటైర్డ్ ఇన్‌కమ్‌టాక్స్ కమిషనర్. పంపిణీదార్లు: త్రివేణి పబ్లిషర్సు, మచిలీపట్టణం—1, మదరాసు— 600001. మూల్యం: రు. 8.)

'కొంత డొక్కశుద్ధి అయినా, జీవితమున కొంతస్థాయిని సంపాదించినా మొత్తంమీద నేను సామాన్య మానవుని కిందనే లెక్క. నేనే శాస్త్రము లోను నిష్ణాతుడనుకాను...అయితే 'స్వవిషయం' అనే పేరుతో నేనెందుకు వ్రాశాను, వ్రాయుచున్నాను?' అని శ్రీ చౌదరిగారు ప్రశ్నించుకుని కొన్ని సమాధానాలు చెప్పారు.ఎందుకు వ్రాసినట్లు 'iii వ పుటల్లో' అయినా మానవస్వభావం ఎవరి డబ్బా వాళ్ళు వాయించుకొనడం పరిపాటి కదా! పైగా ఇంగ్లండులో ఆరున్నర సంవత్సరాలు నివసించి, ప్రఖ్యాత విశ్వ విద్యాలయం ఆక్స్ఫర్డ్‌లో చదువుకొని, లండన్ మహా నగరంలో బ్యారిస్టర్ పట్టానుపొంది, జర్మని, ఫ్రాన్సు మొదలైనచోట్ల తిరిగిన నేను, కొన్ని వింతలు విశేషాలు చెప్పటాని కవకాశమున్నది. పాఠకులకు కొంత కుతూహలాన్ని అభిరుచిని కల్గించవచ్చును కదా... (viii వ పుటలో) అన్నారు. నిజం. ముమ్మాటికి నిజం యీ మాట.

'గడచిపోతున్న ఒకతరంలోనుంచి రూపొందుతుంది కాబోయే తరం. ఆ గడచిపోతున్న తరం తన అనుభవాలనూ, జీవితవిశేషాలనూ వస్తునిష్ఠంగా నమోదుచేసి ఉంచడమవసరం. అట్టి రచనలు ఉద్దీపనం కలిగించుకొనగలవు రాబోయేతరానికి' అంటూ డొక్క శాస్త్రవేత్త. అది అట్లా ఉండగా 75 సంవత్సరాల వయస్సు నిండుతున్న యీ గ్రంథకర్త రచనలో (1) వైవిధ్యం, (2) వైరుధ్యం, (3) వ్యంగ్యం, (4) అనన్యత, (5) శాస్త్రీయదృష్టి— వీటన్నింటి కంటే ముఖ్యం సమకాలీనుల గుణగణ శీల పరిశీలన, తను చూచిన ప్రాంతాలవర్ణన, లోకానుభవాన్ని నిష్కర్షగా భేరేజువేసే పద్ధతి, పాండిత్యం ఉన్నాయ్ వీరు ఇంతవరకూ యీ శీర్షికన వ్రాసిన రెండు భాగాలూ కేవలం స్వవిషయాల సంపుటాలు మాత్రమే కావు. అంతకంటే గొప్ప విలువ ఉన్నది వీటికి. సాహిత్య విలువలున్నయ్ యీ రచనలలో. సాంఘిక ప్రయోజనం ఉన్నది.

సామాన్య రైతుకుటుంబంలో జన్మించి అసామాన్యమయిన విద్యనార్జించి, సామాన్యునివలెనే గృహస్థ జీవితంలో కొన్ని చిక్కులను ఎదుర్కొన్న చౌదరిగారు సామాన్యుడా? 75సంవత్సరాల వయస్సున కృష్ణాజిల్లా పెడసనగల్లులో వ్యవసాయం చేయించుచూ రచనా వ్యాసంగ ... సామాన్యుడా? వారి జీవిత సామాన్యమయినదా? వెలగపూడి రామకృష్ణ, ఎన్. జి. రంగా, టి. భాస్కరరావు, దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారు, డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణ, డాక్టరు పట్టాభి సీతారామయ్య, శ్రీ వి. ఎస్. కృష్ణ, కవిరాజు శ్రీ త్రిపురనేని రామస్వామి సహచరుడయిన శ్రీ చౌదరిగారు వ్రాసే జీవితానుభవం సామాన్యమయిన రచన అవుతుందా? త్రివేణి, భారతివంటి పత్రికలలో రచనలను ప్రకటించిన శ్రీ చౌదరిగారు సాహితీపరుదు కాదా? డబ్బా వాయించుకొనడం కాదిది. భావితరాల వారి ఉపయోగానికి వ్రాసిన రచన ఇది. 'ఎందుకు వ్రాసినట్లు' అని శ్రీ చౌదరిగారు అడిగిన ప్రశ్నకు నా సమాధానం ఇది ఈ రచనలో లోపాలు లేదనడంలేదు. అది వేరే సంగతి. సందర్భానుసారంగా చర్చించుకుందాము ప్రామాణికంగా.

ఉపోద్ఘాతం కాక 382 పుటలున్నయ్ ఈ రెండవ మొదటి భాగంలో. నా జననం, బాల్యం. కౌమారం బందరు విద్యాభ్యాసం, యౌవనం 1916—17 విద్యాసంవత్సరం ఆరవఫారం 1917—18 విద్యా సంవత్సరం, కాలేజీ చదువు. తిరిగి బందరు చదువు, నా విదేశ విద్యాభ్యాసం, సింహావలోకనం. లండన్‌లో, పారిస్‌నగరం వగైరా ఇతర విషయాలు. ఇంటికి తిరుగు ప్రయాణం అనే ఉపశీర్షిక లున్నయ్ మూడు ప్రకరణాలలో.

పాండిత్యం :

ఈ గ్రంథంలో పాండిత్యం ఉన్నదన్నాను. అందుకు కొన్ని ఉదాహరణలు: 'ఇది విన్నప్పుడు, ఒకప్పుడు శ్రీకృష్ణుడు అర్జునుని శరీర దార్ఢ్యమును గురించి చెప్పుచు విజయుడు అవయవ సౌష్ఠవము గలవాడు, ఒక్క తొడలు మాత్రం ఉండవలసిన లావు కంటె ఒక్క పిసరు లావు ఎక్కువ అందువలన శారీరక శక్తి కొంచెము కుంటుబడిందని చెప్పినాడట' (4 వ పుట) చెప్పండి. రచయితలమని ఈనాడనుకుంటున్న వారిలో ఎంతమందికి తెలుసూ? ఈ సంగతి. ఏ సందర్భంలో జరిగింది ఈ సంభాషణ? ఏ పర్వంలోనిదీ?

'కమ్మకు వరసలేదు. కప్పకు లోకలేదు' 33 వ పుట అత్తవారింటి అల్లుడైనా కావాలి అబోతైనా కావాలి 36 వ పుట 'దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారు

ప్రైవేటు చదువుకు సన్నే హైస్కూలులో 4 వ ఫారంలో చేరారట. తర్వాత రాజమండ్రికి వెళ్లి వీరేశలింగం పంతులు హైస్కూలులోను, కొంతకాలం గుంటూరులోను చదివి 1917–18 సంవత్సరం మద్రాసులో బి. ఎ. చదువు ప్రారంభించారు. 1912 మేనెలలో వారు 25 రోజులలో ఏకబిగిని 'విజయనగర సామ్రాజ్యం' అనే నవలను వ్రాశారట.

'నేను బందరులో చదువుకొనుచున్న రోజులలో పింగళి లక్ష్మీకాంతం, విశ్వనాథ సత్యనారాయణ, కొడాలి ఆంజనేయులుగార్లు చదువుకొనుచుండెడి వారు. అనన్యతోపమానమైన 'సౌందరనందనం' అను కావ్యాన్ని జంటగా రచించి పేరు పొందారు.' 89.వ పుట.

శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారు అంతకు పూర్వం రచించియుండిన కురుక్షేత్ర సంగ్రామం 'అనే నాటకంమీద తీవ్రమైన విమర్శ వ్రాశారు. శ్రీ రామస్వామిగారప్పుడు ఐర్లండ్ డబ్లిన్ నగరలో బారిష్టరు పట్టాకై చదువుచుండినారు......నేను వారితో వైరం పెట్టుకున్నాను.' 90 వ పుట చదవండి.

వారి రాజసం తోపించే చక్కని వంపుగల నాసిక, ప్రముఖమై కాంతివంతమైన నేత్రములు స్నిగ్ధమై సమున్నతమైన ఫాలం తేజోవంతమైన వర్చస్సు కలిగి మిక్కిలి ఆకర్షణీయమైన విగ్రహంతో తెల్లని తలపాగ, తెల్లని జరీకండువా, పొడుగుపాటి ఎక్కరీనిండా గుండీలకోటు, తెల్లని జరీకట్టు వారిని సౌందర్యమూర్తిగా చేసినవి. '92 వ పుట. ఇటువంటి వాక్యాలు చాలా వున్నాయ్ యీ గ్రంథ లో. 93 వ పుటలో 'దేశభక్తి పూరితములైన పదగుంభనలతో, సింపంగి గులాబి పులతో ఉత్తేజ జనకములైన వారి మాటలు శ్రోతలను ఆకాశమునకెత్తినవి' సాహిత్యం పుష్కలంగా ఉన్నది. ఎన్ని వాక్యాలని ఉదహరించగలనూ ఈ రకం వి ఎన్నర్శో!

వ్యక్తుల మనః పరిశీలన :

తను కలుసుకొన్న ప్రతివ్యక్తి మనస్సునూ, శీలాన్నీ పరిచయం చెయ్యడానికి యత్నించారు శ్రీ చౌదరిగారు. 'బందరునుండి వారపత్రిక నడుపుచుండిన శ్రీ ముట్నూరి నదివరకు బందరులో చూచియేను ఉండునుగాని వారి రా సభలో ముపన్య సిస్తుండగా చూచిన దృశ్యం ఇప్పటికిని 55 సంవత్సరాలు దాటిన తరువాతగూడ నా మనఃఫలకమున గాఢముగా ముద్రించబడి చెక్కుచెదరకుండ నున్నది' 94 వ పుట.

'సహజంగా వయస్సులోనున్న స్త్రీకుండే వాంఛ తక్కువ. ఈ కారణాలవల్ల నా రాకకు యెదురుచూచు చుండకపోగా ఎందుకు వచ్చాడాఅన్నట్లు ఆందోళనపడేది వర్ణించేది 96వ పుట. తన భార్యను గురించి శ్రీ చౌదరి గారు వ్రాసిన వాక్యాలివి. వస్తునిష్ఠంగా, సునిశిత పరిశీలన చేయగల శక్తిని నిరూపించే ఇటువంటి వాక్యాలు చాలా ఉన్నాయ్ యీ పండితునిలో. 'నేను అనాకారినని పెండ్లికిముందు నన్ను చూచిన మా బావ చెప్పగా మా అత్త యీ సంబంధం వద్దని చాలా తగాదా పెట్టి దరిపైన చెప్పాను. ఇంత వివాదంలో పడిపోయిన భర్తగుందు భార్యకు సదభిప్రాయం ఉండదు. ఫునాది యుండదు' 98 వ పుట. ఈ అభిప్రాయ తో ఈనా కాలంలో ఎంతమంది యువతులు ఏకీభవించుతారూ?

ఛలోక్తులు :

'మాకు ఫిఫ్త్ఫారంలో భిన్నభిన్న అంశాలను చెప్పే గురువులలో కళ్యాణ రామయ్య, బుడ్డదొర, అనే దేశీయ క్రైస్తవులు, బుడ్డిచెంబుశాస్త్రి అనే కోరాడ నాగేశ్వరశాస్త్రులుగా రుండేవారు. బుడ్డిచెంబు శాస్త్రులుగారు గొప్ప పండితులేకాక చమత్కారులు కూడాను. ఏ విద్యార్థియైనా కొంచెం లోకజ్ఞానించ డానికి ప్రయత్నిస్తే చురుకు కత్తివంటివారి నెదురు దెబ్బతో (రిటార్టు) చటుక్కున వారిని తోక కోసేసే వారు.' 10× వ పుట. ఈ విధంగా తన ఉపాధ్యాయు లందరినీ తమాషాగా, అయితే భావగర్భంగా వర్ణించారు శ్రీ చౌదరిగారు. శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారి ఉపన్యాసాలను 109 వ పేజీలో ఈ గ్రంథ కర్త వర్ణించారు మితంగా.

114 వ పుటలో 'నైతికజీవితం అంత హీనంగా తగ్గిపోయిందిప్పుడు' అన్నారు ఈ రచయిత. ఈ వాక్యంలో హీనంగా అనే పదం అనవసరం.

శ్రీ యార్లగడ్డ రంగనాయకులుగారి ప్రస్తావన ఈ గ్రంథం 118; 119 పుటలలో జరిగింది.

శ్రీ జంపాల గోపాలరావు తెనాలి తాలూకా తహసిల్దారుగా పని చేశారని గుర్తు వెనిగళ్ల హనుమంత

రావుగారితో యీ గ్రంథకర్త పరిచయం 120 వ పుటలో ఉన్నది.

'దీపావళి చందాలు వసూలుచేయుట కనువైన కాలమని పెద్దలు తలంచారు. మద్రాసులో దీపావళి అధిక ప్రాధాన్యం కలది. అందువల్ల 1917 దీపావళికి మద్రాసులో చందాలు వసూలుచెయ్యటానికి శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, శ్రీ కౌతా రామశాస్త్రి వగైరా పెద్దలు నా వంటి విద్యార్థులను కొంత మందిని తీసుకుని వసూళ్ళకు బైలుదేరారు' 125 వ పుట.

కులాల ప్రస్తావన :

127 వ పుటలోని 2 వ పేరాగ్రాఫ్‌జాగ్రత్తగా చదివి చరిత్ర తెలిసినవారు జిజ్ఞాస చేయవలసినట్టిది. ఈ కులాలనేవి ఎప్పుడు యేర్పడినవి ? చేసే పనిని బట్టి యెర్పడినవనే సిద్ధాంతం యీ శాస్త్రవైజ్ఞానిక యుగంలో నిలబడదు. బలం, పలుకుబడి ఉన్నవారు నాయకులవుతున్నారు. నాయకులంతా ఒక కులం అవుతారు. మాటలువేరు, చేతలువేరు. లేనివాడు ఏదో తంటాలుపడి కొంచెం సంపాదించి సభ్యత నలవరచుకుంటే, అంతకుపూర్వమే సమాజంలో పెత్తనం సాగించుకున్నవారికి కన్నెఱ్ఱగా ఉంటుంది. పాత కుల వ్యవస్థ మానవుని సౌకర్యానుగుణంగా అంతరించి పోతున్నది. మరి యీ కొత్తకులం మాటయేమిటి ? వాటివల్ల సమాజానికి మేలు జరుగుతున్నదా ? కీడు జరుగుతున్నదా ? శ్రీ చౌదరిగారు మరొక సందర్భంలో ప్రస్తావించి ఉండినట్లు జంధ్యాలున్న బ్రాహ్మణులూ పౌరోహితులకంటే అవి లేనివారి ప్రాబల్యమే వర్తమాన సమాజంలో క్రమేపి పెంపొందడం లేదా ? అటువంటప్పుడు ఈ బలిజ, బలిజసెట్టి, కాపు, రెడ్డి, అగ్నికుల క్షత్రియులవంటి మాటలకు అర్థంలేదని పాశ్చాత్య దేశాలలో తను అనుభవంలో శ్రీ చౌదరిగారు గ్రహించ లేదా? అందుకనే బెజవాడ స్టేషన్‌లో యీ గ్రంథకర్తను వీరభద్రయ్య అని డాక్టరు రాధాకృష్ణ సంబోధించడం జరిగింది.

ఒక సభలో తననుచూచి కూడా తన అభినందనకు డాక్టరు పట్టాభి సీతారామయ్య ప్రతిస్పందించకపోవడానికి రాజసం కారణం అన్నారు యీ గ్రంథకర్త. కాదేమో! అదొరకం రాజకీయ నాయకత్వ కుల ద్వేషమేమోనని నా సందేహం. పాత కులవ్యవస్థకు బదులు . ...నూ, ఆర్థికంగానూ రూపొం...న్నది. ఏ రాయతేనేం తల పగలగొట్టడానికి? ...సంలో సంస్కరణ పేరిట వివాహాది తంతులలో జరుగుతున్న పనులు శ్రీ త్రిపుర్నేని రామస్వామి చౌదరిగారికి సహించవనుకుంటాను. వారు నేతివాదులు — నిహిలిస్ట్‌లు. సత్యాన్వేషి. అంతేగానీ ఒకానొక వర్గానికి కీడు జరగడం వారి సంస్కరణల లక్ష్యంకాదు. కానీ కాలగతిని ఎవరూ మళ్ళించలేరు. మార్క్సిస్ట్‌లు చెబుతున్నట్లు గతితార్కిక భవుతిక గమనంలో ఒక వర్గానిదొక కొంతకాలం పైచెయ్యి అవుతుంది. ఆ తరువాత మరొక వర్గం లోకి మారుతుంది పెత్తనం. గ్రామాలలో స్వయంగా నేను గత 30 సంవత్సరాలలోచూచి గ్రహించిన వాస్తవమిది. శ్రీ చౌదరిగారు పాశ్చాత్యదేశాలలో ఇదే వాస్తవాన్ని గ్రహించి వుంటారు.

లాలిత్యం :

శ్రీ చౌదరిగారు శృంగారపురుషుడు కాకపోవచ్చుగానీ వారిలో లాలిత్యం జాస్తి. కనుకనే ప్లేటో ప్రతిపాదించిన ఆదర్శవాదానికి దగ్గరగా ఉంటవి వారి భావాలు. 'అందులో స్త్రీలు నా దృష్టిని చూరగొంటారు. నాకు వేరే దురుద్దేశం ఉండకపోవచ్చు. అక్రమముగానైనా వానిని పొందాలని కాంక్ష యుండక పోవచ్చు కాని, వాటని లేక వారి సౌందర్యాన్ని చూచి ఆనందించాలని తహతహపడతాను. (152 వ పుట)' ప్రక్కయింటినుండి పైజెప్పిన నాగమణి, అప్పాయమ్మ వచ్చారు. వారు వృద్ధులు. కులపెద్దలు... ఇవి యే నారింజతోలురసం మరకలోగాని గనేరియా మరకలు కావని నాకు నమ్మకం చెప్పారు. నా ప్రాణం కుదటపడింది. అంతటితో నా వేశ్యా సాంగత్యం ఆఖరు. 154 వ పుట.

'అటు యిటు తిరుగుచుండగా నేను ఒక అవివాహిత యువతి ఒకచోట పచ్చగడ్డిలో దగ్గరగా కూర్చొని మాటలు చెప్పకోసాగాం. ఏమిబుద్ధి పుట్టిందో నేను వంగి ఆమె బుగ్గను ముద్దు పెట్టుకున్నాను. 247 వ పుట.

'మనిషైఉన్న తర్వాత స్త్రీ తారసిల్లక మానదు. ఒక రాత్రొక స్త్రీ వెంటబడి నన్ను భ్రమపెట్టి మారుమూలనున్న తన గదికి తీసుకువెళ్ళింది. ఆ గది ఒక చిన్న మేడపై వున్నది... నేను గండర

తప్పి ...టి అనుభవమే 314 వ పుటలో వ్రాశా... వన్నీ ప్లేటో సిద్ధాంతాన్ని సమర్థించే అనుభ... ఆ సంగతి మనకు తెలియకపోవచ్చు. పైగా అదొక బలహీనత అని మనం భ్రమపడవచ్చు. కానీ నిజానికి మానవుడు ప్రాయికంగా హేతువాది కావడమే చెడ్డపనులకు దూరం కావడానికి కారణం.

స్త్రీ పురుష సంపర్కం సహజం. 'ఇనుప కచ్చడాల్ గట్టిన ముని ముచ్చులెల్ల తామరసనేత్ర లిండ్ల బందీలుగారె' అన్న పెద్దన్నగారి పద్యపాదాన్ని 315 వ పుటలో యీ గ్రంథకర్త ఉదహరించడంలో వారి పాండిత్యమే ఎక్కువగా ద్యోతకమవుతుంది. మరి ఎడింబరోలో సంస్కృతం అభ్యసించారుగదా శ్రీ చౌదరి గారు. ఆ భారతీయత ఎక్కడికి పోతుంది? ఈ గ్రంథకర్త విదేశ విద్యాభ్యాసానుభవం 215 వ పుటనుంచి ప్రారంభమవుతుంది. ఒక రకంగాచూస్తే యిది ఈ ఒక్క రచయిత భావంమాత్రమే కాదనిపించుతుంది, చాలామంది సమకాలీకుల ప్రస్తావన ఉన్నది.

అంతకంటె ముఖ్యం బ్రిటన్‌లో విద్యాశిక్షణ పొందాలని అభిలషించే యీ తరం విద్యార్థులకు ఉపయోగపడే చాలా సంగతులున్నయ్ యీ అధ్యాయంలో. 1920 లో అక్స్‌ఫర్డ్‌లో శ్రీ ఎన్. జి. రంగా, కల్లూరి చంద్రమౌళి, శ్రీ వెల్లంకి అంకయ్యచౌదరి, శ్రీ నాదెళ్ల వెంకటదాసు ప్రభృతులతో యీ గ్రంథకర్తకు పరిచయం. సహవాసం. స్నేహం.

లండన్‌లో ఒక విశ్వవిద్యాలయంలో చేరాలంటే ఏమి చెయ్యాలి. ఎవరి సహాయం పొందాలి? తదితర అంశాలన్నీ ఉన్నాయ్ యీ భాగంలో. బెర్లిన్, పారిస్, లండన్‌లో పడవల పందెంవంటి వాటిని హృద్యంగా చిత్రించారు ఈ గ్రంథకర్త.

తాను పేయింగ్ గెస్ట్‌గా ఉండిన కుటుంబాలతో తన అనుభవం, తన చదువుకు రు 40 వేల దాకా ఖర్చయిందనే విచారం. లండన్‌లో న్యాయశాస్త్రంలో శిక్షణ పొందవలసిన పద్ధతులను చమత్కారంగా చిత్రించారు మరొక చెంప.

లండన్‌లో తను చూచిన బ్రిటిష్ మ్యూజియమ్, నేషనల్ గాలరీ, హైడ్‌పార్క్‌వంటి వాటిని పరిచయం చేశారు.

ఇంటికి తిరుగు ప్రయాణం :

1927 ఫిబ్రవరి 27 మద్రాస్ హార్బరుకు చేరుకొన్నప్పటినుంచీ మద్రాస్ హైకోర్టులో బ్యారిష్టరుగా చేరడం, వృత్తిలో పైకి రాలేకపోవడం, మద్రాస్‌లో దేశోద్ధారకుని శ్రీబాగ్ దర్శనం, భారతిలో వ్యాసాల ప్రచురణ తుదకు 8—4—1929 న ఇన్‌కమ్‌టాక్స్ డిపార్ట్‌మెంటులో (369 వ పుట) అసిస్టెంట్ ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా చేరడం, ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారితో పరిచయం. భార్య తొలుత అంకెకు రాని కారణాన రెండో పెళ్ళి చేసుకోవాలని తను చేసిన యత్నం, శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరగారితోనూ, వారి త్రివేణి పత్రికతోనూ పరిచయం, భారతిలో అర్ధాంగి, అర్ధనారీశ్వరుడు, గృహలక్ష్మి అనే వ్యాసాల ప్రచురణ యీ భాగంలో హృద్యంగా, ఎబ్బెట్టుకలగకుండా, ధ్వని ప్రధానంగా చిత్రించారు ఈ మేధావి. మరొక సంగతి 'సమదర్శిని' ఉగాది సంచికలో వివాహవిచ్ఛేదం పాశ్చాత్యస్త్రీలు అనే రెండు వ్యాసాలను శ్రీ చౌదరిగారు ప్రచురించగా వాటిని గురించి కొంత దుమారం రేగిందట పత్రికలలో. కానీ సామాన్యులా శ్రీ వీరభద్రయ్యచౌదరిగారు, అంతమాత్రానికే ఉలకడానికి. కొంతమంది ప్రోత్సహించినప్పటికీ మిన్నకున్నారు. వారి ఔదార్యానికి అంతకంటే తార్కాణమేమి కావాలి.

ఆ తరువాత 1920 జనవరిలో (వారి) భార్య పశ్చాత్తాపంతో, కొంతమంది పెద్దలూ, మిత్రులూ హితైభిలాషుల సహాయంతో శ్రీ చౌదరి గారిని చేరింది. అప్పటికే వారికి ఇన్‌కమ్‌టాక్స్ డిపార్ట్‌మెంట్‌లో అంతకుముందుకంటే పెద్ద ఉద్యోగం వచ్చింది.

భావితరాలవారి ఉపయోగార్థం గ్రంథాలయాలలో ఉంచవలసిన గ్రంథాలివి. ఏ పి. యు. సి. తరగతులలో ఉపపాఠ్య గ్రంథంగా ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు ఉస్మానియా విశ్వవిద్యాలయంవారు వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు నిర్ణయించవలసిన గ్రంథాలకోవలోనివి ఇవి. కానీ మనం ఉన్నామే మనం ఆంధ్రులం అటువంటి పన్లు చేస్తామా? అంత సాహసం ఉందా? మనకు రుచి ఏదో అరుచి యేదో మనకు తెలిస్తే కదా!

ఈ తరం యువకులు చదవవలసిన గ్రంథా

లివి. చదివి చర్చించాలిసిన అంశాలు చాలా ఉన్నాయ్ వీటిలో. లేవంటారా?

—శ్రీ వి. ఎస్. అవధాని.

## ఉద్యోగపర్వాలు

(రచన: తేళ్లపల్లి వెంకటలక్ష్మీనారాయణ ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో. మద్రాసు— మచిలీపట్నం - సికింద్రాబాదు. పేజీలు—135 వెల— 2—50.)

'అట్లా తొందరపడితే ఏ పనవుతుందయ్యా ఏ పనీ అవ్వదు. నేను చెప్పే విషయం ఎవరి దగ్గరా అనకండి అన్నా నేనన్నానని చెప్పొద్దు. ఈ ఉద్యోగ సంపాదనలో మొదట గ్రహించాల్సిన విషయం ఏవిటంటే యింటర్వ్యూలో ఏమాత్రం ఆశ పెట్టుకోకూడదు; లాభం లేదు కాబట్టి. ఇకపోతే మూడు కిటుకు లున్నాయి. ఒడుపు, ఏడుపు, ముడుపు అని మూడు రకాలు. ఈ మూడింటినీ వెనకా ముందుగా ఉపయోగించాలి. మనిషినిబట్టి మారుస్తూ ఉండాలి' (పేజి 48) ఈ మాటల మూటలు చిరుద్యోగి నిరుద్యోగి కిచ్చే సలహాల్లో ప్రధానమైంది.

ఈ రోజుల్లో ఒక ఉద్యోగం సంపాదించాలన్నా, ప్రభుత్వంలో ఉన్నతపదవి అధిష్ఠించి చిరునవ్వుల వెన్నెలలు వెదజల్లుతూ ఎక్స్‌పోర్టు లైసెన్సు లిప్పించి కానుకలు గ్రహించాలంటేను, పాలడబ్బాలు సంపాదించాలన్నా, మార్కులు వేయించుకోనాలనినా, అధికారుల అడుగులకు మడుగులొత్తి ప్రాపకం పొంది నిరుద్యోగులను మభ్యపెట్టి నిలువు దోపిడీ చేయాలంటే ఒడుపు, ఏడుపు ముడుపు ముఖ్యంగా ఉండాలి. ఇవి లేకుంటే ఆ వ్యక్తికి ఉద్యోగం హళ్లి. ఈ ప్రజాస్వామిక వ్యవస్థలో పంచాయితీ క్లార్కునుండి ప్రైమినిష్టరు వరకు లంచాలు పట్టేవారే. ఈ లంచాల చిట్కా తెలియకపోతే నిరుద్యోగికి నిట్టూర్పు, చెప్పులరిగేలా తిరగటం తప్ప మరేమీ ఉండదు. ఈ ఉద్యోగపర్వాల్లో పాపం చిరుద్యోగి ఉద్యోగంకొరకు సతమతమయ్యాడు. పేపర్లు తిరగవేశాడు. అప్లికేషను పెట్టాడు. ప్రయోజనం నాస్తి. అతని గోడు విని ఉద్యోగం ఆఫర్ చేసినవారెవ్వరూ లేకపోయారు.

ఇంటర్వ్యూ పేరుచెప్పి అధికారులు నిరుద్యోగులదగ్గర డబ్బు గుంజటమేకాని ఉద్యోగం యియ్యటం లేదు. ఈ [illegible] ందికి మాత్రమే వస్తాయి. [illegible] డ [illegible] ంత్రికుః [illegible] యితే కాని మరేమీకావు. [illegible] జుల్లో డిగ్రీలు సంపాదించటం చాల సులభం. నిరుద్యోగివంటి అమాయకులీ రోజుల్లో ఉండటం చాల చిత్రమైన విషయం. ఈ నిరుద్యోగుల బ్రతుకులకు వెంటనే నిష్కృతి లభింపదు. చివరకు జీవితంతో పోరాటం సాగింపలేక రైలుక్రింద తలపెట్టి పట్టాలమీద హాయిగా నిద్రపోయే అవకాశం ప్రాప్తిస్తుంది.

చిరుద్యోగి యీ కాలపు లక్షణాలు అవలక్షణాలని మనసులో ఊహించుకొన్ననూ పైకి మంచి లక్షణాలే అని పొగడగలవాడు. బ్రదుకనేర్చినవాడు గనుక యెవరిదగ్గర యెలా మసలుకోవాలో తెలుసు. అందుచేతనే గోవిందరావును మంచిచేసుకొని ప్రమోషనుకు రికమెండేషను సంపాదించి క్లర్కును మంచిచేసుకొని పై ఆఫీసరుకు యెత్తుపెట్టి ఉద్యోగంలో మెట్లెక్కిపోయాడు. అతడు తన భార్యను గోవిందరావు భార్యకు పరిచయంచేసి యిద్దరూ వారి మెప్పుకు పాత్రులయ్యారు. మరొకరయితే కట్టుకొన్న భార్యను తన పై అధికారికి ఒప్పజెప్పి ప్రమోషన్‌ను తన కాళ్ళదగ్గరకు రప్పించుకొనేవాడు. కాని చిరుద్యోగి మనసు మంచిది. కష్టించి పనిచేయటమే అతని ఉద్దేశం.

చిరుద్యోగి జేసేది చిన్న ఉద్యోగమే అయినా అందరి దృష్టిలో మంచివాడనిపించుకొని నిరంతరం ఫైళ్ళలో మునిగి ఉండేవాడు. అతనిది 'వర్కు ంరాజా వర్షిప్ప' అనే పద్ధతి. అందుచేతనే చిరుద్యోగి సూపర్నెంటు అయ్యాడు.

విహంగరావు అందరికంటే బాగా లోకం పోకడ గ్రహించినవాడు. ఉద్యోగపు చిట్కాలు గ్రహించటం వల్ల ఉద్యోగంలో విహంగంలా ఎగిరాడు. ఈతనిలాంటి వారిప్పటికినీ మనకు ఆఫీసుల్లో కాన్పిస్తారు.

మొదటగా యిందులోని కథలు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురింపబడ్డాయి. అయితే నిరుద్యోగి పర్వంకంటె చిరుద్యోగపర్వం చాల ఉత్సాహంగా ఉన్నది. రచయిత ఈనాడు భారతదేశంలో అందునా ఉద్యోగ పర్వంలో జరిగే వింతలు విశేషాలు చక్కగా చూపించారు. విషయ ప్రదర్శనలో వ్యంగ్యం, హాస్యం, పరిహాసం ప్రముఖంగా ప్రస్ఫుట మగుచున్నాయి. విషయాన్ని డైరెక్టుగా చెప్పితేనే మన పాఠకలోకాని కర్థం

గాదు; మన పాఠకు లేమి ... ఉంటే చిరాకు లేకుండా రచన సాగిపోతూ.

సమాజాన్ని క్షాళనం చెయాలంటే యిట్టి రచనల ప్రాధాన్యం చాల ఉన్నది. రచయిత యింకనూ యిట్టివి రచించి పుణ్యం సంపాదిస్తారని భావింప వచ్చును. ఇది ప్రచురించినందుకు ఎమెస్కోవారు అభివందనీయులు.

—రామమోహన్.

## సంస్పందన

(స్వచ్ఛంద కవితా సంపుటి)

(రచన : ఏ. సూర్యప్రకాశ్. వెల : రూపాయి; ప్రచురణ ఇందూరు భారతి : తెలుగు రచయితల సమాఖ్య, నిజామాబాద్.)

ఇది డా॥ సి. నారాయణరెడ్డిగారికి ప్రత్యక్ష శిష్యుడైన ఏ. సూర్యప్రకాశ్‌గారి స్వచ్ఛంద కవితా సంపుటి. ఇందు మొత్తం 44 రచనలున్నాయ్. పుస్తకం మొదట్లో సంస్పందనకు నా అభినందన' అంటూ సినారెగారు, ఒక వేదన, ఒక రోదన, ఒక ఎలుగు, ఒక మూలుగు. ఒక సాడినిట్టూర్పు. ఒక కన్నీటి వార్పు. ఒక భయాక్రందన. ఒక రక్తస్పందన - కలసి ప్రశుతిచేసిన కలం గళం విసిరేసిన సుందర కవితా సంపుటి 'సంస్పందన'—అని తెల్పిన మాటలు ఇందలి రచనల్లో సర్వత్రా గోచరిస్తున్నాయ్. 'తరం మారింది' అంటూ శ్రీ కుందుర్తిగారిచ్చిన పరిచయ వాక్యాల్లో పుస్తక సమీక్ష చాల సహృదయంగా చేయబడింది. ఇందలి ఖండికలన్నీ దాదాపు చిన్నవే అయినా, పాఠక హృదయాల్ని సంస్పందింప జేయటంలో అఖండశక్తి గల్గి వున్నాయ్. 'గుండెలో కలం ముంచి...' అంటూ రచయిత తన రచనకు ఆలంబనాలుగా క్షోభ. ఉద్వేగం. సహానుభూతి, ఆనందం, అశాంతి, ఆరాటం, ఆవేశం వుంటాయన్నారు. ఇవి గ్రంథంలో ప్రత్యక్షంగా గోచరిస్తున్నాయ్. ఇందలి రచనల్లో. 'గాలికి ఊయల ఊగింది'లో బీదప్రజలపై సానుభూతి, 'బాపూజీ లేఖ'లో శాంతి కాముకత, 'అగ్నిని ఆగ్నేయకం'డిలో క్షోభ, 'లోనికి రాకూడదు'లో నేటి నాయకుల స్వార్థజీవన చిత్రణ; 'అయ్యో రామ'లో హాస్యపూరితమైన వ్యంగ్యము, వ్యక్తమౌతున్నవి. ఇలాగే 'మహాజనులారా! మయసభ' ఏం పాడను?, గూటిలో వెలుగు, పాషాణ హంస, మొదలగునవి వుత్తమ రచనలు.

## నగరం నీడలు

(వెల రూ. 1—50. ప్రచురణ: ఇందూరు భారతి.)

ఇది ఏ. సూర్యప్రకాశ్ రచన. ఇందు ముప్పై నవకవితలున్నాయ్. 'నా కవిత' అనే మొదటి గేయంలో కవి తన కవితా ధ్యేయాన్ని, స్వభావాన్ని, 'అడుగడుగునా ఎదురు దెబ్బలుతిని, కూలబడ్డ మనుషులను లేపి చేయూత నిచ్చే ఊతకట్ట నా కవిత; కష్టజీవి నుదుటి చెమట, నిర్భాగ్యుని కన్నీరు తుడిచే జేబు రుమాలు నా కవిత..........' అంటూ టార్చిలైట్, సిస్మోగ్రాఫ్, సైరన్‌లుగా పేర్కొన్నారు. 'భావిభారత పౌరుడు' గేయంలో నేటి యువతరం ఎలా దురభ్యాసాలకు గురియై, తన భవిష్యత్తును వృథా చేసుకొంటూందో చక్కని వ్యంగ్య ధోరణిలో చిత్రించారు. 'మత్స్యన్యాయం'లో నేటి నాయకుల అవినీతి, స్వార్థం, కండ్లకు గట్టినట్లుగా చేపల నెపంతో వ్యక్తీకరింపబడింది. ఇది మంచి సంయమనం గల రచన. 'మనసు పొరలలో...' గూడ ఇలాంటిదే! 'భయస్తుడి భయాలు'లో పేదవాని జీవితం, 'కళ్లు తుడుచుకోండి'లో ఓదార్పు, సానుభూతి, 'చీకటి నిండిన పడుపు'లో పదమూడేండ్ల పసికన్యపై పాక్ వీరులు గావించిన రాక్షసకృత్యాలు—చాల హృదయ విదారకంగా చిత్రించబడ్డాయి. 'కలెక్టర్ రాజారావ్' ఒక కథాత్మక సందేశ రచన. 'మళ్లీ పుట్టావా?' గేయంలో శ్రీకృష్ణుణి నేటి స్వార్థనాయకుల గుణగణాలకు అనుకూలంగా వుండమంటూ చాల వ్యంగ్య చమత్కారంతో ప్రబోధించాడు కవి. 'నగరం నీడలు'లో 'నగర జీవితం ఎండమావి'గా పేర్కొని, గ్రామీణ జీవితంలోని ప్రశాంతతను వ్యక్తం చేశాడు. ఇలా ఇందలి నీడలన్నీ—నేటి సంఘాన్ని వుత్తేజపరచే జాడలై వున్నాయ్. కనుక ఇలాగే వీరి కలం ఇంకా సంఘ సంస్పందనాత్మక రచనలు గావిస్తుందనగలం.

## చారు మజుందారి

(సంస్మరణ కవితలు. వెల 0-80. ప్రచురణ: —'సృజన'.)

ఇది, అమరవీరుడు కామ్రేడ్ 'చారు మజుందార్' చనిపోయినపుడున్నూ, ఆయన ప్రథమ వర్ధంతి సందర్భంగానున్నూ సంస్మరణార్థం అర్పించిన కవితా సంపుటి. ఇందులో శ్రీ శ్రీ, చెరబండరాజు, శివసాగర్, వి. బి. గద్దర్; బొబ్బిలి మల్లారెడ్డి, నిర్మల్, సత్యం, మున్నగువారి పద్నాల్గు కవిత లున్నాయ్. మజుందార్ గొప్ప విప్లవనేత. నక్సలైట్ వుద్యమ నాయకుడు. బాల్యంనుండీ యితని హృదయం పీడిత ప్రజా ఉద్యమాల వైపు ఆకర్షింపబడింది. తత్ఫలితంగా నాల్గేళ్ళ జైల్లో జీవితం. 1967 నుండి దేశం నలుమూలలా జరుగుతూ వున్న సాయుధ పోరాటాలకు, పీడిత రైతాంగ వుద్యమాలకు 'చారు' నాయకుడు. చివరకు గత సంవత్సరం జూలై 28 న తన ప్రాణాలను వుద్యమానికే అంకితం చేసి, వీరమరణం చెందాడు. నూతన అరుణోదయంకోసం సాగుతున్న యీ సమరంలో మజుందార్ ఒక ఎర్రని కాంతిరేఖ. అంతేకాదు. 'బూర్జువా గుండెల్లో దించిన బుల్లెట్ మజుందార్' అంటూ చారుబాబునుగూర్చి ఇందలి కవులు వాపోయారు. ఇందలి కవులంతా కలాలతో రక్తాన్ని చిందించగల ప్రజ్ఞావంతులే గనుక ఇందలి రచనలుగూడా సమరశంఖారావాలుగానే ప్రతిధ్వనిస్తున్నాయ్!

## ఊరేగింపు

(రచన : వరవరరావు. వెల 1—25. ప్రతులకు ఉద్యమ సాహితి. కరీంనగర్.)

ఇది విరసం కార్యవర్గ సభ్యులు 'సృజన' సంపాదకులునైన శ్రీ వరవరరావు రచన. అంకితం మార్క్సిస్టు—లెనినిస్టు నాయకుడు కామ్రేడ్ కె జి. సత్యమూర్తికి. ఇందులో ఇరవై తొమ్మిది కవిత లున్నాయ్. మొదట్లో వెంపటాపు సత్యనారాయణ, జార్జిరెడ్డి, మజుందార్‌వంటి నవసమాజ నిర్మాతలైన అమరవీరులనుగూర్చిన సంస్మరణ కవితలున్నాయ్. వీరి మరణాన్నిగూర్చి వ్రాస్తూ 'తన తరమంతా సుఖంగా బ్రతకడానికి ఒకడు ఒక రోజు ముందుగా చస్తాడు' అంటారు రావు. ఇందులో ఎక్కువగా శ్రీకాకుళం రైతాంగ సాయుధ పోరాటం, నక్సల్‌బరీ నిప్పు రవ్వలు, ఎన్నికల గారడీలనుగూర్చిన కవిత లున్నాయ్. 'ప్రజను సాయుధం చేస్తున్న రెవల్యూషనరీ నేడు కవి' అని పుస్తకం తెరవగానే కన్పించే యీ వాక్యం, చాటుతోంది. 'రెడ్ ... వలెనట్లు, హృదయానికి బలం ...కే శక్తివంతమైన అలల్ని కవితా వాహినిలో సృష్టించగల సమర్థుడు వరవరరావు. ఇందులోని రచనలు సమాజంలోని పరిస్థితులకు, సాయుధ విముక్తి పోరాటాలకు ప్రతిస్పందనలు. ఇందులో సలడే కంఠాలన్నీ 'దగా పడిన ప్రజానీకం గుండెల్లోంచి పెల్లుబికిన తానాలు' అని వర్ణించిన కవిగారి ఆవేదన, ఆక్రోశం, కసి, సర్వత్ర వెల్లడవుతోంది. 'ఈయన మాటల్ని ఈటెలుగా విసరగలడు. అవి శత్రువుల గుండెలమీద విషాగ్ని, ప్రజల గుండెల్లో అమృతాన్ని చిలుకుతాయి' అనిన శ్రీ లోచన్‌గారి వాక్యాలు ప్రత్యక్షర సత్యాలు!

## జనం ఊపిరితో...

(ఖైదీగీతం : సృజన ప్రచురణ—13. వెల 0—50.)

ఇది విప్లవ సాహిత్య ప్రచురణ. ఇందు శివసాగర్‌గారి తొమ్మిది గేయాలున్నాయ్. ఉరిశిక్షకు గురికాబడి మృత్యువు నెదుర్కొంటోన్న ఆదిలాబాద్ జిల్లా రైతాంగ గెరిల్లా వీరులు కామ్రేడ్ కిష్టగౌడ్, భూమయ్యలకు వినమ్రతతో ఈ పాటలు అంకితం ఇవ్వబడ్డాయి ఇందలి రచనలన్నీ విప్లవత్వాన్నీ, సాయుధ పోరాటాన్నీ ప్రేరేపించేవి. 'ఖైదీ గీతం' అనే తొలిగేయం ఖైదులో తొలినాటిరేయి, కటకటాల యెదుట కన్పించిన చందమామ నుద్దేశించినది. 'జీవితాంతం వరకు ప్రజలకు సేవలుచేయ విఫలమైనందుకు నన్ను మన్నించమని, నా మిత్రులను వేడవే. కంటి తడిపెటకే చందమామా!' అంటూ ఇందలి రచన చాల హృదయాకర్షంగా వుంది. 'ఓ చిలుకాడా! నేలతల్లి చెరను విడిపించగ'లో రైతాంగ పోరాటం బాగా తావు చేసుకొనింది. 'ఓహో! విద్యార్థీ!' రచనలో 'పనికిమాలి, పనికిరాని చదువులన్ని కట్టిపెట్టు, కార్మికులతో, కర్షకులతో చెట్టాపట్టాల్‌పట్టు, నవభారత అవతరణకు జీవితాన్ని పణంపెట్టు, వీరుడవై, రణధీరుడవై ఆయుధాన్ని చేతబట్టు' అంటూ విద్యార్థులను విముక్తి పోరాటానికి రెచ్చగొట్టడం జరిగింది. 'ఓ పల్లెటూరి రైతా! అనేది రైతులను వర్గపోరాటానికి ప్రేరే

పించే ... 'కుట్రదారు వాజ్మూలం... న్యాయ నిర్ణయాలు వివరించబడ్డాయి.

## రక్తం సూర్యుడు

(రచన కె. శివారెడ్డి. వెల రు. 3/-ప్రతులకు H. No. 6-1-71 ఖైరతాబాద్, హైద్రాబాద్ 500004.)

ఈ రక్తం సూర్యుడు ప్రముఖ రచయిత శ్రీ కె. శివారెడ్డిగారి కలంనుండి వుదయించాడు. ఇందు ముప్పైయేడు రచన లున్నాయ్. ఇందులోని ప్రతి గేయమూ రెడ్డిగారి గుండెలోని మంటలను, రక్తాన్నే ప్రతిబింబింప జేస్తున్నాయ్. 'కవిత్వానికి కార్యశీలనా ప్రేరణ ముఖ్యం. ఊహాల్లోనూ, మానవాతీత శక్తుల్లోనూ, నిన్ను ముంచేది కవిత్వం గాదు. నవ్వల మందు' అనే ఇతని మాటలు, ఇతని కవితా ధ్యేయాన్నీ, హృదయాన్నీ ఆవిష్కరిస్తున్నాయ్. 'ఏదీ వసంతం' గేయంలో లోకానికి కనబడటికే వచ్చిన వసంతం నిజమైన వసంతం గాదు. చెట్లు చేమలు చేవబట్టడం గాని, లతలు తీగలు పల్లవించడంగాని వసంతం గాదు. గ్రామసీమలనుండి స్వేచ్ఛాయువు వీచినపుడు, నేలపై గులాబిలు పూసిననాడె వసంతంగాని, ఆకలి ఎంగిలాకులు తిన్నవాళ్ళు, అసంతృప్తి పేలికలు చుట్టినవాళ్ళు, అశాంతిచీకటిలో గడ్డకట్టినవాళ్ళు. లేదు వసంతం లేదంటాడు. మరి యీ కోరిక క్రియారూపంలో ఫలించిందంటే శ్రామికుని జీవితం నిజమైన వసంతమై మూడు పువ్వు లారు కాయ లవుతుంది. అంతమాత్రానికి జీవితమంతా సుఖమయం కావాలన్న దురాశ ఇతనికి లేదు. కన్నీళ్లు, చిరునవ్వులు, ఎండా వానలు, వెన్నెల చీకట్లు---వీటింటితో (లో) కలిపి మెదిపి తయారుచేసిన 'రసగుళికే' జీవితమని అంగీకరిస్తాడు.

ఇందలి రచనల్లో 'ఎండిన గుండెలు మండుతున్నాయ్, రక్తకీసలయం, అణవు, నా జాతిరాత, నా యిల్లు యూరుపు, జి. ఓ; యాగం, రక్తం సూర్యుడు, మేలుకో నా కవిరాజా!, ధనవంతులారా!' అనే గీతాలు చాలా బాగున్నాయ్ ఇందలి భావాల్లో నవ్యతలో నవ్యత గోచరిస్తుంది. ఇందలి రచనలు చదువగానే పాఠకుడి హృదయంలో నేటి లోకాన్ని గురించీ మానవుని రేపటని గురించీ, దోపిడీ వ్యవస్థను గురించీ, అంతులేని ఆలోచనలు చెలరేగుతాయ్. ఈ కావ్యంలో వుదయించిన ఈ రక్తంసూర్యుడు లోకాన్ని కొంతైనా వుత్తేజపరచి, వుత్సాహవంతం చేస్తాడని ఆశించవచ్చు!

## కుఠారధార

(కవితా సంపుటి)

(రచన: రాంభొట్ల పార్వతీశ్వరశర్మ. వెల 1—00. ప్రతులకు విశాఖ రచయితల సంఘం; విశాఖపట్నం—1.)

ఇందు 18 రచనలున్నాయి. శ్రీ క్రోవి రామ మోహనశాస్త్రిగారు పరిచయ వాక్యాల్లో స్వాతంత్ర్యం వచ్చాక ఇంతవరకుగల ప్రభుత్వ ధోరణిని దాన్ని వున్నదున్నట్లుగా బైటపెట్టాలని ఈ కవి గావించిన ప్రయాణాన్ని, అందలి ఆంతర్యాన్ని వివరించియున్నారు. ఇందలి రచనల్లో విప్లవ కవుల పంథా గోచరిస్తూంగి, కొన్ని ఖండికల్లో అభ్యుదయ కవుల ధోరణిగూడా వుంది. దానే చివర 'ఆకాంక్ష అనే గేయంలో 'అనీతి, నియంతృత్వ రిరింప లనేవానేక సహస్ర కంఠ వ్యవస్థారాక్షసీయుము, ... అభ్యుదయం కవితా జామదగ్ని కఠోరకుఠార ధారాభిహతుడు కావాలని ఆకాంక్ష' అన్నారు. 'కుఠారధార' అని పేరుంచడంలోగూడ ఇదే వుద్దేశ్యం. ఇందు భాషా సౌలభ్యం సాధించలేకపోయానని శ్రీ శర్మగారే తొలిపలుకుల్లో అంగీకరించారు. ప్రపంచ శాంతి, ప్రజాభ్యుదయం వీరి ఆశయాలు. 'నవచేతన' గేయంలో 'పరవర స్వజనాత్మకశక్తి, వశ్వ ముని శాపాగ్ని, వెరబండరాజు కోపాగ్ని, జ్వాలాముఖి కీలాగ్ని, నిఖిలేశ్వర్ ఫాలాగ్ని—ఇవన్ని ఈ నిష్ఠుర కుళ్ళు వ్యవస్థను భస్మంచేసి, నవసమాజం, సమసమాజం, నవమానవ సమాజం పునర్వ్యవస్థీకరించును' అని విప్లవ కవులను సాభిప్రాయంగా చమత్కారంగా ప్రశంసించారు. 'రాచబాట'లో ప్రతిపదం లోనూ సాయుధ విప్లవ పోరాటాన్ని బాగా ప్రేరేపించారు. ఇందు 'కవి కులం ముసలం, ప్రజాస్వామ్యం తిరువీధులు, నినాదాల వినోదాలు, రచనలు బాగున్నవి. శాబ్దికదృష్టి కొంత తగ్గించుకొంటే ఇంకా మంచి రచనలు ఇతని కలంనుండి వెలువడగలవని ఆకాంక్షించవచ్చు!

## గడ్డిపూలు

(నవకవిత)

(రచన : దొండపాటి రామారావు, వెల : 3-00. ప్రతులకు : భూదేవి పబ్లిషర్సు. చిత్తూరు.)

ఇందు ఇరవైనాల్గు నవకవితలున్నాయి. 'కవితా కుసుమాలు' అనే పేరుతో శ్రీ దాశరధిగారి పీఠిక గడ్డిపూలలోని నమ్రతాగుణ సౌరభ్యాన్ని చక్కగా వెదచల్లుతూంది. సాధారణంగా సౌరభంవున్న పూలకు వుపయోగం వుంటుంది. కాని గడ్డిపూలకు ఆ వాసన లేకుండుటే గుణం అంటూ, 'నరుని పాదాలపై లేదాయె నాకాస, స్వామి పాదాలపై తరుదాయెను మోజు, మోసగాని కంఠ మాలగా నా కొద్దు, నీతి లేనివాని పూజలో నే నొద్దు, జాతి పెరిగే చోట, నా జాతి మెండుగా పూలుగా బుట్టితే మేలు, గడ్డి పూలుగా బ్రతికెద చాలు' అన్నారు 'గడ్డిపూలు' అనే గేయంలో. ఇందులో కవిగారి ప్రకృతి ప్రేమతో పాటు, ప్రశాంత నిరాడంబర జీవనాకాంక్షగూడా వ్యక్తమౌతోంది. వీరి రచనల్లో నేటి సాంఘిక రాజకీయ సమస్యలుగూడా చాలవరకు తావు చేసుకొన్నాయి. 'మా పోటడిగే దెవ్వరు? ఏకంకండి, మా నిజరూపం, నాగరికత, మునసేరం, సామ్యవాదం, విధి అనే వానిలో నేటి సంఘంలోని కుళ్లును బాగా విమర్శించి, ఎన్నో గ్యాన్ని చూపారు. ఇందలి రచనల్లో 'పావురం' అనేది చాలా ఆకర్షణీయంగాను, అదర్శవంతంగానూ వుంది. ఏకపత్నీ వ్రతత్వం పావురంలోని విశిష్టత. శాంతి, ప్రేమ, ప్రణయాలకు పావురం గుర్తు. ఇది ఈ జగత్తుకే ప్రాణం, అని యిందలి దివ్య సందేశం! వీరి రచనలో నమ్రతతోగూడిన మార్దవ గుణం తొణికిసలాడుతూ వుంది.

## యువకవిత

(అభ్యుదయ గేయ సంకలనం. అభ్యుదయ రచయితల సంఘ ప్రచురణ : వెల రూ/. ప్రాప్తిస్థానం—ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్.)

ఇందు నూటొక్కమంది యువకవుల అభ్యుదయ గేయాలు కలవు. సంకలన కర్తలు సుప్రసిద్ధ రచయితలు శ్రీ అనిసెట్టి, శ్రీ సోమసుందర్‌గార్లు. 'యువకవులు స్వచ్ఛ హృదయులైన కళాజీవులేగాదు, భావి సమా... జంతో పోరాడే సమరనేత... మ కవితలను బల వత్తరమైన ఆయు... గా మార్చుతున్నారు. అదే మీకు ఈ 'యువ కవిత'లో ద్యోతకమౌతుంది. ఇది యువకవి హృదయ దర్పణం' అనిన సంకలనకర్తల వాక్యాలు ఈ ప్రచురణోద్దేశ్య ప్రయోజనాలను చక్కగా వెల్లడిస్తున్నాయి. శ్రీ కుందుర్తిగారు అభ్యుదయ కవిత్వోద్య మావశ్యకతను, యువకవుల మనస్తత్వాన్ని, కవితా ప్రయోజనాన్ని గూర్చి, 'యువకవితకు స్వాగతం' అనే ముందు మాటల్లో స్పష్టం చేశారు. ఇందులో ఇదివరకే లబ్ధప్రతిష్ఠులైన వారితోపాటు, ఇపుడే వికసిస్తున్న పూలు, ఇపుడే వుదయిస్తున్న సూర్యులూ వున్నారు. అభ్యుదయాన్ని చేతులెత్తి చాటించుచున్నట్లున్న గ్రంథ ముఖచిత్రం చాల అర్థవంతంగా వుంది. ప్రచురణకై వచ్చిన నాల్గు వందల రచనల్లో ఏరుకొన్నవి గనుక, ఇందలి నూటొక్క రచనలూ బాగున్నవనే చెప్పాలి. కానీ అందులోనూ, 'శాంతి కపోతం, యువతరం, కవితకు పరమార్థం, జనగణమన పాడతాను, తోడు—నీడ, నాకు సన్మానం చేయండి, గొంతెత్తోక, అర్చన, మనస్సాక్షిగా, మరపురాని కవి వాక్కు, చరమగీతి, నా కవిత, సూర్యస్పందనం, నా పయనం, కన్నీటిలేఖ—మొదలగునవి కొన్ని చాలా మనోహరంగా వున్నాయి. మొత్తంమీద ఇందలి రచనలన్నీ చాలా సంయమనం గల్గి, మానవ హృదయాలను చాలా మృదువుగా స్పందింప జేస్తున్నాయ్. 'ఇందలి గేయాలు ప్రస్తుత సమాజపు భయంకర స్థితిని నిరూపించే ఎక్సరే చిత్రాలు!; అఖో జగత్సహోదరుల ఆశలకు—ఆశయాలకు అక్షర రూపాలు!; అధర్మాన్ని, అన్యాయాన్ని, ఎదిరించి పోరాడే ఆయుధాలు!; నవసమాజ నిర్మాణ మహోద్యమ సారధులైన యువతీ యువకుల ఆశయాల జ్వాలాకీలలు!'—అనే అట్ట చివరి యీ నాల్గు వాక్యాలు అరసం వర్గలక్ష్య సాధానికి నాల్గు స్తంభాలు!!

## గుడి సెగుండె

(రచన : దేవరాజు మహారాజు. వెల: 2-00. ప్రకాశకులు:—చైతన్య ఆర్గనైజర్సు 1-10-132. అశోక్‌నగర్; హైదరాబాద్—20.)

ఇందు 18 రచన లున్నాయి. సామాజిక స్వరూపాన్ని శాస్త్రీయ దృక్పథంతో విశ్లేషించి, తెలంగాణా

మాండ ... కృతి యిది. ఇందలి పదాలు, భ ... తెలంగాణా పల్లె ప్రజల నిత్యవ్యవహారంలోనిది ...పట్టణంవల్ల, తదితర ప్రాంతాలవారికి ఇది అంతగా సులభగ్రాహ్యం కాదని పించినా, అచ్చటి జీవద్భాష నెరుంగుటకు ఇట్టి రచన కొంతవరకు తోడ్పడుతుంది.

ఇందలి భావాలు ప్రశస్త వాస్తవాలు. గ్రంథ ముఖచిత్రం గుడిసె. ప్రజల గుండెను చక్కగా వ్యక్తీకరిస్తూంది. 'లొటపెట' గేయంలో నేటి నాయకుల రంగుల మార్పిడిని, స్వార్థతను, 'గాడిద' నెపంతో చాల చక్కగా వెల్లడించి విమర్శించారు కవి. ఈ గేయంలో విప్లవతత్త్వం వ్యంగ్యంగా ప్రేరేపింపబడింది. 'బతుకు కొన' అనే గేయం చక్కని వ్యంగ్య రచన. 'స్మశానం' అనేది మంచి ప్రబోధాత్మక రచన. 'ఉగాది పచ్చడ'లోని రూపకాలంకారత హృదయాకర్షకంగా వుంది. 'దూడాడూడూ ఒసవన్నా' గేయంలో బానిసత్వం, అలసత, బాగా విమర్శింపబడ్డాయి. 'జెండ కాదు-గుండె ఎగిరేయ్' రచనలో, 'స్వాతంత్రమంటే జెండ ఎగిరేశేటోల్లేగని, గుండె ఎగిరేశేటో ల్లెంతమంది?' అన్న చివరి వాక్యంలో, నిజమైన దేశభక్తి జెండ ఎగరేయటంలో లేదనీ, అది గుండెల్లోనుండి వెల్లురికినపుడే సఫలమవుతుందనీ, చక్కని ప్రబోధం చేయబడింది. 'గుడిసెగుండె' గేయంలో బీద ప్రజల్లోని ధైర్యం, త్యాగం, సాహసం బాగా వివరింపబడినవి. ఇదే కృతిపేరుగూడ! 'యిసి తలు'లో నేటి సమాజంలోని కుళ్లు, మోసం, స్పష్టం చేయబడినవి. ఇలా ఇందలి రచనలన్నీ వాస్తవికతా దృక్పథంలో వున్నాయ్.

—శ్రీ పి. సి. యస్. శర్మ.

# గ్రంథ స్వీకారము

## అమ్మయ్యో! గాంధీ బ్ర కాడు

(ఏ కాం కి క)

రచన : శ్రీ వనం మధుసూదన్, వెల : రు. 1-50 ప్రాప్తిస్థానము : రచయితపేర, 19/1095, శంభునిపేట, వరంగల్-506005.

* *

## పావనీ శతకము

రచయిత : శ్రీ తూములూరు దక్షిణామూర్తి శాస్త్రి, ఉచిత ప్రతులకు : శ్రీ దెందుకూరి దుర్గాప్రసాద్, తెలుగుపండిట్, చాట్రాయి, కృష్ణాజిల్లా, కోరువారు 40 పైసలు పోస్టల్‌స్టాంపులు పంపవలెను.

* * *

## గేయమాల

(రెండవ భాగము)

గ్రంథకర్త : విద్వాన్ కోగంటి దుర్గామల్లికార్జునకవి, వెల రూ. 1-00. ప్రతులకు : రచయిత పేర, పామర్రు, కృష్ణాజిల్లా.

## బ్రహ్మ విద్య

(తెలుగు కఠోపనిషత్తు)

స్మృతి మాధురి (భక్తి కవితలు)

రచయిత: శ్రీ కె. టి. ఎల్. నరసింహాచార్యులు, వెల రు. 2-00, ప్రకాశకులు : శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు, కృష్ణాజిల్లా,

* * *

## శ్రీ వేంకటేశ్వర శతకము

రచన : శ్రీ మందరపు సత్యాచార్యకవి, వెల : రు. 1-00 ప్రచురణ ; ఆదర్శ కవితావిహార్, శివాలయం వీధి, విజయవాడ-1.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thamdu chetty Street, Madras 600001. Editor: S. Radhakrishna.

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



అక్టోబరు 1974

సంపుటము : 51 : సంచిక : 10 :

---

విడిపత్రిక వెల రూపాయిన్నర

ఆవేశం బంధాన్ని తెంచితే ఆలోచన కన్నీళ్లలో మునుగుతుంది.



సురేష్ మూవీస్

# చక్రవాకం

ఈస్ట్మన్ కలర్

నిర్మాత:
**డి.రామానాయుడు**

దర్శకత్వం:
**వి.మధుసూదనరావు**

కథ: అరికెపూడి (కోడూరి) కౌసల్యాదేవి
రచన: ఆచార్య ఆత్రేయ
సంగీతం: కె.వి.మహదేవన్
కెమెరా: మార్కస్ బార్ట్లే

విడుదల:
ఆంధ్ర-సీడెడ్
**నవయుగ ఫిలింస్**
నైజాం:
**విజయా సురేష్ పిక్చర్స్**

NVKR